
amazing
THAILAND
Always Amazes You
కనువిందు చేసే సంప్రదాయం మరియు
సంస్కృతి
థాయ్‌ల్యాండ్ యొక్క ఘనమైన సంస్కృతి వారసత్వంతో అవినాభావ సంబంధం కలిగిన వినోదభరిత అద్భుత దృశ్యమాలికను ఆవిష్కరించే, మంత్ర ముగ్దులను చేసే ప్రదర్శనలు మరియు కార్యక్రమాలను ఆస్వాదించండి.
టూరిజం అథారిటీ ఆఫ్ థాయ్‌ల్యాండ్ న్యూఢిల్లీ ఆఫీసు:
(పరిధిలోని ప్రదేశాలు: నార్తర్న్ మరియు ఈస్టర్న్ ఇండియా, బంగ్లాదేశ్, భూటాన్ మరియు నేపాల్)
B-9/1A (గ్రౌండ్ ఫ్లోర్), వసంత్ విహార్, న్యూఢిల్లీ–110057, ఫోన్: 91-11-41663567-69, 46741111,
ఫ్యాక్స్: 91-11-41663570/ ఇమెయిల్: tatdel@tat.or.th
టూరిజం అథారిటీ ఆఫ్ థాయ్‌ల్యాండ్ ముంబాయి ఆఫీసు:
(పరిధిలోని ప్రదేశాలు: వెస్టర్న్ మరియు సదరన్ ఇండియా, శ్రీలంక మరియు మాల్దీవులు)
4వ అంతస్తు, ఫ్రీప్రెస్ హౌస్, నెం.215, ఫ్రీ ప్రెస్ జర్నల్ మార్గ్, నారిమన్ పాయింట్, ముంబాయి–400021.
ఫోన్: 91-22-22042727-28, ఫ్యాక్స్: 91-22-22042729 ఇమెయిల్: tatmumbai@tat.or.th
వెబ్‌సైట్: www.tourismthailand.org
TAT ఇండియా బ్లాగ్: http://www.thailandamazesyou.in
ఫేస్‌బుక్: http://www.facebook.com/TourismAuthorityofThailandIndia

# అక్షర లక్షలు...




రామోజీ ఫౌండేషన్

# తెలుగు వెలుగు

సంపాదకుడు: **రామోజీరావు**

**సంపుటి : 2 , సంచిక : 3**

**నవంబరు 2013**

**పుటలు :** 100, **వెల :** రూ. 20

**సహకారం :** రామోజీ విజ్ఞానకేంద్రం



**ప్రకటనల కోసం :** +91 80081 51599, +91 90001 80608

**వివరాలకు :** సంపాదకుడు, తెలుగువెలుగు, రామోజీ ఫిల్మ్‌సిటీ, హయత్‌నగర్(మం.) రంగారెడ్డి - 501 512.

**ఫోను:** +91 8415 246 888

**మొబైల్:** +91 800 800 1656, +91 800 855 1842

**ఫ్యాక్సు:** +91 8415 305 018

**ఈమెయిల్:**

teluguvelugu@ramojifoundation.org





**Telugu Velugu**

Owned, Printed, published and Edited by Ramoji Rao on behalf of Ramoji Foundation, Ramoji Film City, Hayathnagar Mandal, Ranga Reddy District, Andhra Pradesh. Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally, Rangareddy District -500 072. RNI No: APTEL/2012/45352


**విన్నపం:** తెలుగు భాషాభివృద్ధి, పరిరక్షణ, మేధోమథనం 'తెలుగువెలుగు' ముఖ్య ఆశయాలు. మన భాషకు పుష్టి చేకూర్చే రచనలకు పత్రికలో అగ్రతాంబూలం లభిస్తుంది. ఈ రచనల్లో వెల్లడయ్యేవి రచయితల అభిప్రాయాలు మాత్రమేనని మనవి. ఇవన్నీ పత్రిక యాజమాన్యం, సంపాదకవర్గ అభిప్రాయాలు కానక్కర్లేదు. భిన్న భావజాలాలకు నిష్పక్షపాత వేదికగా ఈ పత్రిక నిలుస్తుంది.



# బడిలో తెలుగు ప్రాశన!

రాతలో మాటలో చక్కటి వ్యక్తీకరణ, చిక్కటి భావసాంద్రత ప్రస్ఫుటమయ్యే ఏ తెలుగు రచయితనైనా- పదాలమీద అంతటి పట్టు ఎలా సాధ్యపడిందో అడిగి చూడండి. వారి జ్ఞాపకాల పొరల్లో, స్మృతిపేటికల అరల్లో ఓ తెలుగు మాస్టారి బొమ్మ కదలాడి తీరుతుంది. నాడాయన పంచిన భావధార, పద సంపదపై పెంచిన మమకారం నేటికీ ఆ రచయితలో భాషా సంస్కారం జీవనదీ ప్రవాహమై కొనసాగడానికి మూలకారణాలని మీరు ఇట్టే పోల్చుకుంటారు. ఇప్పటి విద్యార్థుల్లో ఎంతమందికి అలాంటి గట్టి పునాది పడుతోంది? తరగతి గదిలో పాఠం చెబుతూ శిష్యులను మాతృభాషానురక్తులు చేయడంలో తన్మయత్వం చెందే గురువులు నేడు ఎందరున్నారు?

నిజామాబాద్ జిల్లాలోని మొత్తం 741 ఉన్నత, ప్రాథమికోన్నత పాఠశాలల్లో నూటపాతిక మందివరకు తెలుగు ఉపాధ్యాయుల కొరత పీడిస్తోంది. అటు విజయనగరం జిల్లాలో సుమారు మూడోవంతు తెలుగు భాషోపాధ్యాయుల ఖాళీలు భర్తీ కాకుండా ఉండిపోయాయి. జిల్లాలవారీగా తరతమ భేదాలతో ఇదే కథ! సవ్యంగా బోధించేందుకు చాలినంత సిబ్బంది లేరు, సకాలంలో పాఠ్యపుస్తకాలు అందవు. అందినా- కొరుకుడు పడని పదజాలం, క్లిష్ట శిష్టప్రయోగాలు ఎక్కువమందిని బెంబేలెత్తిస్తున్నాయి. మొన్న ఏప్రిల్‌నాటి పదో తరగతి పరీక్షల ఫలితాల్లో ఇరవై మూడున్నర వేలమందికి సున్నా మార్కులు వచ్చాయి. రెండేళ్లక్రితం పదో తరగతి తెలుగు పరీక్షలో 62వేలమందికిపైగా ఉత్తీర్ణత సాధించలేకపోయారు. తెలుగు నేలమీద పుట్టి పెరిగి ఆడుతూ పాడుతూ గట్టెక్కాల్సినవారు ఇలా పల్టీ కొట్టడానికి కారకులెవరో జవాబు చెప్పాల్సింది ప్రభుత్వమే!

ఏళ్లతరబడి పేరుకున్న నిర్లక్ష్యం ఒక్క ఉదుటున కొట్టుకుపోదు. ఉన్నట్టుండి పద్ధతులు మారిపోవు. నిజమే. ఆ మేరకు ప్రభుత్వమే హామీలు ఇచ్చినప్పుడు, వాటిని నిలబెట్టుకోవాల్సిన గురుతర బాధ్యత దానిపైనే ఉంటుంది. 2013ను 'తెలుగు వికాస సంవత్సరం'గా ప్రకటించారు. తెలుగుభాషకు ప్రత్యేక మంత్రిత్వశాఖ నెలకొల్పుతామన్నారు. అన్ని పాఠశాలల్లో తెలుగు బోధనను తప్పనిసరి చేస్తామన్నారు. సర్కారీ బడుల్లో తెలుగు భాషాబోధనకు కనీస మౌలిక వసతులు కల్పించడంలోనే రాష్ట్రప్రభుత్వం కిందుమీదులవుతోంది.

ప్రజానీకంలో ముప్పైశాతానికి తమ భాష చదవడం, రాయడం రాకపోతే- ఆ భాషకు చేటుకాలం దాపురించినట్లే. అలాగని 'యునెస్కో' ఏనాడో హెచ్చరించింది. మన మురిపాల తెలుగుకు అటువంటి దురవస్థ కలగకుండా చేయాల్సింది ఎంతో ఉంది. ఏ భాషాభివృద్ధికైనా వ్యూహరచన ఎలా ఉండాలో కర్ణాటక అనుభవం సోదాహరణంగా తెలియచెబుతుంది. అక్కడ కన్నడ భాషాభివృద్ధికి విస్తృతాధికారాలతో ప్రత్యేక మంత్రిత్వశాఖ అవతరించింది. కన్నడ ప్రాధికార సమితికి విస్తార నిధులిచ్చారు. భాషాభివృద్ధి, పాలనభాష అమలు నిమిత్తం తాలూకా స్థాయిదాకా అంచెలవారీ ప్రభుత్వ యంత్రాంగాన్ని కొలువు తీర్చారు. ఆ తరహా విశేషమైన చొరవ కొరవడిన ఇక్కడ తెలుగు వెలుగులు కొల్లబోతున్నాయి. అధికార భాషా వారోత్సవాలవల్ల ఏం ఒరుగుతోంది? తెలుగులో ఉత్తర ప్రత్యుత్తరాల నిర్వహణకు శిక్షణ తరగతుల ఏర్పాటు, అధికార భాషపై చర్చావేదికలు... ఇవేవీ ఎక్కడా అజాపజా లేవు. బడుల్లో తెలుగు బోధకులపట్ల ఎప్పుడూ చిన్నచూపే. పాఠశాల తరగతుల కాలక్రమ పట్టికలో తెలుగు బోధనకు కేటాయించే గంటలు- 'మరెంతో ముఖ్యమైన'వన్న పేరిట గణితం, విజ్ఞానశాస్త్రం, ఆంగ్లాల పద్దులో జమపడుతున్నాయి. తెలుగు పాఠాలకు ప్రత్యేకంగా సమయం కేటాయించడమెందుకన్న విపరీత ధోరణులు చాలాచోట్ల ఉపాధ్యాయులను మానసికంగా కుంగదీస్తున్నాయి. పోటీపరీక్షలు, విదేశీ ఉద్యోగాల వేలంవెర్రిలో మాతృభాషకు తగినంత ప్రాధాన్యం ఇవ్వని దుష్పరిణామాలివి. అమ్మభాషలో పట్టున్నవారికి ఇతర ఏ భాషలైనా, అంశాలైనా తేలిగ్గా ఒంటపడతాయన్నది శాస్త్రీయంగా రుజువైన సత్యం. ఆ స్పృహతో, తెలుగు బోధించేవారికీ సముచితంగా గుర్తింపు గౌరవం కట్టబెట్టాల్సి ఉంది.

పద్యపాదాల సొగసులు, గద్యభాగాల సౌరభాలు, అక్షయ సారస్వతంలో మణిమరకతాలు... ప్రాథమిక తరగతి విద్యార్థులకు అర్థం కాని పదబంధ ప్రహేళికలవుతాయి. పిల్లలవి పాలదంతాలు. కష్టమైనవీ క్లిష్టమైనవి పసిప్రాయంలోనివారికి కొరుకుడు పడవు. చెరకు గడల్లోంచి రసం తీసి వారికి అందించే బాధ్యతను అందిపుచ్చుకొనేలా తెలుగు ఉపాధ్యాయులను తీర్చిదిద్దాలి. ఈ పవిత్ర బాధ్యతను శాస్త్రబద్ధ ప్రణాళికతో నిర్వర్తించడమే, అసలైన సరస్వతీ అర్చన!

బతకలేక బడిపంతులన్న చందంగా ఉపాధ్యాయ వృత్తి మిగిలిపోకూడదు. ప్రజ్ఞావంతుల్నీ దండిగా తెలుగు బోధన రంగంలోకి ఆకర్షించేలా కంతల్ని పూడ్చిపెట్టాలి. గురువులు విద్యాలయాల్లో దీపాల వంటివారు. జ్ఞానకాంతులు విరజిమ్ముతూ మరెన్నో దీపాలు వెలిగించగల శక్తిసామర్థ్యాలను, అనువైన వాతావరణాన్ని ప్రభుత్వమే కల్పించాలి. తెలుగులో చదివితే ఉద్యోగాలు రావన్న అపోహ తొలగించాల్సిందిగా రాష్ట్ర ప్రథమ పౌరులు ఆమధ్య పిలుపిచ్చారు. తెలుగు నేర్చి, దీక్షా దక్షతలతో నేర్పేవారిని మాతృభాషా సముద్ధారకుల్లో తొలిశ్రేణికి చెందినవారిగా ప్రోత్సహించేలా విధివిధానాలు పదును తేలాలిప్పుడు. బడిలో ఈ తెలుగు ప్రాశనే అమ్మభాషకు శ్రీరామరక్ష!






**అలవాటు చేసుకోవాలి**

మాతృభాష పునరుద్ధరణకోసం తెలుగు వెలుగు చేస్తున్న కృషి అభినందనీయం. అనేక ఆంగ్ల పదాల్ని పరిపాలనలోనూ, మన నిత్య జీవితంలోనూ అవీ తెలుగు పదాలే అన్నట్లు వాడుతున్నాం. సాంకేతిక పదాలకు తెలుగు పర్యాయ పదాలు సృష్టించడంతో పాటు ఉన్న తెలుగు పదాలనూ, నుడికారాలనూ వాడటం అందరూ అలవర్చుకోవాలి. ప్రసార మాధ్యమాల వారు కూడా అనవసరంగా ఆంగ్ల పదాలను వాడటం తగ్గించాలి. తల్లిదండ్రులూ, ఉపాధ్యాయులూ పిల్లలకు మార్గదర్శకులు కావాలి. అందరూ ఆలోచించి మన పదాలను వాడాలి.

**- అబ్బూరి ఛాయాదేవి, హైదరాబాదు**

**రోగాన్ని వదల్చండి**

అమ్మనుడిని కాపాడుకోవడానికి అన్ని రంగాల వారూ వారి రంగంలో కొద్దిపాటి కృషి చేస్తే చాలు. అద్భుత ఫలితాలు వస్తాయి. న్యాయపాలనలో తెలుగు సదస్సు పెట్టారు. మరో ముఖ్య రంగం 'వైద్యం'. రోజూ కోట్లాది మంది ప్రజలు ఆసుపత్రులకు వెళ్తారు. మనకొచ్చిన వ్యాధి సమాచారం, పరీక్షా ఫలితాలు, మందులు ఏవీ... తెలుగులో ఉండవు. దయగల వైద్యులు తెలుగులో చెబితే తప్ప వ్యాధి వివరాలు తెలియవు. భాషాభిమానులైన వైద్యులు తల్చుకుంటే తెలుగుకు పట్టిన ఈ రోగాన్ని నయం చేయడం ఎంతపని?

**- కానూరి వెంకటేశ్వరరావు, పామర్రు, కృష్ణాజిల్లా**

**పిల్లలతో సంతకాలు పెట్టించాలి**

బళ్లో హాజరు పిలవడం బదులు వారితో తెలుగులో సంతకాలు పెట్టించాలి. అదే విధంగా తెలుగు అంకెలు కూడా నేర్పించాలి. ప్రతి విద్యార్థిచేత కనీసం వంద పద్యాలు కంఠస్థం చేయిస్తే ఆ విద్యార్థి తెలుగునూ, ఆ ఉపాధ్యాయుణ్ని జీవితాంతం గుర్తుంచుకుంటాడు.

**- ఉప్పాల మోహనబాబు, ఉయ్యూరు, కృష్ణా**

**ఆలోచనాత్మకం**

'మృగాళ్లంటారా! ఖబడ్దార్!' కథ ఆసక్తికరం. విమర్శ, కోపం ప్రదర్శించేవారికి ఉచితానుచితాలు గుర్తించాలని ఈ కథ గుర్తుచేస్తోంది.

**- ఆచార్య రాచపాళెం చంద్రశేఖరరెడ్డి, కడప**

**సమాచారం తెలుగులో ఇవ్వరా...?**

సమాచార హక్కు కమిషన్ను ఎన్నిసార్లు సమాచారమడిగినా ఆంగ్లంలోనే ఇస్తున్నారు. తెలుగులో ఎందుకు ఇవ్వడం లేదు?

**- ప్రభంజన్, విశాఖపట్నం**

**చిన్నకవితలకు అవకాశం**

తెలుగువెలుగు సంచిక ఆకర్షణీయం. విజ్ఞానదాయకం. వ్యాసాలకు, కథలకు ప్రాధాన్యమిచ్చినట్లు చిన్నకవితలకూ అవకాశమివ్వాలి. అన్ని అంశాలతో పాటు సమీక్షలూ బాగున్నాయి.

**- కె.నరసింహమూర్తి, హోసూరు, తమిళనాడు**

**గ్రంథాలయాల్లో ఉండాలి**

తెలుగు భాషాప్రియులకు తెలుగు వెలుగు పత్రిక చక్కటి విందుభోజనం. సాహిత్య సుగంధ పరిమళాలతో గుబాళిస్తున్న అక్షర పూదోట. అన్ని పాఠశాలల్లో, కళాశాలల్లో, గ్రంథాలయాల్లో ఉండాల్సిన పుస్తకమిది.

**- అలాజ్‌పూర్ లక్ష్మీనారాయణ, సిద్దిపేట, మెదక్**

**సమీక్షలు బాగున్నాయి**

పద్య దండకం బాగుంది. అది చదివిన తర్వాత నాకూ కూడా ఓ పద్యం రాయాలనిపించింది.

**మల్లావధాని గారలు**
**ఎల్లెడలన్ పద్య కవుల హృదిరుల్లనగా**
**అల్లిరి దండక మొక్కటి**
**ఎల్లరు పద్యాల శోభనీధర తెలియన్**

**- తంగిరాల నరసింహకుమార్, నెల్లూరు**

**కవితలు పెంచాలి**

వర్ధమాన కవులను ప్రోత్సహించేలా కవితల సంఖ్యను పెంచాలి. తెలుగు భాషాభివృద్ధికి కంకణం కట్టుకున్న తెలుగు వెలుగు ఆచంద్రార్కం వెలుగొందాలి.

**- గుర్రం శ్రీనివాస్, చెరుకుపల్లి, గుంటూరు**

**ప్రతి నెలా పద్యాన్నివ్వాలి**

ఈ తరం విద్యార్థులు పద్యాలు నేర్చుకునేలా ప్రతి నెలా భావంతో కూడిన పద్యాన్ని ఇవ్వాలి. భావితరానికి అవి మేలు చేస్తాయి.

**- వి.ఎస్.పారిజాత, హైదరాబాదు**

**సమాచారాన్ని పెంచాలి**

పోటీ పరీక్షలకు ఇస్తున్న సమాచారం ఇంకాస్త పెంచాలి. ఇంకా ఆసక్తికరమైన కొత్త శీర్షికలు ప్రవేశపెట్టాలి.

**- పి.సాయిజ్యోతి, అవురుపల్లి, మహబూబ్‌నగర్**

**మాండలికాలను పరిచయం చేయాలి**

ప్రతి నెలా మాండలిక కథలు ఇస్తున్నారు. బాగున్నాయి. అవి ఏ మాండలికం అనేది కూడా క్లుప్త పరిచయం ఇవ్వాలి.

**- ఎన్.నరేశ్, అత్తాపూర్, హైదరాబాదు**

**మంచి సాహిత్యం**

తెలుగు వెలుగు సంచికలో అందరికీ ఉపయుక్తమైన మంచి సాహిత్యాన్ని అందిస్తున్నారు.

**- ఎ.సువర్ణ, బెంగళూరు**

**అంతా ప్రత్యేకమే...**

తొలి వెలుగులు అనే శీర్షిక ప్రత్యేకంగా ఉంది. మన పాతసంపదను కొత్త తరానికి అందిస్తున్నందుకు అభినందనలు. మాటకట్టులో అంకెల పరిమాణం పెంచాలి.

**- పులిపాటి దుర్గారావు, విజయవాడ**

**రచనలకు ఆహ్వానం**

'కపిలవాయి సాహిత్యదర్శనం' గ్రంథ ప్రచురణకు కపిలవాయి లింగమూర్తిపై రచనలను ఆహ్వానిస్తున్నారు. వివరాలకు: 90328 44017

**కవితలకు ఆహ్వానం**

ఎక్స్‌రే సాహిత్య సాంస్కృతిక సేవాసంస్థ కవితల పోటీ నిర్వహిస్తోంది. వివరాలకు: 98484 48763

**కవితా సంకలనాలకు ఆహ్వానం**

'రంగినేని ఎల్లమ్మ సాహిత్య పురస్కారం' కోసం 2011-13 మధ్య ప్రచురితమైన కవితా సంకలనాలను ఆహ్వానిస్తున్నారు. వివరాలకు: 98490 12459

# ఇలా నేర్పించేద్దాం

**నిమిషమైనను మది నిల్పి నిర్మలముగ**
**లింగ జీవావేశులను గాంచి భంగపడక**
**పూజ మదియందు జేరుట పూర్ణపదవి**
**పరము గోరిన నిదిచేయ బాగు వేమా**

పనులెన్ని ఉన్నా సరే, క్షణకాలమైనా తీరిక చేసుకుని నిర్మలమైన మనసుతో, నిశ్చలమైన బుద్ధితో పరమాత్మను పూజిస్తే మోక్షం సిద్ధిస్తుందనేది దీని అర్థం. పిల్లలకు చక్కటి తెలుగు నేర్పాలనుకునే తల్లిదండ్రులకు మార్గోపదేశం చేసే వేమన వాక్కు ఇది.

కాలమాన పరిస్థితుల రీత్యా పిల్లలను ఆంగ్ల మాధ్యమంలో చదివించక తప్పట్లేదు... ఆ పాఠశాలలోనేమో తెలుగు నేర్పించట్లేదు... అలాగే వదిలేస్తే పిల్లలకు మన భాష రాకుండా పోతుంది... మరేం చేయాలి... వాళ్లకు తెలుగు ఎలా నేర్పించాలి... అని ఆలోచిస్తున్నారా? అయితే... ఒక్కమాట!

తెలుగు నేర్పాలన్న తపనలో... తెలుగు వాచకాలను తెచ్చి పిల్లల ముందేసి చదువు... చదువు... అంటూ ఒత్తిడి తేకండి. నాలుగు రోజుల్లో మొత్తం భాషంతా వచ్చేయాలన్న ఆదుర్దా ప్రదర్శించకండి. నిర్ణీత కాలంలో సాటివారితో తెలుగులో ధారాళంగా మాట్లాడగల, తప్పుల్లేకుండా చదవగల, రాయగల నేర్పు సాధించేలా చూడండి. అందుకు ఏం చేయాలంటే...

పిల్లలకు ఏం నేర్పాలన్న దానిపై మీకో స్పష్టత ఉండాలి. వ్యాకరణం, పద సంపద, వాక్య ప్రయోగాలు... ఇలా అనేక అంశాలపై దృష్టి పెట్టొద్దు. మీ లక్ష్య సాధనకు తగిన అంశాన్ని మాత్రమే తీసుకోవాలి. నిర్దేశించుకున్న కాలపరిమితిలో దానిపై చిన్నారులకు పట్టు వచ్చేలా ఉండాలి. ముప్పై రోజుల్లో లక్ష్యం సాధించాలని నిర్ణయించుకున్నారనుకోండి... ముందు పదసంపదపై దృష్టి సారించండి. ఏ భావనను ఏమంటారు, ఏ వస్తువును ఏమని పిలుస్తారు తదితరాలను నిత్య జీవిత ఉదాహరణలతో వివరించండి. రోజుకు ఓ అరగంట చదివించండి చాలు. అంతకంటే ఎక్కువ అయినా పిల్లలకు విసుగు పుడుతుంది. అంతేకాదు... చిన్నారికి పాఠాలు చెప్పే ప్రదేశాన్ని (గది/ హాలు) తెలుగుమయం చేయండి.




అంటే, తెలుగు అక్షరాల ఛార్టులు అంటించడం, పదాలు - బొమ్మలతో ఉండే చిత్రాలను ఉంచడం తదితరాలన్న మాట. వాటిని చూస్తూ... మీరు చెప్పే మాటలు వింటూ చిన్నారులు భాష నేర్చుకుంటారు.

అలా నేర్చుకున్న అంశాలను పాఠశాలకు వెళ్లి వస్తున్నప్పుడు, బయటకు వెళ్లినప్పుడు మననం చేసుకోమని చెప్పడం మాత్రం మర్చిపోవద్దు. దాని వల్ల 'విషయం' గుర్తుండిపోతుంది. (స్నానం చేయిస్తున్నప్పుడు, నిద్ర పుచ్చుతున్నప్పుడు కూడా సాధన చేయిస్తుండవచ్చు) అంతేకాదు... ఆ రోజు బాబు చూసిన, చేసిన పనులను తెలుగులో చెప్పమనండి. మధ్యమధ్యలో మీరు 'మాట' సాయం చేయండి. చెప్పిన విషయాలను తనకొచ్చిన పద్ధతిలో రాయమనండి. తప్పొప్పులు సరిదిద్దండి. పిల్లల ముందు మీరెప్పుడూ తెలుగులోనే మాట్లాడండి. బంధువులు వచ్చినప్పుడు వారిని తెలుగు వరుసల్లోనే పరిచయం చేయండి. చివరగా... చుట్టుపక్కల వాళ్లతో, బంధువులతో తెలుగులోనే మాట్లాడమని చెప్పండి. వచ్చీ రానీ భాషలో మాట్లాడుతున్నా... నవ్వకండి. నవ్వొద్దని మిగిలిన వాళ్లకూ చెప్పండి. (నవ్వితే పిల్లలు చిన్నబుచ్చుకుంటారు) అలాగే, తెలుగు పత్రికలను బిగ్గరగా చదివించండి. కూడబలుక్కుని చదువుతున్నా... ఓపిగ్గా వింటూ ఉచ్చారణ దోషాలను సరిదిద్దండి. తెలుగు టీవీ కార్యక్రమాలను కూడా చూపించండి. బయటకు తీసుకెళ్లినప్పుడు దుకాణాల పేర్లు, ప్రకటనలను చదివించండి. పరిసరాల్లో కనిపించే వస్తువులు, జంతువుల పేర్లను తెలుగులో చెప్పమనండి. రహదారిపై వెళ్తున్న వాహనాల సంఖ్యను కూడా 'తెలుగు'లో లెక్కపెట్టించవచ్చు. అలా అలా సాధన చేయిస్తే... పిల్లాడికి తెలుగు దానంతట అదే వస్తుంది. చలనచిత్రాలు, సంగీతం, అంతర్జాలం తదితరాలను కూడా ఉపయోగించుకోవచ్చు. ఈ పద్ధతిలో నేర్చుకున్న భాష... జీవితాంతం తోడుగా ఉంటుంది. పుస్తకాలను బట్టీ పట్టిస్తే మాత్రం 'విషయం' మెదడు దాకా వెళ్లదు. 'గొంతు'లోనే ఆగిపోతుంది. గుర్తుంచుకుంటారు కదా!

**- తెలుగు వెలుగు బృందం**

# నువ్వులేని వెలితి లోంచి

ప్రేమలేఖల పోటీలో రూ.1116 గెలుచుకున్న లేఖ

'నక్షత్రాలన్నింటితో ఆకాశమూ, అంతులేని ఐశ్వర్యాలతో ప్రపంచమూ అన్నీ నాకు ఉన్నా ఇంకా కావాలని అడుగుతాను. కానీ ఈ ప్రపంచంలో మరీ చిన్న మూల కాస్త చోటుంటే చాలు, ఆమె నాదైతే...' నీ కోసం వెతుకుతున్నప్పుడల్లా ఠాగూర్ మాటలు నా నేపథ్యంలో మృదువిషాదంతో చలిస్తూనే ఉంటాయి! ఇంతకూ ఎవరు నువ్వు? ఎక్కడ ఉన్నావు? ఎంతకాలం నీకోసం దుఃఖిత హృదయంతో వెదకాలి?

వసంతకాలపు గాలుల్లా తాజాగా, చల్లగా ఊహలు సంచరించటం మొదలైన తొలి యవ్వన దినాల నుంచీ వెతుకుతూనే ఉన్నాను. కలలూ, అమాయకత్వమూ, కాస్తంత దయ కదలాడే ప్రతి స్త్రీమూర్తి కళ్లలోనూ, చిరునవ్వులోనూ నీ ఉనికి కోసం తడుముకొంటూనే ఉన్నాను. బంగారు వన్నెలో మెరిసే ఆఖరు సూర్యకిరణంలాంటి చిరునవ్వు వెనుక నన్ను దాచుకొని వాళ్లని 'ఆమె నువ్వేనా' అని అడుగుతాను. వీణతంత్రుల్లో మేల్కొనే రాగాల్లోకి, గాలివాలు వెంట పూలు సుతారంగా పరచే పరిమళాల లోకాల్లోకి నా చేయి పట్టుకొని పసిపిల్లలా సునాయాసంగా మాయం కాగలితే నీ కోసం, ఆకాశమో, లేదంటే సముద్రమో హత్తుకొన్నట్టు నన్ను దగ్గరికి తీసుకునే నీవంటి స్త్రీ కోసం వెదుకుతూ, వాళ్లని 'నువ్వేనా' అని అడుగుతాను. కానీ, వాళ్లింకా జీవించటం మొదలుపెట్టని మామూలు యువతులు. ప్రపంచం రాసులుగా పోసి చూపించే అనుభవాల ఎండమావుల వెనుక పరుగెత్తే సాధారణ స్త్రీలు. నా ప్రశ్న వినగానే, ఉదయకాంతిలో వెలవెలబోతున్న వెన్నెలలాంటి చిరునవ్వులతో వాళ్లు దూరతీరాలకు తరలిపోతారు. పక్షిలా వాళ్ల వెలుతురు ఎగిరిపోయాక, వాలుతున్న రాత్రి లోలోపలికి ఒదిగిపోయి ముసురుకొన్న చీకటిని నీ ఒడిగా తలచుకొని మొహం దాచుకొని కన్నీటి కెరటాల్లో ఊగిసలాడుతాను.

స్వేచ్ఛలోకి పక్షులు పాడే పాటలూ, లోకాన్ని మరచి రమ్మని పూలు పంపే రంగురంగుల ఆహ్వానాలూ, నల్లమబ్బుల అంచున దిగులు చివరి చిరునవ్వుల్లా మెరిసే వెండితీగల సంగీతమూ, ఏకాంత రాత్రుల్లోకి అలలుగా ప్రవేశించే సముద్రమంత లోతైన నిశ్శబ్దమూ నా ఉనికిని తాకుతున్న ప్రతిసారీ, నువ్వు నా పక్కన ఉంటే బాగుండునని కలగంటాను. నువ్వు లేని వెలితిలోకి నన్ను విసిరేసుకొని గమ్యం లేకుండా తిరుగుతూ సమస్త సృష్టినీ ఆమె ఎక్కడ ఉందో చెప్పమంటూ బతిమాలుతాను. చల్లటి నదిలాంటి వెన్నెల తనలోకి నన్ను మృదువుగా హత్తుకొంటున్నప్పుడు ఆ మెత్తని కాంతి నువ్వు రహస్య లోకాల నుంచి పంపిన ప్రేమగీతంలా తలచుకొంటాను.

నువ్వు ఎవరో ఇప్పటికీ తెలియదు. కానీ, బహుశా, ఏ యుగాల వెనుకనో, నాపై నువ్వు చూపిన గొప్ప ప్రేమా, నీ కళ్లలో వెలిగిన దయా, నా పసిదనపు ఉద్వేగాలపై చల్లిన చల్లటి క్షమా లీలగా నన్ను తాకుతూనే ఉంటాయి. ఇప్పుడిక, జీవితం మలిసంధ్య వైపు వాలుతోంది. తెగినదండ నుంచి ముత్యాలు రాలినట్టు నా రోజులు జారిపోతున్నాయి. నిన్ను కనుగొనగలనన్న ఆశ దూరమవుతున్న ఓడ తెరచాపలా కనుమరుగవుతోంది. బహుశా, ఇక నువ్వు కనిపించవు. ఏ ప్రయాణపు మలుపులోనో తటాలున నువ్వు ఎదురై 'నేనే' అని చిరునవ్వు నవ్వినా, పరాకున నిన్ను గుర్తుపట్టగలనో, లేనో కానీ, నువ్వున్నావు గనుక, నా ఉనికి లోలోపల నీ కోమలస్పర్శ తెలుస్తోంది. నిన్ను వెదికే చూపుల్ని నీరెండలా పరచి నా పరిసరాలని ప్రేమమయం చేసుకొంటున్నాను. ఏ రహస్య రూపంలో సమీపిస్తావోనని ప్రతి మనిషిలో నిన్ను చూస్తూ ప్రేమగా తాకటం నేర్చుకొంటున్నాను.

చిరకాలపు వియోగం తరువాత నువ్వు నా నుదుటిని ముద్దు పెట్టుకొంటున్న ఉద్వేగం నాలోంచి తోసుకువస్తోంది. ఇక చాలు. ఈ ప్రయాణం త్వరగా ముగించాలి. చేయాల్సిన పనులు వేగంగా పూర్తి చేయాలి. త్వరగా నిన్ను చేరాలి.

కన్నీటి బిందువుల్లాంటి అక్షరాలని ముగించి, ఏకాంత రాత్రి విసిరే చీకటి మైదానాల వెంట, నిశ్శబ్దాల వెంట, తప్తదేహాన్ని విడిచి నన్ను నీలోకి విసిరేసుకోవాలనే గాఢనిద్రల వెంట... మెలకువలో అడుగైనా ముందుకు పడని స్వప్నంలోని పరుగుతో... ఉద్విగ్నతతో... ఎవరు నువ్వు నుంచి ఎవరు నేనులోకి... సృష్టి అంతా పొగమంచులో మాయమయ్యాక పొగమంచు మాయం కావటంలోకి... ఎవరూ, ఏదీ లేకపోవటంలోకి... దేహాల, దేశాల, కాలాల అవతలికి ఇదిగో, ఇక్కడే ఇప్పుడే నిన్ను చేరుకోవటంలోకి...

- బి.వి.వి.ప్రసాద్
తణుకు, పశ్చిమగోదావరి
90320 75415



# సెలవుకింక సెలవ్!

ఉదయం 8 గంటలు! ఎప్పటిలాగే గోపాలం ఫోనులోని అలారం కిచకిచలాడింది. ఎప్పటిలాగే గోపాలం దుప్పటిలోంచి చేయిచాచి అలారం సమయాన్ని 8.25కి మార్చబోయాడు. ఆ ప్రయత్నంలో మూడు లోకల్‌కాల్సూ, రెండు ఎస్టీడీలూ వెళ్లాక చివరికి అలారం మార్చబడింది. కానీ ఎప్పటిలాగే గోపాలం మళ్లీ పడుకోలేదు.

జీవితం ఎప్పుడూ ఎప్పటిలాగే ఎందుకుండాలి? పెరట్లో పడక్కుర్చీ



వేసుకుని దేవదాసు పాటలు వినాలి, వచ్చేపోయే కాకుల్ని గమనిస్తూ ప్రకృతితో మమేకమవ్వాలి, అజీర్ణం చేసేదాకా ఆరారగా టీలు తాగాలి... అన్నింటికీ మించి ఇవాళ ఆఫీసులో జరిగే ఆడిట్ నుంచి తప్పించుకోవాలి - అంచేత ఇవాళ సెలవు పెట్టాలి!

8.25కి అలారం మోగడంతో గోపాలాన్ని లేపడానికి వాళ్లావిడ గదిలోకి వచ్చింది. అప్పటికే దుప్పటిలోంచి ఓరగా చూస్తున్న గోపాలం 'నేనివాళ ఆఫీసుకి వెళ్లనుగా!' అన్నాడు బుంగమూతితో. పిల్లలకైతే బుంగమూతి బాగుంటుంది కానీ బుగ్గలుసాగిపోయి, బట్టతలతో ఉన్న గోపాలానికి అది నప్పలేదు. అందుకని వాళ్లావిడ మొహం మరింత చిరాగ్గా మారింది.

తన మాటలకి భార్యలో ఎటువంటి చలనమూ లేకపోయేసరికి ఈమారు ఆర్ద్రతని ప్రయోగించాడు 'ఈ జీవిత పోరాటంలో అలసిపోయాను కమ్మూ అలిసిపోయాను! నాకొక్క రోజు విశ్రాంతి కావాలి, ఈ అనంత..'

'మీ పై అధికారి ఒప్పుకోవద్దూ?' ఒక్క ప్రశ్నతో గోపాలం ఆర్ద్రతని ఆవిరి చేసేసింది అతని భార్య కమల.

ఆ దెబ్బకి సెలవనే జలతారు కాస్తా పాములాగా మారిపోయి పారిపోయింది. అయినా అతని ఆశ చావలేదు. భయంభయంగా పై అధికారికి ఫోన్ కలిపాడు. ఒక్కో ఫోన్ రింగుకీ గోపాలంలోని పాత భయాలన్నీ నిద్రలేవసాగాయి. ఇక తట్టుకోలేనేమో అనుకునే సమయానికి 'హలో!' అన్న గొంతు కరుగ్గా వినిపించింది. అంతే! అప్పటిదాకా వేసుకున్న రిహార్సల్సన్నీ చెదిరిపోయాయి. ఇక భయాలే మిగిలాయి.

"సర్! నేను గోపాలాన్ని సర్! ఇవాళ ఒంట్లో బాగోలేదు. ఆఫీసుకి రాలేను సర్" - 'హమ్మయ్య చెప్పేశాను'

"ఏ ఏమైంది?"

'ఏమైంది, ఏమైంది ఆ..' "సర్! నిన్న మూడో అంతస్తు మీద నుంచి కిందపడ్డాను (ఎక్కువేమన్నా చెప్పానా?), పెద్దగా దెబ్బలేవీ తగల్లేదు సర్! (అసలు తగలకుండా సెలవెలా ఇస్తాడు) తల కాస్త బొప్పి కట్టింది (బొప్పి చూపించమంటే!) దాంతో విపరీతమైన తలనొప్పి వచ్చింది సర్ (హు! తలనొప్పికి సాక్ష్యాలుండవుగా)"

అంతా విన్నాక పై అధికారి నిట్టూర్పొకటి భారంగా వినిపించింది. ఆ నిట్టూర్పుకి నానార్థాలు వెతుక్కునేలోపు 'సరే! ఒళ్లు జాగ్రత్త' అన్న సమాధానం వచ్చింది. అది హెచ్చరికో, జాగ్రత్తో గోపాలానికి అర్థం కాకపోయినా, సెలవు దక్కిందని మటుకు అర్థమైంది.

ఆ సంతోషంలో ఏదైతే చెప్పకూడదనుకున్నాడో అదే చెప్పాడు 'కృతజ్ఞతలండీ! నేను ఆడిట్ వల్ల ఆఫీసు మానేయడం లేదు. నిజంగానే తలనొప్పిగా

ఉందండీ' అని... వెంటనే ఫోన్ కట్ అయింది!

నోరు జారినందుకు గోపాలం పశ్చాత్తాపంతో పిచ్చిచూపులు చూస్తూ ఉండగా, రెండు చేతుల్లోనూ ఏవో జరజర పాకినట్లైంది. పరిశీలించగా ఒక చేతిలో గుడ్డసంచీ, మరో చేతిలో కూరగాయల చీటీ.. ఎదురుగుండా వాళ్లావిడా! 'ఎలాగూ సెలవే కదా. కాస్త ఆ రైతుబజారుకి వెళ్లి కూరలు పట్రండి' అనేసి మారుమాటకి తావివ్వకుండా లోపలికి వెళ్లిపోయింది.

***

రైతుబజారులో అతిజాగ్రత్తగా పుచ్చు వంకాయలూ, ముదురు బెండకాయలూ ఏరుకుని ఇల్లు చేరుకున్న గోపాలం ఇకపై రోజంతా ఎలా ఆస్వాదించాలో ప్రణాళికలు సిద్ధం చేసుకున్నాడు - వాటిలో భాగంగానే వంటింట్లోకి కేకలు వేశాడు "కమ్మూ! ఇవాళ భోజనం అద్దిరిపోవాలి. ముద్దపప్పూ, బంగాళదుంప వేపుడూ, ఉల్లిచారు.. అన్నీ వేడివేడిగా ఉండాలి".

భోజనం సిద్ధమయ్యేలోపల ఏం చేయాలో అప్పటికే నిర్ణయించుకున్నాడు. తరతరాలుగా పడక్కుర్చీలో కూర్చుని జీవితాన్ని ఆస్వాదించడం వాళ్ల వంశాచారం. అందుకని మంచం కిందికి నెట్టివేయబడ్డ పాత పడక్కుర్చీని బయటకు లాగాడు. దాని దుమ్ము దులిపీ, తుడిచీ, బోల్టులు బిగించేసరికి ఓ గంట గడిచిపోయింది.

ఎట్టకేలకు మాలీషు చేసిన గుర్రంలాగా దాన్ని ఠీవిగా హాల్లోకి లాక్కుని వచ్చాడు. కానీ ఆ ఆనందం ఎంతోసేపు నిలువలేదు. కుర్చీలో కూర్చుని ఓసారి గదంతా కలియచూశాడో లేదో.. అతనిలోని కర్మయోగి కించపడ్డాడు.

గదిలో ఒక మూల రెండు సాలీళ్లు కలిసి మరో తాజ్‌మహల్‌ని కడుతున్నాయి, పెళ్లినాటి ఫొటో దుమ్ముతో ఏదో విషాదానికి సూచనగా వేలాడుతోంది, అద్దాల బీరువాలోని టెడ్డీబేర్లు మడ్డీబేర్లుగా మారి బావురుమంటున్నాయి, సోఫా తనపై కూర్చున్నవారి మీద తిరగబడ్డానికి సిద్ధంగా ఉంది!

పెరట్లో తిరిగే పిల్లుల్ని కూడా స్నానం చేయించేంత శుభ్రత గోపాలానిది.

'అలాంటి తన ఇంట్లో ఇంత అస్తవ్యస్తమా!' మూలిగిందతని మనసు. మూలిగిందే తడవుగా ఆ గదిని శుభ్రం చేయడం మొదలుపెట్టాడు.

ఓ సమరంలా జరిగిన ఆ సర్దుడుని వర్ణించడం కష్టం. సాలీళ్లని తరిమికొట్టాడు, బల్లుల్ని భయపెట్టాడు, దశదిశలా వ్యాపించిన దుమ్ముని రేగ్గొట్టాడు. ఈ తతంగమంతా ముగిసి స్నానం చేసేసరికి 12:30! తువ్వాలుతో ఒంటికి మెరుగులు దిద్దుతుండగా, వంటింట్లోంచి బంగాళదుంపలు వేగుతున్న వాసనా, ఉల్లిచారులోని పోపు ఘాటు గోపాలం ముక్కుపుటాలని గిలిగింతలు పెట్టాయి.

**గదిలో ఒక మూల రెండు సాలీళ్లు కలిసి మరో తాజ్‌మహల్‌ని కడుతున్నాయి, పెళ్లినాటి ఫొటో దుమ్ముతో ఏదో విషాదానికి సూచనగా వేలాడుతోంది**

భోజనాల బల్లపైకి చేరుతున్న పదార్థాలు విందుభోజనానికి ముందుమాటల్లా ఉన్నాయి.

***

ఆవిర్లు కక్కుతున్న అన్నంలో చేయి పెట్టాడో లేదో, హఠాత్తుగా వాతావరణంలో ఏదో మార్పు - ఫ్యాన్ ఆగిపోయింది! 'ఒంటిగంట నుంచి మూడింటి వరకూ కరెంటుండదు' అన్న ప్రకటన తాపీగా వంటింట్లోంచి వినిపించింది. వేడివేడి పదార్థాల్ని నాలుకతో చల్లార్చుకుని తినేసరికి గోపాలం 'దుంప' తెగినంత పనయ్యింది.

మళ్లీ మూడింటికి ఫ్యాను రెక్కలు కదిలేసరికి గోపాలంలోని జీవికి ఊరట కలిగింది. కష్టం తర్వాత వచ్చే సుఖం విలువ తెలియడానికే ప్రభుత్వం ఈ విద్యుత్ కోతల్ని ఏర్పాటు చేసిందన్న సత్యం తెలిసొచ్చింది. ఆ సుఖఛాయలోనే నిద్రలోకి జారుకున్నాడు. నాలుగింటికి అలా మాగన్నుగా నిద్రపట్టిందో లేదో.. దబదబా తలుపులు బాదిన శబ్దాలు. తలుపులు తెరచుకునేందుకు అవి విజ్ఞప్తుల్లా లేవు, తుది హెచ్చరికల్లా ఉన్నాయి.

సగం లుంగీని నేలపై ఈడ్చుకుంటూ గోపాలం తలుపుతీయగానే, బిలబిలమంటూ నలుగురు సహోద్యోగులు లోపలికి ప్రవేశించారు "ఇహ్హిహ్హీ! నీకు ఒంట్లో బాగోలేదంటే చూసి వెళ్దామని వచ్చాం. ఆఫీసరుగారు గంట అనుమతి కూడా ఇచ్చారు" అన్నాడు పక్కసీటు ప్రకాశం మురిపెంగా.

ఆపై.. ఎలా పడ్డావు? ఎందుకు పడ్డావు? తాగి పడ్డావా? నువ్వూ మీ ఆవిడా కొట్టుకున్నారా? లాంటి ఓ నూట యాభై ప్రశ్నలు వేసి గోపాలం సృజనాత్మకతని తీవ్ర క్షోభకి గురిచేశారు. తర్వాత అతని తలనొప్పి తగ్గేందుకు రకరకాల మార్గాలను సూచించారు. 'గుమ్మడిపూల వాసన చూస్తే తగ్గిపోతుంది' అని ఒకరంటే, 'అరటికాయ పచ్చడికి తగ్గిపోతుందని' మరొకరన్నారు.. ఆపై వారి జీవితంలో తలనొప్పి వచ్చిన సందర్భాలన్నీ ఏకరవు పెట్టారు. ఈ పరామర్శ క్రతువులో భాగంగా గోపాలం అందించిన చేగోడీలనీ, తేనీరునీ సేవించి ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ బయల్దేరారు.

'అన్నట్టు చెప్పడం మర్చిపోయా! ఇవాళ ఆడిట్ జరగనేలేదు. రేపటికి వాయిదా పడింది' అన్నాడు ప్రకాశం వెళ్తూ వెళ్తూ. ఆ మాటలకి గోపాలం కళ్లు బైర్లు కమ్మాయి.

అక్కడితో గోపాలం సెలవు విషాదం ముగిసిపోలేదు.

మరో అరగంట తర్వాత కమల చక్కటి చీర కట్టుకుని వచ్చి 'ఇవాళ సెలవే కదా! అలా సినిమాకి వెళ్లొద్దాం పదండి' అని హుకుం జారీ చేసింది.

'సినిమానా! నాకు అంత ఓపిక లేదు కమ్మూ!' అని మూలిగాడో లేదో.. పెళ్లైన తర్వాత తాము ఏఏ కళాఖండాలను చూడలేకపోయామో, పెళ్లి తర్వాత ఎలాంటి సరదాలూ, సినిమాలూ లేక తమ జీవితం ఎలా మోడువారిపోయిందో అన్న పరిశోధనా పత్రాన్ని మరోసారి వినాల్సి వచ్చింది.

ఆపై ఇక తప్పనిసరి పరిస్థితుల్లో సందు చివరే ఉన్న ఓ హాలుకి బయల్దేరారు. కొత్త సినిమా కావడంతో గంటకి పైగా

క్యూలో నిలబడి, టికెట్ల కోసం కలబడి.. చివరికి సీట్లలో కూలబడిన తర్వాత కానీ ఆ పూట సినిమా చూడబోతున్నామన్న సంతోషం

> **"ఎలా పడ్డావు? ఎందుకు పడ్డావు? తాగి పడ్డావా? నువ్వా మీ ఆవిడా కొట్టుకున్నారా?"**

కలుగలేదు. ఆ సంతోషం ఎంతోసేపు నిలువనూ లేదు. తెర తడిసిపోతుందా అన్నట్లు కథలో రక్తం ఏరులై పారింది. సీట్లు కదిలిపోతాయా అన్నట్లు సుమోలు గాల్లోకి ఎగిరాయి. సినిమా ముగిసేసరికి తామే పోరాటాల్లో పాల్గొన్నంతగా అలసిపోయారు గోపాలం దంపతులు.

***

ఉదయం 8 గంటలు! ఎప్పటిలాగే గోపాలం ఫోనులోని అలారం కిచకిచలాడింది. కానీ ఎప్పటిలాగే గోపాలం దాన్ని మార్చడానికి ప్రయత్నించలేదు. రాత్రి మొదలైన తలనొప్పికి అసలు నిద్ర పడితే కదా!

'పోనీ ఇవాళ కూడా సెలవు పెట్టరాదూ!' జాలితో అంది కమల.

ఆ మాటలకి గోపాలం ఉలిక్కిపడుతూ 'అమ్మో సెలవా! ఇంకేమన్నానా?' అంటూ ఒక్క ఉదుటున మంచం మీద నుంచి దిగాడు. ఆపై నిర్లిప్తంగా 'మన మధ్యతరగతి జీవితాల్లో సెలవులు కూడానా!' అంటూ బాత్రూం వైపు కాళ్లీడ్చుకుంటూ వెళ్లాడు.




**కె.ఎల్.సూర్య**
హైదరాబాదు.
93934 72410


# ఒక సజీవయాత్ర



ఎడారులెంట నడచి నడచి
ఒయాసిస్సు వొడ్డున
ఆ రోజు నేను వేసిన విత్తనం
మొలకెత్తి పెరిగి పెద్దదై
ఈ రోజు ఎందరికో నీడనిచ్చి
చేతినిండా ఫలాలు రాల్చి
నా యాత్రలో నిలిచిన నేస్తం!
వేగంగా పారే నదిలోకి
నేను విసిరేసిన కొబ్బరికాయ
చేతికందకుండా
ప్రవహించి ప్రవహించి
సముద్ర గర్భంలో లీనం
కాగానే
కెరటాల కేరింతలతో
ఆడిపాడి ఉవ్వెత్తున పైకెగిసి
తీరానికి చేరిన
ఆ కొబ్బరికాయే
ఆకలితో అలమటించే
ఒక అనాథ చేతిలో
ఆనందంగా ఉత్సాహంగా
విచ్చుకుంది!
ఏమి ఇచ్చినా సముద్రం
దాచుకోదు,
తిరిగిచ్చేసి/ నిండా
జలకాలాడిస్తుంది,
సంపాదన నదిలా ఉరకలెత్తినా
సాగరంలా తిరిగి ఇచ్చే
జీవితమే
మానవ జీవన సాగరం
అదే నింగి నుంచి నేలదాకా
నిరంతర సజీవయాత్ర!!


**- నిఖిలేశ్వర్,** హైదరాబాద్




## పాఠకులకు ఆహ్వానం

**తెలుగు వెలుగు యజ్ఞంలో పాలు పంచుకునేందుకు మీకు భాషలో పెద్దగా పాండిత్యం లేకపోయినా ఫర్వాలేదు. అమ్మభాష అంటే గుండెల నిండుగా ప్రేమ, ఉత్సాహం మీ సొంతమైతే ఇదే మా ఆహ్వానం. మీలాంటి వారి కోసమే కొత్త కొత్త శీర్షికల్ని పరిచయం చేస్తున్నాం. రండి మీరూ పాల్గొనండి. 29,44,45,59,83,87 పుటల్లోని ప్రకటనల్ని చూడండి!!**

## ఆణిముత్యాల్ని ఏర్చండి!



మతం బ్రతుకులో చొచ్చుకుపోవడానికి బదులు, దానికతీతమై వెళ్ళడం. కావలిస్తే వొకటితో వొకటి పోట్లాడుకుంటాయికాని, యీ మతాలు మనుషుల బాగుకోసం ఆలోచించవు, ప్రయత్నించవు. ప్రస్తుతం మతాలు బాగుకన్నా చెడ్డే ఎక్కువ చేస్తున్నాయి. ఇంతకీ ఈ మతవైరాల వల్ల బాధపడేది సామాన్య ప్రజలు. ఇప్పటి కొట్లాటల్లోలాగ కార్లలో తిరిగేవారికి యే బాధా వుండదు. వారు మాత్రం యీ కక్షలకు నాయకులై పలుకుబడి పదవులూ డబ్బూ సంపాదించుకుంటారు. ఇదే మతం చేస్తున్న ముఖ్యమైన సేవ"

..అంటారు సెట్టి ఈశ్వరరావు 'హిందూ-ముస్లిం' కథలో

ఇలా మీరు చదివిన వాటిలో అద్భుతమైన భావవ్యక్తీకరణల్ని తరచూ గుర్తు చేసుకుంటూ, సందర్భానుసారం ఉట్టంకిస్తూ ఉండొచ్చు. అలాంటి ముత్యాలసరాల్ని మాకు పంపండి. బాగున్న వాటిని ఎంపిక చేసి తెలుగు వారందరితో పంచుకుందాం. వాటిని రాసిన రచయిత పేరు, అది ప్రచురితం అయిన పుస్తకం పేరు, పుట సంఖ్య అన్నవి తప్పక పేర్కొనాలి.

# తెలుగు భాష బంగారం... అందులో ఎంతో సింగారం

"అమృతం గొప్పదా? తెలుగు భాష గొప్పదా?"

- ఈ ప్రశ్న నన్నడగండి చెబుతా. అమృతం ఉందో లేదో తెలీదు. ఒకవేళ ఉన్నా... అది అమ్మభాషంత కమ్మగా ఉండదని నా నమ్మకం. అలాంటి నా తెలుగు భాషా సౌందర్యాన్ని ఏమని పొగడాలి? ఎలా వర్ణించాలి? నేను కవిని కాదాయె. వర్ణనలు తెలియవాయె. కేవలం నటుణ్ని. అయితేనేం..? ఎన్నో అద్భుతమైన సంభాషణలు పలికే అవకాశం వచ్చింది. సుందరమైన భావాల్ని నింపుకొన్న పాటలకు అభినయించే అదృష్టం దక్కింది. అందుకే జన్మజన్మలకూ నేను తెలుగు భాషకి రుణపడి ఉంటా.



జయకృష్ణ

'అప్పు...డే తెల్లారిందా?' - 'అప్పుల అప్పారావు' ఈ సంభాషణతోనే ప్రారంభం అవుతుంది.

భాషని తెలివిగా విరిస్తే ఎంత అర్థం మారిపోయింది. ఎంత వినోదం పుట్టింది..? ఇలా నా సినీ జీవితంలో ఎన్నో.. ఎన్నెన్నో.. భాషాస్మృతులు. అసలింతకీ భాషని ఆస్వాదించే గుణం నాకెలా అబ్బిందో తెలియాలంటే నా సంగతులు కొన్ని మీకు చెప్పాల్సిందే.

నిమ్మకూరు మాస్టారు అబ్బాయిని..! నా భాష గురించి ప్రస్తావించే ముందు ఆయన గురించి కాస్త చెప్పుకోవాలి. మా నాన్నగారు మహా నిక్కచ్చి మనిషి. ఆయన ముందు నేనూ ఓ విద్యార్థినే. మా నాన్నగారు భావ ప్రకటనకు ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చేవారు. ఆయన ముందు తత్తత్త.. బేబ్బేబ్బే అని నసిగితే కుదరదు. మనసులో అనుకొన్నది వాక్య నిర్మాణ దోషం లేకుండా చెప్పేయాలి. 'నీకేం కావాలో నువ్వు చెప్పలేనప్పుడు నేనేం ఇవ్వగలను?' అనేవారు. ఆ మాట నాలో బాగా నాటుకుపోయింది. మా అమ్మకి సంగీతం వచ్చు. ఆమె మాటే పాటలా ఉండేది. నా మాటల్లో స్పష్టత రావడానికి నాన్నగారు ఓ కారణమైతే... శ్రావ్యత తోడవడానికి అమ్మ మూలం.

బళ్లో చదువుకొన్న తెలుగు... మార్కుల వరకే. జీవితానికి కావాల్సిన చదువు... నందమూరి తారక రామారావుగారి దగ్గర నేర్చుకొన్నా. నా తెలుగు కథలో ఆయనెందుకు వచ్చారు.. అనుకొంటున్నారా? ఆయన మాకు దగ్గరి బంధువే. నేను చేసుకొన్న పుణ్యం కొద్దీ రామారావుగారి సాహచర్యం నాకు దక్కింది. మద్రాస్‌లో ఫిల్మ్ ఇనిస్టిట్యూట్‌లో చదువుకొంటున్న రోజుల్లో వీలున్నప్పుడల్లా రామారావుగారిని కలుసుకొనేవాడిని. వెళ్లగానే..

- 'ఏదీ... ఆ సొరుగులో ఓ పుస్తకం ఉంది తీయండి..' అనేవారు.

అక్కడ రామాయణమో, భాగవతమో కనిపించేది.

'రెండువందల పదిహేడో పేజీ తీయండి..' అనే వారు.

కిమ్మనకుండా తీసేవాణ్ని.

'ఇప్పుడు చదవండి' అని ఆజ్ఞలాంటిది వేసేవారు.

చదవడం అంటే... లోలోపల కాదు. అందరికీ వినిపించేలా. రామారావుగారి ముందు మాట్లాడటమంటేనే బెరుకు. అలాంటిది పద్యాలు చదవడమంటే..? అయినా ధైర్యం తెచ్చుకొని చదివేవాణ్ని. 'ఆc.. ఇప్పుడు చెప్పండి. ఆయన ఏమంటారూ..?' అనేవారు. దానికి అర్థం చెప్పాల్సిందే. ఒకవేళ తెలియకపోతే కనుక్కొని మరీ చెప్పేవాణ్ని. అది నా భాషా సామర్థ్యానికి రామారావుగారు పెట్టిన పరీక్ష. ఇప్పుడు ఎలాంటి సంభాషణనైనా అవలీలగా పలుకుతున్నానంటే కారణం... ఆయనే. మహానుభావుడు... ఆయనకు శతకోటి దండాలు. అక్కడే త్రివిక్రమరావు, పుండరీకాక్షయ్యలు ఉండేవారు. పుండరీకాక్షయ్యగారు తెలుగులో దిట్ట. 'కృష్ణావతారం', 'మహామంత్రి తిమ్మరుసు' స్క్రిప్టులు నాచేతిలో పెట్టి చదవమనేవారు. ఈ సినిమాలు తీసింది ఆయనే. ఆ సినిమాల్లో ఎంత కమ్మని భాషండీ...? ఒక్కొక్క పద్యమూ చదువుతుంటే ఒళ్లు పులకించిపోయేది. ఏ పదాన్ని ఎక్కడ నొక్కాలి, ఇంకెక్కడ స్పష్టంగా పలకాలి? భావయుక్తంగా ఎలా చెప్పాలి? ఈ విషయాలన్నీ వీరి సాంగత్యంలోనే నేర్చుకొన్నా. ఈ గురువులకీ... పాదాభివందనాలు. రాజేంద్రప్రసాద్ మాట్లాడే భాష వినడానికి బాగుంటుంది అనే పేరొచ్చిందంటే కారణం.... వీరే.

* * *

ఫిల్మ్ ఇనిస్టిట్యూట్‌లో నల్లబల్లపై ఓ వాక్యం నన్నెప్పుడూ ఆకర్షిస్తుండేది. "జీవితంలో ప్రతీదీ అనుకరణతో మొదలవుతుంది. ప్రతిసృష్టితో పూర్తవుతుంది" అని. భాష కూడా అంతే కావచ్చు. తన బిడ్డని ఒళ్లో కూర్చోబెట్టుకొని 'అ... మ్మా...'

అంటూ అమ్మ తొలి పలుకులు నేర్పుతుంది. బిడ్డ అమ్మ పెదాల కదలికలను అనుకరి స్తుంది. అక్కడే భాషతో మన ప్రయాణం ప్రారంభమవుతుంది. అలా.. తొలి గురువు స్థానం అమ్మకి దక్కింది. అమ్మ నేర్పే భాష కాబట్టే అది అమ్మ భాష అయ్యింది. భాష నేర్చుకోవడం అంటే నాదృష్టిలో సంస్కృతిని, సంప్రదాయాన్నీ, పద్ధతులనూ నేర్చుకోవ డమే. ప్రతీ తల్లీ తన బిడ్డకు కొన్ని కథలు చెబుతుంది. అక్కడి నుంచి సాహిత్యంపై ప్రేమ పుడుతుంది. అమ్మమ్మలు సామెతలు వల్లిస్తుంటారు. భాషపై మమకారం రెట్టింపు అవడానికి అవి దోహదం చేస్తాయి. అసలు తెలుగు భాషా సౌందర్యం సామెతలూ, నుడి కారాల్లోనే ఉందంటే అతిశయోక్తి కాదేమో..?

**అడ్డాలనాడు బిడ్డలు కానీ గెడ్డాలనాడు కాదు**

- ఎంత శ్రుతి ఉందండీ ఈ సామెత లో? ఒక్క వాక్యంలో ఎంత గొప్ప భావం.

**కడుపు చించుకొంటే కాళ్లమీద పడుతుంది**

కడుపు చించుకోవడం ఏమిటీ? అది కాళ్లమీద పడటం ఏమిటీ? జీవితానికీ, అను బంధాలకూ సంబంధించిన లోతైన విష యాన్ని ఇలా ఎలా చెప్పేశారు?

ఇవి మాత్రమేనా..? మరి పద్యం మాటో..? అది తెలుగువాడి సొత్తు. తెలుగు వాడికి మాత్రమే దక్కిన అద్భుతమైన నిధి. ఈ విషయం తెలిసినప్పుడల్లా గుండె గర్వంతో ఉప్పొంగుతుంది. "దేవ బ్రాహ్మణ మాన్యముల్ విడచి..." ఇలాంటి పద్యాలు పాడుతున్నప్పుడు, అందులో భావాన్ని మన సుకి ఎక్కించుకొన్నప్పుడు... ఆహా ఇది కదా మన తెలుగు భాష... అనిపిస్తుంది.

* * *

అనుభవమే అన్నీ నేర్పిస్తుంది అంటారు. నా వరకు అది నిజం. నేనేం తెలుగు భాషని పుస్తకాలు చదివి నేర్చుకో లేదు. అసలు పుస్తకాలే చదవను. వినడం నాకు చాలా ఇష్టం. రేడియోలో అద్భుత మైన నాటకాలొచ్చేవి. ఏ పనిచేసుకుంటున్నా ఓ చెవి అటు పడేసేవాడిని. ఎవరైనా ఏదైనా ఓ పదం కొత్తగా వాడితే... ఇట్టే పట్టేసేవాడిని. నిజానికి నాకు ఇప్పటికీ స్క్రిప్టు బట్టీపట్టే అలవాటు లేదు. ఎవరైనా చదివితే వింటా. అంతే. ఇక నా దర్శకుల గురించి చెప్పుకోవాలి. డీవీ నరసరాజు, జంధ్యాల, వంశీ... పెద్ద జాబితాయే ఉంది. వీళ్లు నా భాషనీ, నా యాసనీ మార్చేశారు. ముళ్లపూడి వారైతే మరీనూ. 'పెళ్లిపుస్తకం', 'మిస్టర్ పెళ్లాం' సినిమాలు చేశా ఆయనతో. భలే మాటలు. ఆయన 'పంచదార' అని రాసేవారు కాదు. 'పందార' అనేవారు. వంశీ అయితే గోదావరి యాస నా బుర్రలోకి ఎక్కించేశారు. ఇంట్లోవాళ్లు 'ఏరా ప్రసాదూ..' అని పిలిస్తే చటుక్కున 'ఆయ్c...' అనేసే వాణ్ని 'ఆయ్.. అంటున్నావేంట్రా సచ్చి నోడా?' అని ఆటపట్టించేవారు.

పాత సినిమాల్లో మాటలు చాలా గంభీ రంగా ఉండేవి. 'ప్రభూ ఏమిటి మీ ఆన.. వచ్చుచుంటిరా..?' ఇలా సాగిపోయేవి. ఆ తర్వాత 'గుండక్కో.. గుండక్కా' అంటూ మాటలు వచ్చేశాయ్. ఇది సినిమాల్లో భాషాపరంగా వచ్చిన మార్పు. మేధావులతో, భాషా ప్రేమికులతో పనిచేయడం వల్ల.. నాకూ కొంత భాషాజ్ఞానం అబ్బింది. అవస రమైన చోట రెండు మాటలు మనమే అన గలిగే పరిస్థితి. పెద్ద పెద్దవాళ్ల మాటలన్నీ వినేసి. మనసులో దించేసుకొని నాకు కావా ల్సినపుడు .. వాడేసేవాడిని. అది నాకు బాగా కలిసొచ్చింది.

* * *

బంగారంతో ఏ వస్తువైనా చేసుకో వచ్చు. ఎన్ని మెరుపులైనా తీసుకురావచ్చు. తెలుగు భాష కూడా బంగారం లాంటిదే. దానికి ఎన్ని సొగసులో, ఇంకెన్ని మెరు పులో. స్వర్ణకారుడి పనితనాన్ని బట్టి బంగారానికి వన్నెలొస్తాయి. భాషకీ అంతే. అది వాడుకునే వాడి సత్తాపై ఆధారపడి ఉంటుంది. తెలుగు పాదరసం లాంటిది. ఎలాంటి ఆకారమైనా తీసుకొం టుంది.

ఏందివయ్యా గట్లా చెబుతావ్...

ఎప్పుడొచ్చేసినావ్‌రా బాబూ..

యాండే పెసాదుగారో.. బాన్నారా...?

ఆయ్c.. రండి భోంచేద్దురుగానీ.. - ఎన్ని రూపాలు, ఇంకెన్ని శ్రుతులూ..? అన్నిచోట్లా తెలుగే. కానీ దాన్ని వాడుతున్న విధానం వేరు. ఓసారి నెల్లూరు వెళ్లా. అక్కడొకాయన.. 'బజారుపోయి గుడ్లెత్తుద్దాం రా' అన్నాడు. నాకు కంగారేసింది. బజారు పోయి గుడ్డలు ఎత్తడం ఏంటండీ అసహ్యంగా ఉండదూ..? అనుకున్నా. కానీ అక్కడ గుడ్లెత్తుదాం అంటే.. - బట్టలు కొనుక్కొందాం అని అర్థమట.

కర్నూలు కడపల్లో దొబ్బడం అంటారు.. అంటే తొయ్యడం. మా కృష్ణా జిల్లాలో దొబ్బడం అంటే... బూతు. ప్రాంతం ప్రాంతానికి ఎన్ని వైవిధ్యాలు. ఒక్కొక్క యాసదీ ఒక్కో సౌందర్యం. అవన్నీ నా పాత్రల ద్వారా పలికే అవకాశం వచ్చింది.

'తులసీదళం', 'ముత్యమంత ముద్దు', 'ఏప్రిల్1 విడుదల' ఇవన్నీ నాకు మంచి పేరు తీసుకొచ్చిన సినిమాలు. అయితే ఇవి ముందు నవలారూపంలో వచ్చాయి. గమ్మ



తేమిటంటే ఈ నవలలు నేను చదవలేదు. చదివితే.. ఓ రకమైన ఊహాజనిత ప్రపంచంలోకి వెళ్లిపోతానేమో.. దానికి లోబడే నటిస్తానేమో అనే భయం. 'నవల చదవకుండానే అంత బాగా చేశావా?' అని యండమూరి వీరేంద్రనాథ్ కూడా ఆశ్చర్యపడిపోయేవారు. పాటలు.. మాత్రం చక్కగా వింటా. కార్లో కూర్చుంటే ఏదో ఓ పాట. ఘంటసాల, జిక్కి, సుశీల, పీబీ శ్రీనివాస్... మరీ ముఖ్యంగా భానుమతి, మంగళంపల్లి బాలమురళీకృష్ణ - ఎవరిని కాదంటాం?

ఆత్రేయ, కృష్ణశాస్త్రి, వేటూరి.. ఎవరిని వద్దంటాం..?

"పట్టుచీర కడితే ఓ పుత్తడి బొమ్మా ఆ కట్టుబడికి తరించదా పట్టుపురుగు జన్మా"

"రాధా మాధవుణ్ణిలే - ప్రేమారాధకుణ్ణిలే "

- ఎన్ని చక్కని భావాలో..?

'ఆ నలుగురు', 'మీ శ్రేయోభిలాషి', 'ఓనమాలు' ఈ సినిమాలు చూశారంటే మరో రాజేంద్రప్రసాద్ కనిపిస్తాడు. ఆ సంభాషణల్లో జీవన సత్యాలు దాగున్నాయి.

"రూపాయీ రూపాయీ నువ్వేం చేస్తావ్ అని అడిగితే, హరిశ్చంద్రుడి చేత అబద్ధమాడిస్తాను. భార్యా భర్తల మధ్య చిచ్చు పెడతాను, తండ్రీ కొడుకులను విడదీస్తాను, అన్నదమ్ముల మధ్య వైరం పెంచుతాను, ఆఖరికి ప్రాణ స్నేహితులను సైతం విడగొడతాను అందట"

"చదువుకుంటానంటే డబ్బులిస్తా, చదువు కొంటా అంటే ఇవ్వను"



ఇలాంటి మాటలు పాత్ర ఔచిత్యాన్ని పెంచుతాయి. రఘురామ్ పాత్ర ఇప్పటికీ కళ్లముందు కదలాడుతోందంటే దానికి కారణం... ఇలాంటి సంభాషణలే.

నాకు రాయడం కూడా అలవాటు లేదు. కానీ ఓ సందర్భంలో నాలోని భావుకుడు బయటకు వచ్చాడు. ఆ సందర్భం మీతో పంచుకోవాలనిపిస్తుంది. రచయిత జొన్నవిత్తుల, నేనూ ఓసారి చిలుకూరు వెళ్లి వస్తుంటే మధ్యలో గోశాల కనిపించింది. అక్కడ మూడొందల ఆవులున్నాయి. అన్నింటికీ దూడలున్నాయి. అయితే ఆవులు ఓ చోట. దూడలోచోట కట్టేశారు. నాకు పెద్ద అనుమానం వేసింది. దూడలన్నీ ఇంచుమించు ఒకేలా, ఒకే రంగులో ఉన్నాయి. ఏ ఆవుది ఏ దూడో ఎలా తెలుస్తుంది? తన దూడని గుర్తించి ఆవు పాలు ఎలా ఇస్తుంది. ఇదే అక్కడివారిని అడిగా. 'కాసేపు ఆగండి.. మీకే తెలుస్తుంది' అన్నారు. పాలిచ్చే సమయం వచ్చింది. దూడలకు కట్లు విప్పేశారు. ఒక్కో దూడకూ ఒక్కో పేరు ఉంది. 'కల్యాణి...' అని పిలవగానే ఆ దూడ పరుగెట్టుకొంటూ తల్లి దగ్గరకు వెళ్లిపోయేది. 'శాంభవీ..' అనగానే మరో దూడ.. అమ్మ దగ్గరికి పరిగెట్టేది. ఈ సన్నివేశం చూసి నాకు ఏడుపొచ్చేసింది. ఎందుకంటే చిన్నప్పుడే తల్లి ప్రేమకు దూరమయ్యా కదా. అదంతా నాకు ఓ అద్భుతంగా అనిపించింది. వచ్చేస్తున్నప్పుడు గోశాల వాళ్లు ఓ పుస్తకం చేతిలో పెట్టారు. మీరు మా అతిథులు. వెళ్లేటప్పుడు ఏదో ఒకటి రాయండి.. అన్నారు. నాకా రాయడం చేతకాదు. కానీ.. ఆ సందర్భంలో మాత్రం కలం కదిలింది. "ఆవు ఆవులోన అమ్మ కనిపిస్తుంది. అమ్మ పాల కొరత ఆవు తీరుస్తోంది" అంటూ ఓ రెండు వాక్యాలు రాశా. మన భావాలే భాషగా మారతాయనే విషయం నాకు తొలిసారి అర్థమైంది. 'ప్రసాదూ.. నీ జీవిత కథ రాయి..' అంటుంటారు బాగా తెలిసినవాళ్లు. నేను రాయగలను అనే విషయం ఆ గోశాలలో తెలిసింది. ఆ స్ఫూర్తితోనే ఎప్పటికైనా నా కథ రాస్తా. అచ్చమైన తెలుగులో.

* * *

ఇప్పటి సినిమాల్లో తెలుగు భాష ఏమైపోతోంది? ఈ సామెతలూ, నుడికారాలూ ఉంటున్నాయా? పాటల్లో అంత సాహిత్య విలువలు ఉంటున్నాయా? ఇలాంటి కంగారేం వద్దు. ఎందుకంటే మార్పు అనివార్యం. అయితే ఈరోజుల్లో కూడా మంచి భాష వినపడుతోందంటే.. రచయితలూ, దర్శకులూ చదువుకొన్నవాళ్లు రావడం వాళ్లకు తెలుగు భాషపై మమకారం ఉండటమే కాదు. ఓ ముళ్లపూడి వెంకట రమణ, ఓ జంధ్యాల, ఓ వంశీ, ఓ త్రివిక్రమ్.. ఇలా ప్రతి తరంలోనూ ఎవరో ఒకరు వస్తుంటారు. ఆ బాధ్యత భుజాన వేసుకొంటారు. ఆ నమ్మకం నాకుంది. అయితే ప్రభుత్వం కూడా భాషా పరిరక్షణకు చర్యలు తీసుకోవాలి. చాలా అమూల్యమైన పుస్తక సంపద ఉంది మనకు. పునర్ముద్రణకు నోచుకోని పుస్తకాలు ఎన్నో ఉన్నాయి. వాటన్నింటినీ ప్రభుత్వం గుర్తించి అలాంటి పుస్తకాలను పాఠకులకు అందుబాటులో తేవాలి. మరీ ముఖ్యంగా ఓ తెలుగు వాడిని మరో తెలుగు వాడు గౌరవించడం నేర్చుకోవాలి. దూరమైతేగానీ మనసులూ, మమతల విలువలు తెలీవు. తెలుగు భాషని దూరం చేసుకొని ఆనక తీరిగ్గా బాధ పడొద్దు. ఇప్పుడే కళ్లు తెరుద్దాం. తెలుగు భాషనీ, మాట్లాడుతున్నవారినీ గౌరవిద్దాం.

- రాజేంద్రప్రసాద్



**అన్వర్,** హైదరాబాదు
80087 09985

# గ్రీకు వీరుడు



**అమ్మో! తెలుగులో మాట్లాడటమే! ఆంగ్లం రాకుండాపోదూ!!!**

కొందరి అభిప్రాయమిది. పిల్లల నోటివెంట తెలుగు మాట వస్తే చాలు... కంగారు పడిపోతారు. కోప్పడతారు. 'ఇంకెప్పుడూ తెలుగులో మాట్లాడ'మంటూ చిన్నారుల చేత ప్రమాణాలూ చేయిస్తారు. ఆంగ్లం రావాలంటే తెలుగును మరచిపోవాలన్న భావన వట్టి భ్రమ. అమ్మభాషను సక్రమంగా నేర్చుకుంటే తర్వాత ఎన్ని భాషలనైనా ఔపోసన పట్టవచ్చు. ఆంగ్లమే కాదు ఫ్రెంచి, జర్మన్, చైనీస్, రష్యన్... ఇలా ఏ దేశ భాషలోనైనా గలగలా మాట్లాడవచ్చు. కావాలంటే.. ఇయోన్నిస్ ఐకనొమౌను చూడండి. యూరోపియన్ కమిషన్‌లో ప్రధాన అనువాదకుడిగా పని చేస్తున్న ఈ 'గ్రీకు వీరుడు' 32 భాషల్లో అనర్గళంగా మాట్లాడగలడు.

గ్రీస్‌లోని క్రీట్‌కు చెందిన ఐకనొమౌకు చిన్నప్పటి నుంచి 'మాట'లంటే ఇష్టం. అందుకే చుట్టుపక్కల ఎవరేం మాట్లాడినా ఆసక్తిగా గమనించే వాడు. ఆరేళ్ల వయసుకే తన మాతృభాష గ్రీక్‌లో పట్టు సాధించాడు. అప్పట్లో క్రీట్‌కు ఎక్కువ సంఖ్యలో పర్యాటకులు వచ్చేవారు. స్వతస్సిద్ధ ఆసక్తితో వారి మాటలను వినడానికి ఐకనొమౌ ప్రయత్నించేవాడు. అయితే... శబ్దాలు తప్ప భావాలను పసిగట్టలేకపోయేవాడు. దాంతో వారి భాషను నేర్చుకోవడానికి సంసిద్ధుడయ్యాడు. క్రమంగా ఆ భాషలోనూ పట్టు సంపాదించాడు. ఆ భాష మరేంటో కాదు ఆంగ్లమే. అది నోటికి చిక్కాక ఇతర భాషల మీద మనసు పారేసుకున్నాడు. రెండేళ్లలో జర్మన్ నేర్చేసుకున్నాడు. పదో ఏడు పుట్టినరోజు జరుపుకోవడానికి కొద్ది రోజుల ముందు నాటికి ఇటాలియన్‌లో కూడా అనర్గళంగా మాట్లాడగల నేర్పును సాధించాడు. ఉన్నత పాఠశాల విద్యను అభ్యసిస్తూ రష్యన్, టర్కిష్, అరబిక్‌లలో ప్రావీణ్యం సంపాదించాడు. ఆ తర్వాత చైనీస్, పోలిష్, ప్రాచీన పర్షియన్, లాటిన్, అవెస్థన్, ఆర్మేనియన్, ఐరిష్ తదితర 32 భాషలను తన నాలుకపై నిలుపుకున్నాడు. ఇంకో మాటండోయ్! మనవాడు మన సంస్కృతంలో కూడా గొప్పగా మాట్లాడగలడు. అంతేకాదు... 'సంస్కృతాన్ని నేర్చుకునేటప్పుడు దాంతో ప్రేమలో పడ్డా. అది చాలా ఏళ్లు కొనసాగింద'ని చెబుతాడు కూడా. మరో మాట... మనం మరచిపోయిన పాళీ భాష కూడా తనకు కరతలామలకమే.

భాషాశాస్త్రంలో పట్టా పుచ్చుకున్న ఐకనొమౌ... కొలంబియా విశ్వవిద్యాలయం (అమెరికా)లో మధ్యప్రాచ్య భాషలపై స్నాతకోత్తర విద్యను చదివాడు. ఇండో యూరోపియన్ భాషాకుటుంబంపై హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో పీహెచ్‌డీ చేశాడు. 2002లో బ్రస్సెల్స్ (బెల్జియం)లోని యూరోపియన్ కమిషన్‌లో ఉద్యోగంలో చేరాడు. ప్రస్తుతం అక్కడ ఉన్న వాళ్లలో చైనీస్ పత్రాలను అనువదించగల ఏకైక వ్యక్తి మనవాడే. ఇంతకూ ఇన్ని భాషలు ఎలా నేర్చుకోగలిగావు అంటే... 'ఏముంది మనం నేర్చుకోవాలనుకుంటున్న భాషను ప్రేమించాలి. ఆ భాషను మాట్లాడే ప్రజలను, వారి సంస్కృతులను ఇష్టపడాలి. అధ్యయనం చేయాలి. దాంతో పాటు నేను ఆ భాషలో వెలువడే పత్రికలను చదువుతా. టీవీ ఛానళ్లను చూస్తా'నని చెబుతాడు.

ఐకనొమౌ లాంటి బహుభాషాకోవిదు లెందరో! మన దివంగత ప్రధాని పీవీ నరసింహారావుకు 14, హైదరాబాదు రాష్ట్ర ముఖ్యమంత్రిగా పనిచేసిన దివంగత బూర్గుల రామకృష్ణారావుకు 18 భాషల్లో పాండిత్యం ఉన్న సంగతి తెలిసిందే. మధ్యప్రదేశ్‌లోని చిత్రకూట్‌కు చెందిన జగద్గురు రామభద్రాచార్య నాలుక మీద 22 భాషలు నాట్యమాడతాయి. గమనార్హం ఏంటంటే ఆయన రెండు నెలల పసిగుడ్డుగా ఉన్నప్పుడే కంటి చూపును కోల్పోయారు. బ్రెయిలీ లిపి సాయం కూడా లేకుండానే ఆయన అన్ని భాషలనూ ఔపోసన పట్టారు. అమ్మభాషను నిరాదరించే వారికి ఇతర భాషలేవీ సంపూర్ణంగా పట్టుబడవు. పచ్చని చెట్టంటూ ఉంటేనే కదా చిలకలు వచ్చి వాలేది. అమ్మభాష కూడా అంతే. జ్ఞాన సముపార్జనకు అవసరమైన ఆలోచనకు ఆది అదే.

**- తెలుగు వెలుగు బృందం**



**ఫ్రెండ్:** ఏంట్రా ఇలా దిగాలుగా కూర్చున్నావ్?
**రాము:** 'వదిలించుకునేదెలా?' అనే పుస్తకం చదువుతున్నప్పుడు మా ఆవిడ చూసిందిరా..?

# శిథిల గీతం

పలుపులిప్పి ఒక్కొక్కరు వాళ్ల పశువుల్ని రువ్వాయన మేపే జంగిడి పశువుల్లో తోల్తావుండారు. అయ్యేసే పేడ కింద పడ కుండా గంపల్ని వాటెనక పెడతావుండారు. అక్కడక్కడా దూసిపోయి కిందపడ్డ పేడని సరోజమ్మ కాలితో ఒద్దుగా తోసి తనది అన్నట్టుగా చూస్తావుంది. ఆమె నోటికి జడిసి అసలైనోళ్లు కిందపడ్డ పేడమీద తమ హక్కులు వదులుకుంటావుండారు. మా పశువుల్ని కూడా జంగిడి పశువుల్లో తోలాను. పేడెత్తే ఓపిగ్గూడా లేదు. పొద్దు బాగా పైకెక్కి ఎండ చుర్రుమంటావుంది. నోట్లో యాప్పుల్లేసుకోని ఈదిలోకొచ్చి అరుగు మీద కూకున్నా. ఇంతలో...

ఓ గౌడా! తాటి చెట్టెక్కిన నీ కొడుకు చాలా సేపట్నించి తల వాల్చేసి అట్టే యాలాడ్తా వుండాడు. నడుం మోకు, కాళ్ల బందాల వల్ల మనిషి కిందపడ్లా... లగెత్తు కుంటా వచ్చి చెప్పాడు కిష్టయ్య.

ఏమైంది కిష్టయ్యా!...

ఏమో...! మనిషిలో ఉలుకూ లేదు... పలుకూలేదు!...

ఆ మాటినంగానే నా కోడలు పెద్దగా ఏడుపుకెత్తుకున్నాది ఏమైందో... యేమో నని. మొదలే కడుపుకోతలో వుండాది గదా!

నాకూ భయంతో సన్నగా వణుకు మొదలైంది. కళ్లు బైర్లుగమ్మతావుండాయి. ఎవుర్నన్నా కేకేసేదానిక్కూడా గొంతురాలా. అడుగులు ముందుకు పడటంలా కిష్టయ్యే చుట్టుపక్కలోల్లని పోగేసి అక్కడికి నన్ను గూడా తీసకపోయినాడు. అప్పటికే చాలా మంది గుమిగూడుండారు.

కొందరేమో మావోణ్ని పిలస్తావుం డారు. కనీసం మూలుగు కూడా యినపడ టంలా నోట్లోంచి జొల్లు గార్తావుంది. అది చూసిన చాలామంది "ప్చ్... ప్యానం పోయినట్టుండాది..."

అంటా పెదవిరుస్తావుండారు. కొందరేమో వాణ్ని కిందకెట్టా దించాలో మాట్లాడుకుంటావుం డారు.

నాకేమీ అర్థంగావడంలా. నా కళ్లల్లో నీళ్లింకిపోయి చానా రోజులైనాది. గుండె గూడా మొద్దుబారిపోయింది. "అబయా!..." అంటా పైకి చూస్తా క్యాకేశా. "ఏంది నాయనా!..." అంటాడేమోనని ఆశ. నిరాశే మిగిలింది.

ఊపిరి తీసుకోవడం గూడా కష్టంగా వుంది. ప్యానానికి ప్యానంగా చూసుకున్న మనవడు చచ్చిపోయి నెలగూడా తిరగలా. ఇప్పుడు కొడుక్కూడా...! మా ప్యానాలు గూడా పోతే బాగుండు. ఇంత కడుపు కోతలో మిగతా వోళ్లం బతికుండి ఏం... బాంకోవాల!.

మహానుబావురాలు! చచ్చి ఏలోకానుం డాదో!... ఇదంతా చూడాల్సొస్తాదనో ఏమో... మా యింటిది ముందుగానే దాటు కున్నాది... నా మానాన నన్నొదిలేసి!

అందరూ కలిసి వాణ్ని కిందికి దించారు. కొందరేమో గుండెపోటన్నారు! మరికొందరేమో 'దుర్త' కొట్టేసిందన్నారు!.

కారణమేదైతేనేం ప్యానం బొయిన్న ర్వాత!...

శవాన్ని ఇంటికి తీసుకొచ్చినాం. కొడుకు పోయి నెర్రోజులు గూడా గాలా. ఇప్పుడు పెనిమిటి గూడా పోవడంతో నా కోడలు గుండెలు బాదుకుంటా యాడస్తావుంది. ఒక్కోతూ రి గబాల్న ఏడుపాపేసి పిచ్చిపిచ్చిగా గాల్లోకి చూస్తాది. అంతలోనే ఏదో గుర్తుకొ చ్చినదాన్లా తల నేలకేసి బాదుకుంటాది. ఆ యమ్మిని వోదార్చడం ఎవరితరం కావ డంలా పగోళ్లక్కూడా ఆ బాధ రాగూడదు!

* * *

సమత్సరం కిందదాకా మా ఊరు లాంటి ఊరు యక్కడా లేదనుకునేవాళ్లం. చెరువు కింద సేద్దెం. వరి, ఏరిశెనగ శానా బాగా పండేవి. బీళ్లు ఎక్కువగా వుంటంతో పశువులు, మేకలు గొర్రెలకు మేత బాగా



దొరికేది. దాంతో అందరిళ్లలో వాటి పెంపకం ఒక వృత్తిగా వుండేది. ఇంకోపక్క ఉప్పు కొటారు పనులు. కూలి పనుల్లేవనే మాటే యినపడేదిగాదు. ఒక్కోతూరి మా ఊళ్లో కూలీలు దొరక్క పక్కూళ్లనుంచి పిలిపిస్తావుండేవోళ్లు.

అట్టాగుండే మా ఊరికి వున్నట్టుండి దిష్టి తగిలినట్టైంది. ఏం మాయదారి కరెంటు ప్యాక్టీలో... మా పాలిట మిత్తవల్లాగా వచ్చేసినాయి. డబ్బులెక్కువిస్తామని, పిలకాయలకి ఉజ్జోగాలిస్తామని మాయ మాటలు చెప్పి బంగారం పండే మా కయిల్ని లాగేసుకున్నారు. నష్టపరిహారం అంటా ఏదో కొంత ముట్టజెప్పినారు. మా జనాలు గూడా వాళ్లిచ్చే డబ్బుల కోసరం ఎగబడ్డారేగానీ ముందు ముందు జరగబోయే నష్టం గురించి ఎవురికి పట్లా. భూములు లాక్కొనేసి చుట్టూరా గోడలు కట్టడం పూర్తైన తర్వాత గానీ మాకర్థం గాలా. భూములు తీసుకోకుండా ఎదురుతిరక్కపోవడం ఎంత తప్పో! ఎక్కడెక్కడ్నుంచో ప్యాక్టీల్లో ఉజ్జోగాలకి మనుషుల్ని తీసుకొచ్చారే గాని... ఊళ్లో పిలకాయలకి ఇయ్యలా. ఇక్కడోళ్లకిస్తే గొడవలు చేస్తారంట. రోజువారీ కూలి పన్లకు తప్ప ఇంకే పన్లకి మమ్మల్ని పిలవలా.

అప్పటికే మా బతుకులు తల్లి ఆదరణకు నోచుకోని బిడ్డల్లాగా తయారైనాయి. ఒక పక్క పోర్టు, మరొక పక్క కరెంటు ప్యాక్టీలు. గానుగలో ఏరిశెనగ చెక్కలాగ వుంది మా పరిస్థితి. మా భూముల్లో మేం తిరగడానికి మాకు సొతంత్రం లేదు. మా సముద్రం మేం చూడాలంటే సవాలక్ష ఆంక్షలు. చీమ నెత్తురున్నోడెవడూ అటుపక్కగ్గూడా తొంగిచూడడు. అలా వుండాయి వాళ్ల తనిఖీలు. దాంతో చిన్నప్పట్నించి మా భూముల్తో మాకున్న అనుబంధాలన్నిటికీ నీళ్లొదులుకోవాల్సొచ్చింది. జీవాలకు మేత దొరక్క వాట్ని తెగనమ్మాల్సొచ్చింది. ఒక్క మాటలో చెప్పాలంటే చుట్టూ పెహరీ గోడలతో ఊరొక జైల్లాగా తయారైనాది.

మరొక పక్క కుల వృత్తులన్నీ ఒక్క దెబ్బతో నాశనమైపోయాయి. మొదలే బెల్టు షాపులతో కుదేలైపోయిన మా యాపారం మూలిగే నక్కపై తాటిపండు పడ్డట్టు యింకా దెబ్బతినిపోయినాది. కల్లు గీసేదానికి చెట్లే దొరకడంలా. ప్యాక్టీలకు కేటాయించిన స్థలంలో ఉన్న చెట్లన్నీ పెకిలించేశారు. దాంతో ఎక్కడో దూరంగా పక్కూర్లో చెట్లెతుక్కుని గీత గీయాల్సిన పరిస్థితొచ్చింది. అట్టా గీసిన కొద్ది కల్లు గూడా అమ్ముడుబోటంలా. చేతిలో పరిహారం డబ్బుండటంతో అందరూ బ్యాందీల కలవాటుపడి కల్లుతాగేవోళ్లే కరువైనారు. అయినా కులవృత్తిని వదల్లేక, మరో పనీ చేతగాక నేను నా కొడుకు దాన్నే నమ్ముకున్నాం. నాకు వయసు మీద పడ్డంతో నా కొడుకే గీతకెళ్లేవోడు.

పరిహారం డబ్బొచ్చినంక ఊళ్లో పిలకాయలు పట్టపగ్గాల్లేకుండా తయారైనారు. కులవృత్తులు చేయడమంటే వాళ్లకి నామోషీగా తోచినాది. యాపారాలు చేస్తే బాగా సంపాదించొచ్చంటూ ఇళ్లలో గొడవలు మొదలుపెట్టినారు. నా మనవడుగూడా ఆ పాటే ఎత్తుకున్నాడు. "ప్లాట్యాపారంలో శీనయ్య మనకళ్లముందే చాలా సంపాదించి కారుగూడా కొన్నాడు. దాన్లో చాలా ఆదాయముండాది. ఆ డబ్బియ్యండి. ప్లాట్యాపారం చేస్తా..." నంటా గొడవ మొదలు పెట్టినాడు.

పెద్దోళ్ళ మాట చద్దిమూట అనేది మా తరం మాట. అప్పుడు మా నాయనోళ్లు ఏంజెప్పినా ఎదురు చెప్పేవోళ్లం గాదు. వాళ్లు చెప్పినట్లు తలొంచుకుని చేసుకుపోవడమే మాకు తెలిసింది. ఆ తరవాత నా కొడుకు. నా శక్తి చాలక వోడ్ని చదివించలేకపోయా. వోడుగూడా ఎప్పుడూ నా మాటకి ఎదురు జెప్పలా. మా ఇద్దరి రెక్కల కష్టంతో నాలుగు రూపాయలు చేతిలో కదలాడే పరిస్థితొచ్చింది. మేంబడ్డ కష్టం నా మనవడు బడకూడదని వాడ్ని చదివించాం. మేం తిన్నా తినకపోయినా వాడికి ఏ లోటు లేకుండా చూసుకున్నాం. వాడు నాలుగచ్చరాలు నేర్చుకోగానే మా పన్లన్నీ చాదస్తాలుగా కనిపించసాగాయి! సరిగ్గా అప్పుడే మా కయిలు ప్యాక్టీలకు లాక్కోడం దానికి బదులు నష్టపరిహారం పేరుతో డబ్బులివ్వడం జరిగిపోయింది.

ఉన్నట్టుండి ఒక్కసారిగా డబ్బులు చేతిలోకొస్తానే వాడి ఆశలకు అద్దూ పద్దూ లేకుండాబొయింది. పరిగెత్తతా పాలు తాగాలనే ఆలోచనవోడిది. అలా తాగితే పారబోతాదనే భయం మాది. వాడి ఆలోచనలకి, మా ఆలోచనలకి అంతరాలు మొదలయ్యాయి. అయినా పేగు బంధం ముందు మేము తలవంచక తప్పలేదు!



# నవ్వులు పంచండి

**మనందరి జీవితాల్లోనూ ఎన్నో హాస్య సంఘటనలు ఉంటాయి.**

**కొన్నైతే గుర్తుకొచ్చినప్పుడల్లా కడుపుబ్బా నవ్విస్తాయి. మీరు చేసిన చమత్కారాలో, మీమీద ఎవరైనా వేసిన చతుర్లో... ఉంటే వాటిని రాసి మాకు పంపించండి. బాగున్నవి మీ పేరుతో ప్రచురిస్తాం. రూ.50 పారితోషికమూ ఉంటుంది.**



నేను మూడో తరగతి చదువుతున్నప్పుడు జరిగిన సంఘటన ఇప్పటికీ నవ్వు తెప్పిస్తూనే ఉంటుంది. మా తరగతి ఉపాధ్యాయుడు పాఠం బోధిస్తున్న సమయంలో నేను లేచి నిలబడి, 'సార్, నాకు పోలీస్‌కార్డు ఎప్పుడిస్తారు?' అని అడిగాను. అందరూ అర్థంగాక నా వైపు వింతగా చూశారు. మళ్లీ అడిగాను, అప్పుడు ఉపాధ్యాయుడు 'అది పోలీస్‌కార్డు కాదురా, ప్రోగ్రెస్ కార్డు' చెప్పగానే తరగతి గదంతా నవ్వులే నవ్వులు. వారం రోజులు ఇదే విషయాన్ని పలుమార్లు గుర్తు చేసుకుంటూ నవ్వుకున్నారు.

**- బి.దుర్గయ్య,** మెదక్



ఒకసారి నా స్నేహితురాలు సావిత్రి, తన భర్త మా ఇంటికి వచ్చారు. మాటల్లో 'రత్నా- చీరలు కొన్నాను చూడు బాగున్నాయా' అని చూపించింది సావిత్రి.

'బాగానే ఉన్నాయి' అన్నానో లేదో సావిత్రి భర్త 'ఆc ఏం బాగున్నాయండీ రంగూ బాగులేదు, డిజైన్లూ బావులేవు. అయినా సావిత్రికి సెలక్షన్ రాదండీ' అన్నారు.

వెంటనే సావిత్రి (ఒళ్లు మండింది కాబోలు) భర్తతో 'అవును, నాకు సెలక్షను రాదని మీరు పదేపదే అనక్కర్లేదు. మిమ్మల్ని చేసుకున్నప్పుడే తెలిసిందా విషయం' అంది.

**- రత్నామహీధర్,** హైదరాబాద్





నా మనవడు లాంటోళ్లు అందరూ ఆ యాపారంలో దిగటంతో స్థలాల రేట్లు యిపరీతంగా పెరిగిపోయాయి. యకరాల పరిహారం చిన్న స్థలం కొనేదానికే సరిపోలా. ఎక్కడెక్కడినుండో జనాలు ఇళ్లస్థలాలకి రావటం మొదలుబెట్టారు!

దాంతో వీళ్లు అప్పులు తీసుకొచ్చి కయిలు కొని ఇళ్ల ప్లాట్లేసేశారు. మొదట్లో లాభాలు బాగానే కనబడ్డాయి. బంగారం రేటులాగా ప్రెతి రోజూ రేట్లూ మారిపోతా వుండినాయి. దాంతో కన్ను మిన్ను గానకుండా ఎక్కువ వడ్డీలకి అప్పులు చేసి కయిలకి చంచకటువులిచ్చేసినారు. మిగతా డబ్బులు ప్లాట్లమ్మతా జమ చేసేటట్టు ఒప్పందాల్జేసుకున్నారు.

అప్పటికీ నేను, నా కొడుకు చెబతానే వుండాం. "అప్పులు చేయబాకబయా... ఉన్నదాంతోనే యాపారం జెయ్. నష్టాలొస్తే మనం తట్టుకోలే" మని. మా మాటింటేనా. డబ్బులు చేతిలో బాగా మెదల్తా వుండటంతో, తాగుడుగూడా అలవాటయ్యింది. ఎక్కడెక్కడో తిరిగి చాలా పొద్దుబోయాక తూల్తా ఇంటికొచ్చేవాడు. అదేమనడిగితే "ఈ యాపారం ఇంతే" అనేవాడు.

ఉన్నట్టుండి స్థలాలు కొంటానికి జనాలు రావటం మానేసినారు. స్థలాలు అమ్ముడు పోకపోవడంతో అప్పులు తెచ్చినోళ్లకి వాయిదాలు కట్టడం కష్టంగా మారింది. ఇంకోపక్క కయిల యజమానులు వత్తిడి చేయడం మొదలుపెట్టినారు.

ఈళ్లకి ఊపిరి సలపక అప్పులోళ్లకి, కయిల యజమాన్లకి కనపడకుండా తప్పించుకు తిరగడం మొదలుపెట్టినారు. కొంత కాలం చూసి యజమానులు కయిల్ని సోధీనం చేసుకున్నారు. ఇచ్చిన చంచకటువులు తిరిగి ఈలా. సరికదా దిక్కున్నచోట చెప్పుకోపొమ్మన్నారు. కోర్టులకెళ్లేదానిక్కూడ ఈళ్ల దగ్గర డబ్బుల్లేకుండా పోయినాయి!

ఇక అప్పులోళ్లతో రోజూ గొడవలెక్కువైనాయి. మొదట్లో సొంత డబ్బుల్తో కొని, అప్పులోళ్లకి ఆడుమానం పెట్టిన కయిల్ని అప్పులోళ్లు లాక్కున్నారు. లెక్కల్జూసుకుంటే వడ్డీలకు సరిపోయి, అసలు మాత్రం బాకీగా మిగిలినాది.

ఈ బాధలు తట్టుకోలేకపోయాడు నా మనవడు. తాగుడు ఎక్కువైపోయినాది. ఒక రోజు పుల్లుగా తాగి, నెల్లూర్నించి బండి

> **"అయ్యో!... ఆ భూమాతకొచ్చిన కష్టాలకి మేం గూడా కారణమే గదా! డబ్బొస్తుందనే యావలో ఏమీ ఆలోచించలా! అలా వచ్చిన డబ్బుతో కన్నుమిన్ను గానక ఇన్నాళ్లూ అన్నం బెట్టిన తల్లినే చెరబట్టాలన్జూశాం. అందుకే ఈ కష్టాలన్నీ!..."**

మీదొస్తావుంటే ముడి ఇనుము లారీ గుద్దేసింది. అక్కడికక్కడే ప్యానాలు గాల్లో కలిసిపోయినాయి.

కళ్లముందే చెట్టంత కొడుకు పోవడంతో తట్టుకోలేకపోయినాడు నా కొడుకు. అప్పటి నుంచీ ఏదో పరజ్ఞానంగా వుండటం మొదలు పెట్టినాడు. సరిగ్గా నెలరోజులకే ఇలా...

* * *

పచ్చగా అటు ఇటు వూగే పైరుల్లేవు. ఎప్పుడూ దేహాన్ని తాకతావుండే పైరగాలుల్లేవు. సూరీడి తాపాన్ని తీర్చే కాలువల్లేవు. కిచకిచలాడతా ఆటలాడుకునే పిచ్చుకల్లేవు... పైర్లలో వాలే కొంగల్లేవు, కాకుల్లేవు... శిథిలమైపోయిన తన వైభోగాన్ని తలచుకుంటూ కరెంటు ప్యాక్టరీ గోడల మధ్య బందీగావున్న భూమాత విషాద గీతాలు పాడతావుంది...!

అది చూసి చుట్టూరా వున్న గోడ ఎకిలిగా నవ్వతావుండాది. దాంతో అస్తమించబోతా వున్న సూరీడి కళ్లు చింతనిప్పుల్లా ఎరుపెక్కతావుండాయి!...

అయ్యో!... ఆ భూమాతకొచ్చిన కష్టాలకి మేం గూడా కారణమే గదా! డబ్బొస్తుందనే యావలో ఏమీ ఆలోచించలా! అలా వచ్చిన డబ్బుతో కన్నుమిన్ను గానక ఇన్నాళ్లూ అన్నం బెట్టిన తల్లినే చెరబట్టాలన్జూశాం. అందుకే ఈ కష్టాలన్నీ!...

ఎత్తుబడిక్కూడా డబ్బుల్లేని బతుకైపోయినాది. ఆర్నెల్ల క్రితం లక్షాధికారులం. కానీ ఇప్పుడో...! పరిస్థితి చూసి, చుట్టుపక్కలోళ్లందరూ తలా కాస్త డబ్బులేసుకున్నారు. వాళ్లే ముందుండి పాడి కట్టి, శవాన్ని కాటికి తీసకబోయినారు.

ప్యానం బోయిన నా కొడుకు పాడె మీద...! ప్యానమున్న జీవచ్ఛవంలా పాడె ముందు నేను! నెల రోజుల కిందట నా కొడుకు తన కొడుక్కి తల కొరివి పెట్టాడు. ఇప్పుడు నా కొడుక్కి నేను...! మరి రేపు నాకో...?

మా వోణ్ని కట్టెలు పేర్చిన కాష్ఠం మీద పడుకోబెట్టారు. సాంగ్యాలన్నీ అయినంక నా చేతికి కాగడా ఇచ్చి తలకొరివి పెట్టించారు.

కిరసనాయిలు బొయిడం మూలాన ఒక్క సారిగా మంటలు ఎగసిపడ్డాయ్. ఆ మంటల్లో నా కోడలు పసుపు కుంకాల్తో పాటు మా బతుకులు కాలి బూడిదైపోతా వుండాయి.



**శింగమాల సుబ్రహ్మణ్యం**
హైదరాబాదు
94902 99399

# చెప్పుకోండి చూద్దాం!

ఏడ్వకేడ్చు నవ్వకే నవ్వుచుండును
బాధలేక బాధపడుచు నుండు
నిద్రరాకయున్న నిద్రించు - చావకే
చచ్చునెవ్వడో చెప్పుడు సరసులార

[illegible] -



పుట్టగానే పెరిగి పెద్దదౌతుందిర
కొమ్మలు రెమ్మలు ఎన్నో చిమ్ముతుంది
చిత్రమైన పూలు చకచకా మెరియుచు
చూచువారల కెంతో చోద్యమగును

[illegible] -

ముదురవారు చాల ముతక వారనుచును
లేతవారి నేర్చి కౌతుకమున
కుండలోనె పెండ్లి గొప్పగా చేతురు
క్షారకారములకు బేరమిచ్చి

[illegible] -

# మునివేళ్లపై ముచ్చటైన తెలుగు

అందరి చేతుల్లోనూ ఆధునిక ఫోన్లే... మరి, ఎంతమంది తేట తెలుగుకి స్థానం కల్పిస్తున్నారు. ఎప్పుడైనా ఆలోచించారా? ఆండ్రాయిడ్ వేదికపై తెలుగువెలుగులు చాలానే ఉన్నాయి. అన్నీ ఉచితమే! తాకే తెరపై తెలుగుకి స్వాగతం పలికేందుకు మార్గాలు అనేకం. మొబైల్... ట్యాబ్... ఏదైనా ఉచిత యాప్స్‌తో అనేక ప్రయోజనాలు పొందొచ్చు. మరి, అందుకు అనువైన యాప్స్ సంగతుల్ని వివరంగా తెలుసుకుందామా!

## పంచాంగాల పుట్ట

ఏ శుభకార్యాన్నికైనా ముహూర్తాల కోసం పంచాంగాన్ని చూస్తుంటాం. ఇప్పుడు కాస్త మీ స్మార్ట్ మొబైల్‌ని సిద్ధాంతిగా మార్చేయండి. స్పష్టమైన తెలుగులో పంచాంగ వివరాల్ని అందుకోండి. అందుకు Horoscope Telugu యాప్ ఉంటే సరిపోతుంది. పుట్టిన తేదీ, సమయం, స్థలం... వివరాల్ని ఎంటర్‌చేసి చూడొచ్చు. వెలువడిన జాతకాన్ని పీడీఎఫ్ ఫార్మెట్‌లో సేవ్ చేసుకునే వీలుంది. రాశిచక్రాన్ని కూడా చూడొచ్చు. గ్రహ ప్రభావాల్ని తెలిపే పట్టిక కూడా ఉంది. డౌన్‌లోడ్ ఇతర వివరాలకు http://goo.gl/POMYYv; Mulugu astro యాప్‌ని నిక్షిప్తం చేసుకోండి. ఆడియో, వీడియోల్లో కూడా పంచాంగాన్ని పొందొచ్చు. http://goo.gl/6WOhCd క్యాలెండర్ విభాగం కూడా ఉంది.






## ఈ రోజేంటబ్బా?

కొత్తగా ఏదైనా కార్యాన్ని మొదలు పెట్టడానికో... కావాల్సిన వారిని కలవడానికో... కచ్చితంగా 'ఈ రోజు ఏంటబ్బా?' అని తెలుగు క్యాలెండర్ కోసం గోడల వైపు చూడక్కర్లేదు. కావాలంటే ఆండ్రాయిడ్ గూగుల్ ప్లే నుంచి యాప్స్ రూపంలో తెలుగు క్యాలెండర్‌ను ఉచితంగా నిక్షిప్తం చేసుకోవచ్చు. తేదీ, వారం, వర్జ్యాల్ని స్పష్టంగా చూడొచ్చు. ఎప్పుడు ఏయే పండుగలు ఉన్నాయో తెలుసుకోవచ్చు. దుర్ముహూర్తం ఎప్పటి నుంచి ఎప్పటి వరకు ఉందో కూడా వివరంగా చూడొచ్చు. సుముహూర్తాల్ని కూడా తెలియజేస్తాయి. ఆయా యాప్స్ కోసం http://goo.gl/V9pQHf; http:/goo.gl/G7rrt; http://goo.gl/7o2vPy లంకెల్లోకి వెళ్లండి.




## నిఘంటువు కావాలంటే?

ఆంగ్ల పదాలకు తెలుగు అర్థం తెలుసుకునేందుకు చాలా నిఘంటువులు ఉన్నాయి. అదే తెలుగు పదానికి ఆంగ్లంలో అర్థాన్ని తెలుసుకోవాలంటే Telugu_English Dictionary యాప్‌ని నిక్షిప్తం చేసుకోండి. సుమారు 50,000 పదాల్ని నిఘంటువులో పొందుపరిచారు. కావాల్సిన పదాన్ని సెర్చ్ బాక్స్‌లో టైప్ చేయాలి. కావాలంటే http://goo.gl/ZIVhX7 లంకెలోకి వెళ్లండి. తెలుగు పదానికి మరింత వివరణ అందించే పదకోశం కావాలంటే Telugu Padakosham యాప్‌ని ఇన్‌స్టాల్ చేసుకోండి. చిత్రాలతో పాటు వ్యాకరణ విశేషాల్ని అందిస్తుంది. ప్రత్యేక తెలుగు కీబోర్డ్ ద్వారా టైపింగ్ చేయవచ్చు డౌన్‌లోడ్ ఇతర వివరాలకు http://goo.gl/5hh5f0 లంకెలోకి వెళ్లండి. ఆంగ్ల పదాలకు తెలుగు అర్థాన్ని వెతికేందుకు English Telugu Dictionary; http:// goo.gl/WTq44f కూడా ఉంది.





## శతకాల స్థావరం

జ్ఞానాన్ని పెంపొందించే సుమతి, భాస్కర, కుమార శతకాల్ని చదవాలంటే? అదిప్పుడు అరచేతిలో పని. అందుకు తగిన యాప్ Telugu satakamulu. హోం పేజీలో కనిపించే శతకాల్లో కావాల్సిన వాటిని ఎంపిక చేసుకుని చదువుకోవచ్చు. కావాలంటే http://goo.gl/kW8QfM లంకెలోకి వెళ్లండి. ప్రత్యేకించి సుమతి శతకానికి Sumati satakam ఉంది. తెలుగు, ఆంగ్లంలోనూ వాటిని పొందొచ్చు http://goo.gl/KsISJ1







## ఇలా బోధించండి

తాకే తెరైనా... క్వర్టీకీబోర్డ్ అయినా ఈతరం పిల్లలకు ఆట వస్తువులా మారిపోయింది. అక్షరాభ్యాసానికి ముందే మొబైల్ ఆపరేషన్ చేసేస్తున్నారు. మరి, మీ పిల్లలకు తెలుగు బోధించే ఉపాధ్యాయుడిగా మొబైల్‌నే మార్చేస్తే! అమ్మలా అచ్చులు నేర్పుతుంది. నాన్నలా హల్లుల్ని బోధిస్తుంది. కావాలంటే Telugu Balasiksha Lite యాప్‌ని నిక్షిప్తం చేసుకోండి. అక్షరమాలతో పాటు జంతువులు, కూరగాయల పేర్లను పిల్లలకు బోధిస్తుంది. తెలుగు ప్రహేళికలూ ఉన్నాయి. డౌన్‌లోడ్, ఇతర వివరాలకు ttp:/goo.gl/SD2Hqk; Learn Telugu యాప్‌లలో నేర్చుకుందాం... ఆడుకుందాం... రంగులు వేద్దాం అంటూ తెలుగు వర్ణమాల, అంకెల్ని బోధిస్తోంది. నచ్చిన బొమ్మల్ని ఎంపిక చేసుకుని పిల్లల చేత రంగుల్ని నింపించొచ్చు. http:// goo.gl/QB7FRE బొమ్మలతో తెలుగుని బోధిస్తోంది my Guru Varnamala Lite యాప్ కావాలంటే http://goo.gl/qAxDgh లంకెలోకి వెళ్లండి.



**యడ్ల రాజేష్**
హైదరాబాదు. 80085 50405

# కందాల విందు



గాంగేయుని సమ వీరుని
కంగారును బోలు మృగము గానము జగతిన్
షాంగైని మించు నగరము
గోంగూరకు దీటు వచ్చు కూరయు గలవే?



బాంగ్రా నృత్యము వంటిది
కాంగ్రా సమ హిల్రిసార్ట్గు కనమెందైనన్
సంగ్రామమున కిరీటికి
జాంగ్రీల రుచులకు సాటి జగతిని గలవే?



హడ్లీని మించు బౌలరు
వడ్లకు సరి ధాన్యము మరి వజ్రపు సరియున్
ఎడ్లకు సమ శ్రమ జీవులు
ఇడ్లీలకు సాటి టిఫను లిలలో గలవే?

- **గుర్రం జనార్దనరావు**, gurram.jana@gmail.com

**చెప్పుకోండి చూద్దాం!**

గ్రంథముల వారి తోడ సంబంధమున్న
పండితుల వారి కూరిమి బంధుడితడు
కావ్యముల తోడ విలసిల్లు ఘనుడే కాని
కాళ్లు కదపక పడియుండు కదలలేడు

పనిని బ్రహ్మాండముగ చేసి పనికిరాని
రాయిరప్పల నొకచోట రాసిబోయ
పురములను మించునట్టి గోపరములివియె
ధరణి తరులకు నచ్చిన స్థలములివియె

# తెలుగుకు వెలుగు బ్రౌన్



**అతనికది అమ్మభాష కాదు. అయినా పరాయి భాషలో పలుకుల తీయదనాన్ని పసిగట్టాడు. నుడి కడలి నిర్మాణానికి ప్రతిన బూనాడు. అయినవాళ్లే అటకెక్కించిన తాళపత్రాలకు జీవం పోశాడు. సంక్షిప్త పదాలకు సులువైన సంకేతాలను సూచించాడు. ఉద్యోగంతో పాటు తన ధనాన్నీ, సమయాన్నీ, ఇంకా చెప్పాలంటే తన జీవితాన్నే వినియోగించి తెలుగు సాహిత్యాన్ని సేవించిన అక్షర సేవకుడు చార్లెస్ ఫిలిప్ బ్రౌన్.**

బ్రౌన్ 1849లో గుర్రం మీద నుంచి పడి కుడి చేతి బొటనవేలు విరగ్గొట్టుకున్నాడు. ఆయనకది చాలా కీలక సమయం. తెలుగు నేర్చుకునే ఆంగ్లేయుల కోసం ఇంగ్లిషు- తెలుగు నిఘంటువు, ఇంగ్లిషు నేర్చుకునే తెలుగు వారి కోసం తెలుగు-ఇంగ్లిషు నిఘంటువు సిద్ధం చేసి అచ్చు కోసం ఇచ్చాడు. ప్రూఫులు దిద్దుకోవాల్సిన సందర్భం. ఎవరైనా అయితే వాయిదా వేసి ఉందురు. కానీ మొండిఘటం అయిన బ్రౌన్ ఎడమచేత్తో రాత అలవాటు చేసుకుని ప్రూఫులు దిద్దుకున్నాడు. 1852లో నిఘంటువులు ప్రచురించాడు.

మన రాష్ట్రం వాడు కాదు, అసలు మన దేశం వాడే కాదు. మరి తెలుగు భాషపై అంత శ్రద్ధ ఎలా వచ్చింది? ఏ పరిస్థితుల్లో ఇంగ్లండ్ నుంచి ఇక్కడికి వచ్చాడు? తెలుగు భాషా సాహిత్యాల అభివృద్ధి కోసం ఏయే కార్యక్రమాలు చేశాడు? ప్రతి తెలుగువాడూ తప్పని సరిగా తెలుసుకోవాలి.

ఈస్టిండియా కంపెనీ భారతదేశాన్ని పరిపాలించే రోజులవి. చాలామంది ఇంగ్లిషు వారు ఇంగ్లాండు నుంచి వచ్చి కంపెనీ కొలువులో ఉద్యోగాలు చేస్తుండేవారు. అలా ఉద్యోగం చేస్తూ ఎవరైనా చనిపోతే వారి సంతానంలోని చిన్న వాళ్లను సివిల్ సర్వీసులో చేర్చుకుని కంపెనీ ఉద్యోగాలిచ్చేవాళ్లు. బ్రౌన్ తండ్రి డేవిడ్‌బ్రౌన్ (1762-1812) కూడా అలాగే ఇంగ్లాండు నుంచి వచ్చి కలకత్తాలోని ఒక పాఠశాల పర్యవేక్షకుడిగా ఉద్యోగంలో చేరాడు. ఆయనకి ముగ్గురు కొడుకులు. రెండోవాడైన సి.పి.బ్రౌన్ 1798 నవంబరు 10వ తేదీన కలకత్తాలో పుట్టాడు. డేవిడ్‌బ్రౌన్ 27 సంవత్సరాలు ఉద్యోగం చేసి చనిపోయాడు. కంపెనీవాళ్లు సి.పి.బ్రౌన్‌ని మద్రాసు సర్వీసుకి, ఆయన సోదరుల్ని బెంగాలు సర్వీసుకి పంపించారు. నిబంధనల ప్రకారం సివిల్ సర్వీసులో చేరిన వారు రెండు భారతీయ భాషలు నేర్చుకోవాలి. బ్రౌన్ తెలుగు, మరాఠీ భాషలను ఎంచుకున్నాడు. కంపెనీ కొలువులో పనిచేసిన 34 ఏళ్లలో సుమారు 30 సంవత్సరాలు తెలుగు భాషా సాహిత్యాల సేవకే వినియోగించాడు.

ఉద్యోగం కోసం నేర్చుకున్న పరాయిభాష నచ్చితే చదివి ఆనందిస్తారు కానీ నెత్తిన పెట్టుకుని ఆరాధిస్తారా! ఎంత ఆరాధనా భావం లేకపోతే మహాభారతం శుద్ధ ప్రతిని తయారు చేయడానికి 12 తాళపత్ర గ్రంథాలను పరిశీలిస్తాడు! వేమన పద్యాలు చదివి మురిసిపోయే వారుంటారు కానీ వాటిని ఆంగ్లంలోకి అనువదించే క్రమంలో పాఠ నిర్ణయం చేయడానికీ, లేఖన దోషాలను పరిహరించడానికీ, మూడు వారాలపాటు తెలుగు ఛందస్సు నేర్చుకుని 1152 పద్యాలను పరిష్కరించి అనువదించడానికీ సి.పి.బ్రౌన్ తప్ప విదేశీయులెవరైనా పూనుకోగలరా? పఠనాసక్తి ఉన్నా కొన్ని కావ్యాలు పంటికింద రాళ్లలా ఇబ్బంది పెడుతున్నాయని గ్రహించాడు. అందుకే భాష కఠినమైనా సరళమైనా లాటిన్ భాషలో ఉన్నట్టు అన్ని కావ్యాలకూ వ్యాఖ్యానం ఉండాలని భావించాడు. మనుచరిత్ర, వసుచరిత్ర వంటి పదహారు కావ్యాలకు టీకలు రాయించాడు. ప్రతి సందర్భాన్నీ సాహిత్య సేవకే వినియోగించడం బ్రౌన్‌లోని సుగుణం. తాతాచార్యులు అనే సంస్కృత పండితుడు ప్రసంగవశాత్తూ చెప్పిన కథలను గ్రంథస్థం చేసి 'తాతాచార్యుల కథలు' అనే సంకలనాన్ని 1856లో ప్రచురించాడు. అంతేకాదు ఆ కథల్లో గ్రాంథిక వాసనలున్న వాటిని తొలగించిన సిసలైన వ్యావహారిక భాషావాది బ్రౌన్.

అభిరుచి ఉన్న వాళ్లు తెలుగు

సాహిత్యాన్ని చదవాల్సిన క్రమాన్ని కూడా బ్రౌన్ చెప్పాడు. మొదట వేమన పద్యాలు, తరువాత చక్రవర్తి రాఘవాచార్యులు రచించిన 'నలచరిత్ర' అనే ద్విపద కావ్యం. అనంతరం 'రంగనాథ రామాయణం', 'ఆంధ్రమహాభారతం', భాగవతంలోని అష్టమ దశమ స్కంధాలు, 'సుభద్రా పరిణయం', 'మనుచరిత్ర', 'దశావతార చరిత్ర', 'నైషధం', 'విష్ణుచిత్తీయం', చివరగా 'వసుచరిత్ర' శ్రద్ధగా చదవాలని అన్నాడు.

చదవాల్సిన క్రమం తెలిస్తే సరిపోతుందా! అందుబాటులో ఉండాలి కదా! ఆ సౌకర్యం కూడా తనే కల్పించాడు. తను సేకరించిన 2,440 గ్రంథాలను మద్రాసు లిటరరీ సొసైటీలో ఉంచాడు. వాటిలో తెలుగు గ్రంథాలు 1116. వీటిని పాఠకులకు అందుబాటులో ఉండేలా సొసైటీకి ఒక ప్రతిపాదన చేశాడు. 35 రూపాయల విరాళం, నాలుగు నెలలకూ 22 రూపాయలు చందా కట్టిన సభ్యులు కొత్త పుస్తకాలూ పత్రికలతో సహా గ్రంథాలయ సౌకర్యాలు పొందవచ్చు. 15 రూపాయల విరాళం నాలుగు నెలకి 10 రూపాయల చందా చెల్లిస్తే గ్రంథాలయంలో మాత్రమే చదువుకోడానికి అనుమతి ఉంటుంది. నెలకి రూపాయి మాత్రమే చందా కట్టిన సభ్యులు నచ్చిన పుస్తకాన్ని ఇంటికి తీసుకెళ్లాలంటే 20 రూపాయల ధరావత్తు కట్టాలి. బ్రౌన్ చేసిన తీర్మానాన్ని సొసైటీ ఆమోదించడంతో ఎంతోమంది పాఠకులు ప్రయోజనం పొందారు.

వివేకి తన మీద రాళ్లు విసిరిన వారిని విమర్శిస్తూ కూర్చోకుండా ఆ రాళ్లతోనే చిన్నగూడు నిర్మించుకుంటాడనే సామెతని బ్రౌన్ రుజువు చేశాడు. ముక్కుసూటిగా పోవడం వల్ల కంపెనీకి ఆగ్రహం వచ్చి 1834లో బ్రౌన్‌ని ఉద్యోగం నుంచి తొలగించింది. మూడేళ్లపాటు ఇంగ్లండులో కూర్చుని తెలుగు నేర్చుకునే ఆంగ్లేయుల కోసం 'ది గ్రామర్ ఆఫ్ తెలుగు లాంగ్వేజ్' అనే పేరుతో ఇంగ్లిషులో తెలుగు వ్యాకరణం రాశాడు. తెలుగు-ఇంగ్లిషు నిఘంటువు పూర్తి చేశాడు. ఆ దేశంలో గుట్టలుగా పడి ఉన్న తెలుగు, కన్నడ గ్రంథాలకు కేటలాగు తయారు చేసి, వాటిని భారతదేశానికి పంపించాల్సిందిగా సిఫార్సు చేశాడు.

ఎంత అభిరుచి ఉన్నా ఆర్థిక పరిస్థితి బాగుంటేనే అది సాఫల్యం అవుతుంది. బ్రౌన్ ధనవంతుడేమీ కాదు. అయినా తన లక్ష్య సాధన కోసం ఖర్చుకి వెనుకాడేవాడు కాదు. గ్రంథాలయాలు లేని కాలం అది. ఎవరి దగ్గరైనా గ్రంథాలున్నట్టు తెలిస్తే డబ్బులిచ్చి వాటిని తీసుకునేవాడు. రాతప్రతులు పుట్టించడానికీ, తీర్పు ప్రతులు సిద్ధం చేయడానికీ, పద సూచికలు రాయడానికీ పది నుంచి ఇరవై మంది దాకా పండితుల్ని జీతాలిచ్చి పోషిస్తుండేవాడు. 'విష్ణుపురాణం' అనే తెలుగు తాళపత్ర గ్రంథం లభిస్తే రూపాయికి 200 పద్యాల చొప్పున లేఖరికి కూలి ఇచ్చి ఆ కావ్యమంతా కాగితాల మీద రాయించాడు. అలా రాయడంలో లేఖకులు ఏమాత్రం తప్పులు రాసినా అర్ధరూపాయో, పావలానో జరిమానా విధించేవాడు. గ్రంథసేకరణపై బ్రౌన్ వ్యామోహాన్ని తెలిపే ఒక సంఘటన... సి.రంగనాయకులు అనే వ్యక్తి బ్రౌన్ ఆసక్తిని సొమ్ము చేసుకోవాలనుకున్నాడు. దేవుడు తనకు కలలో కనబడి ఫలానా పుస్తకం కాపీ చేసి దొరగారికి ఇవ్వమని చెప్పాడని ఉత్తరం రాసి ఒక పుస్తకాన్నీ, ఆ ఉత్తరాన్నీ బ్రౌన్‌కి పంపించాడట. అప్పటికే సాహిత్య గ్రంథాల్లో మునిగి తేలుతున్న బ్రౌన్ "పాపం! ఈ కావ్యం నేనెప్పుడో సంపాదించానని భగవంతుడికి తెలియదు" అని రాసి దాన్ని తిప్పి ఆ వ్యక్తికి పంపించాడట.

బ్రౌన్‌కి ఉద్యోగం ద్వారా వచ్చే జీతం ఆయన సాహిత్య సేవకి సరిపోయేది కాదు. మద్రాసులో ఉద్యోగం చేసేటప్పుడు అప్పుల పాలయ్యేవాడు. ఒక ఇంగ్లిషు వర్తకుడి దగ్గర ఆయన చేసిన అప్పు వడ్డీతో కలిపి అరవై వేల రూపాయలు అయింది. అష్టకష్టాలూ పడి ఆ బాకీ తీర్చగలిగాడు. అయినా తను నమ్మిన ఆదర్శాలను వీడలేదు. "తమ ఆర్జనలోని ప్రతి ఒక్క రూపాయిలో ఒక పైసాను దానధర్మాలకు కేటాయించారు. (ఆనాడు రూపాయికి 192 పైసలు ఉండేవి) ప్రతినెలా కుంటి, గుడ్డి, అవిటివాళ్లకు అయిదు వందల రూపాయల దాకా ధర్మం చేసేవారు" అని ఆరుద్ర, సమగ్రాంధ్ర సాహిత్యంలో రాశారు.

ఛందస్సుకు సంబంధించి యతిస్థానంలో బ్రౌన్ ఏర్పరచిన నియమాలు పద్యకావ్యాల ముద్రణలో చాలాకాలం కొనసాగాయి. వృత్త పద్యాల్లో పాదాన్ని రెండు పంక్తులుగా విడదీసి యతి అక్షరాన్ని సూచించడానికి దానికి ముందు తారకం అనే పువ్వు గుర్తు (✻) పెట్టేవారు. కొంతకాలానికి ముద్రాపకులు పద్యపాదాన్ని విడదీయకపోయినా యతిస్థానం దగ్గర తారకాన్ని సూచించడం అలవాటుగా మారింది. క్రమంగా ఈ తారకం చిన్న డైమండు (◆) గానూ మామిడిపిందె (●) గుర్తుగానూ మారింది. ప్రాచీన పద్య కావ్యాల్లో మనం వీటిని చూడవచ్చు.

తెలుగు ముద్రణలో 'రావత్తు' ఆంగ్లంలోని యు(U) ఆకారంలో ఉండేది. అచ్చుపనిలో దీనివల్ల కలిగే అసౌకర్యాన్ని గుర్తించిన బ్రౌన్ 'c' లాగా మార్చాడు. బ్రౌన్ రకారం అనే పేరుతో ఇప్పుడిదే వాడుకలో ఉంది.

సజీవ భాషను నేర్చుకోవడం బ్రౌన్‌కి చాలా బాగా తెలుసు. అయ్యలరాజు నారాయణ 'హంసవింశతి' అనే కావ్యంలో వివిధ వృత్తులకు సంబంధించిన పదాలను వాడినట్టు తెలుసుకున్నాడు. ఆ వృత్తుల వారిని స్వయంగా కలుసుకొని ఆ పదాల అర్థాలను తెలుసుకుని వివరంగా రాసుకున్నాడు. అంతేకాదు రాజులూ, రైతులూ, పండితులూ, పామరులూ, వకీళ్లూ, వైద్యులూ, వేటగాళ్లూ, వర్తకులూ, ఓడ కళాసీలు ఒకరేమిటి అన్ని వర్గాల వారి భాషనూ అధ్యయనం చేశాడు. భారత తూర్పు సముద్ర ప్రాంతానికి 'కోరమాండల్' అనే పదం వాడుకలో ఉంది. అది 'కర్రి మండలం' అని తన ఇంగ్లిషు-తెలుగు నిఘంటువులో వివరంగా చెప్పాడు. సీమ దొరలంతా తెలుగు భాషనూ, తెలుగు వారినీ జెంతూ అని పిలిచేవారు. అన్యమతస్థుడు, క్రైస్తవేతరుడు అని ఈ మాటకర్థం. బ్రౌన్ ఈ పదాన్ని తన నిఘంటువులో చేర్చి 'జెంతూ అనే మాటను వాడటం తప్పు' అని సూచించాడు.

బ్రౌన్ కాలం నాటికి లేఖలలో సంక్షిప్త పదాలను రాసే అలవాటుండేది. ఈనాడవి తెరమరుగయ్యాయి. ఆయన ప్రచురించిన తెలుగు-ఇంగ్లిషు నిఘంటువులో వీటిని చూడవచ్చు. లేఖలో తేదీకి ముందు 'ది'

అని రాసేవారు. 'దివి (ఎ డే)' అని దానర్థం. క్రీ.శ. అని రాయడానికి 'ఆన॥' అని రాసేవారు. అనో డోమిని అని ఈ మాటకర్థం. 1840లో బ్రహ్మయ్య శాస్త్రుర్లు అనే పండితుడికి బ్రౌన్ రాసిన లేఖ "బ్రహ్మయ్య శాస్త్రుర్ల గారికి సల్లాం. త॥" అని ప్రారంభమైంది. నమస్కారం అనే అర్థంలో ప్రారంభంలోనూ చివరా కూడా ఆయన ఈ మాట వాడారు. 'త॥' అంటే 'తరువాత' అని అర్థం. ఒక హెడ్ పోలీసు బ్రౌన్‌కి రాసిన లేఖలో "సన్ 1242 ఫసలి 1833 సం॥" అని ఉంది. సన్ అంటే సంవత్సరం అనీ, ఫసలీ అంటే రెవెన్యూ ఇయర్ అనీ అర్థం. తమకంటే పెద్ద హోదాలో ఉన్న వారిని లేఖలో రా॥ రా॥ రా॥ అని సంబోధించేవారు. 'రాజమాన్య రాజ పూజితులైన రాజశ్రీ' అని దీని పూర్తి పదం. 'తా॥క' అంటే తాజా కలం (పోస్ట్‌స్క్రిప్ట్) అని అర్థం. పెరవ శ్రీమన్నారాయణ అనే పండితుడు బ్రౌన్‌కి రాసిన లేఖలో "నా దగ్గర చదువుకుంటున్న భట్రాజు మా॥ గ్రంథం యిచ్చి పంపిస్తిని" అని రాశాడు. 'మా॥' అంటే మారీఫత్ (ద్వారా) అని అర్థం. మనం 'పర్యవేక్షణ' అని వాడేచోట బ్రౌన్ 'పైగస్తీ' అని రాశాడు.

తెలుగు వర్ణమాలలో అక్షరాలు ఎక్కువగా ఉంటాయని ఇంగ్లిషు వారు వేసే అపవాదును బ్రౌన్ అంగీకరించలేదు. 'ఆంగ్లంలో రెండు మూడు వేరు వేరు ధ్వనులకు ఒకే అక్షరం వాడినట్టు కాక ఒక్కొక్క ధ్వనికీ ఒక్కొక్క ప్రత్యేక అక్షరం ఉండటమే దానిక్కారణం' అని తెలుగును సమర్థించాడు. ఎంతో వ్యయ ప్రయాసల కోర్చి సిద్ధం చేసిన రాతప్రతులు కాలగర్భంలో కలిసిపోకుండా జాగ్రత్తలు తీసుకున్నాడు. 'మెకంజీ రాతప్రతులు దేశవాళీ పేపరు మీద తొందరగా వెలిసిపోయే ఇంగ్లిషు సిరాతో రాసినవి. వాటిని క్రిములు నాశనం చేస్తున్నాయి. అందుకే నేను ఇంగ్లిషు పేపరు మీద దీపపు మసితో చేసిన సిరాతో రాయించాను. ఇవి చాలాకాలం పాటు చెక్కుచెదరకుండా ఉంటాయి' అన్నాడు తెలుగు-ఇంగ్లిషు నిఘంటువులో.

బ్రౌన్ గురించి చిన్న వ్యాసంలో చెప్పడం అంటే కొండను అద్దంలో చూపించడమే. 30 సంవత్సరాలపాటు తెలుగు భాషా సాహిత్యాలే ఊపిరిగా జీవించిన ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ తెలుగు జాతికి చిరస్మరణీయుడు.

**నూరార్లు లెక్కసేయక**
**పేర్లొందిన విబుధ జనుల బిలిపించుచు వే**
**నూర్లర్థమిచ్చు వితరణి**
**ఛార్లీసు ఫిలిప్పు బ్రౌను సాహెబు కరుణన్**

- ములుపాక బుచ్చన్నశాస్త్రి



**డా॥ పి.ఎస్.ప్రకాశరావు**
కాకినాడ. 99637 43021

# ఎడారి అడుగులు



ఎడారి ఇసుకలో పాదముద్రలు
ఒంటరి ప్రయాణానికి సూచికలు
అండదశ నుంచీ
అగ్నిలో దహనమయ్యేవరకు
గమనమంతా
జలవిహారమూకాదు,
వసంత విలాసమూ కాదు
ఎదురయ్యేవి
కనువిందుచేసే ఇంద్రధనుస్సులే కాదు
కనికట్టు చేసే ఎండమావులు కూడా
అసలు
ఉద్యానాలూ, ముళ్లపొదలు, ఎడారులూ
భూమ్మీదేకాదు
మస్తిష్కాల్లోనూ
వేడి నిట్టూర్పులు
అంతరంగం ఎడారి ప్రకోపాలే!
ఆలోచనల పాదాలు గాయపడి
ఎర్రగా మండేది
మనసు ముళ్లపొదలు చెలరేగినప్పుడే.
అంతర్మథనానికీ, అలజడికీ
పారదర్శక ప్రతిరూపాలు కన్నీళ్లే!
హృదయకేంద్రం రూపొందించే
ప్రసారాలను ప్రత్యక్షం చేసే బుల్లితెరలు
ఆర్ద్రమైన కళ్లే
అన్ని బాటలూ ఒకే గమ్యాన్ని చేర్చవు
నినాదంలో తరంగమై
సమూహంలో పరిభ్రమించినా
ఎగరేసిన నాణెం
ఎప్పుడూ బొమ్మగానే పడదు
బొరుసుపడిన ఆనవాళ్లే
ఎడారి ఇసుకలో పాదముద్రలు.
ఇవి
సమసౌష్ఠవంగా సాగినంతమేర
ఒక తీరాన్ని చిత్రించుకునే
ఆశల కొనఊపిరి స్పర్శ
అనుభూతమవుతుంది
జారిపడిన దిక్సూచి కోసం అన్వేషణలో
ఆ పయనం
అగమ్యమై అపశృతిలో ఆక్రోశిస్తుంది.
వెనుక ముందు తడబాటుతో
చెల్లాచెదురై
సందిగ్ధాన్ని చిత్రించిన అడుగుజాడలు
అక్కడ ఆగిపోతాయి
ఎడారి సాగిపోతూనే ఉంటుంది

**- డా॥ వై.రామకృష్ణారావు**
హైదరాబాదు, 89857 43964

# జ్ఞాన కేంద్రాలు

నీరసించిన మనిషికి పుస్తకాలు కొత్త శక్తినిస్తాయి. మంచి పుస్తకం ఇచ్చే మనశ్శాంతి, అనుభవిస్తేనే తెలుస్తుంది. మంచి జీవితం, విశాలమైన దృక్పథాల కోసం పుస్తకాలు చదవాలి... ప్రముఖ రచయిత ముల్క్‌రాజ్ ఆనంద్ స్వర్ణాక్షరాలివి. అవును! పొత్తంతో పరిచయం పెరిగితే హృదయం ధనాత్మక భావనలకు నిలయమవుతుంది. బతుకు ప్రయాణంలో అలసిన మనసుకు సాంత్వన కలుగుతుంది. అందుకే జాతిపిత గాంధీ అన్నారు... 'నా తల్లి చనిపోయినప్పుడు, ఆ లోటును నాకు పూరించింది పుస్తకమే. భగవద్గీతలో ఒక్కొక్క పేజీలో, నా అనేక సమస్యలకు పరిష్కారం దొరికేది'. చిలకమర్తి వారిది కూడా ఇదే అభిప్రాయం. 'గ్రంథాలు మహాపురుషుల అనుభవాలు. మనుషులకు పుస్తకాల వంటి మిత్రులు అరుదు. అవి మన క్షేమం కోరేవి. తప్పులు తెలియజెప్పేవి. అందరికన్నా ఆప్తులు అవే'నని చెప్పేవారాయన. అలాంటి ఆప్తులున్న పూరిగుడిసెలో నిరుపేదలా బతుకుతాను కానీ, పుస్తకాలు లేని మేడలో చక్రవర్తిగా ఉండనని అనేవారు మధురకవి నాళం కృష్ణారావు. ఇంతటి మహిమాన్వితమైన పుస్తకాలకు నిలయాలు గ్రంథాలయాలు. వాటిలోని పుస్తకాలన్నీ చదవడానికి ఒక జీవితకాలం సరిపోదు. ఎన్నెన్నో అంశాలపై ఎన్నెన్నో పుస్తకాలు. ఎంత వీలైతే అంత చదివి జీర్ణించుకోవాలి. వాటి సారాన్ని జీవితానికి అన్వయించుకోవాలి. అప్పుడే మనిషి మనీషి అవుతాడు.

ఇంకెందుకు ఆలస్యం! మీ ఊళ్లో గ్రంథాలయానికి వెళ్లండి. అందులోని అరలన్నీ గాలించి మీకిష్టమైన పుస్తకాలను ఎంచుకోండి. అక్షరాల లోతుల్లో దాగున్న భావాలను అర్థం చేసుకోండి. అప్పుడు చూడండి... మీ ఆలోచనలు ఎంతగా వర్ణరంజితాలవుతాయో!

**- బ్రహ్మదేశం రాజశ్రీ,**
విజయవాడ



# ఆచార్య దేవోభవ




లేలేత పూలపాదులా
నేనతని
పాదాలనల్లుకుపోతుంటే...
ఓ బోధివృక్షమై విస్తరిస్తాడతడు!
చిటికెన వేలుపట్టి అతని అడుగుజాడల్లో
అక్షరలోకపుదారుల వెంట పయనిస్తుంటే...
బీడునేల మీద నా చూపుడు వేలుతో
బీజాక్షరాల చాలు వోస్తాడతడు!

నా లేత పెదాల మీద పదాలతుళ్లింతై
విశాలనదీ పరీవాహక పాఠమై విస్తరిస్తూ
నా ఎడారి గుండెల్ని తడిపి,
మనసుమాగాణి మీద పచ్చదనాన్ని పులిమిందతడే!
విశాలప్రపంచపు తలుపులు తెరచి
వేకువను నా ముందు పరచిందీ అతడే!

ప్రకృతినొక పాఠశాల చేసి, నలుదిక్కుల నల్లబల్లమీద
శ్వేతవర్ణాక్షర జలపాతమై దుముకుతూ తూరుపు పశ్చిమ
కనుమలకు బారచాపితే
సూరీడై నా చెవుల్లో సుద్దుల్ని నూరిపోస్తాడతడు!
తరాల చరితల్ని జ్ఞానవాహినిలో తడుపుతూ సాగే
అవిశ్రాంత పథికుడతడు!

అతడు, మట్టి ముద్దలకు ఊపిరూదితే...
మహత్తర జీవశక్తిని సంతరించుకుంటాయి!
లోకం మీద సీతాకోకచిలుకలై విహరిస్తాయి!
అతడు జాతికి జీవధాతువు
తను తగలబడుతూ, చీకట్లను తగలబెడుతూ
దారిచూపే వెలుగు కాగడా!

రెక్కలొచ్చి నేనెగిరి పోతుంటే...
దిక్కుదిక్కునా దారిచూపుతూ అతడే!
గుండెదన్నుపెట్టి, ఒక్కొక్క మెట్టూ నన్నెక్కిస్తూ
ఆఖరిమెట్టు మీద అతడే!
పోనీ రుణం తీర్చుకుందామంటే... అతనిముందు
నా సమస్తదేహమూ దూదిపింజలా తేలిపోయింది!
అతని అనంతమైన కరుణముందు అవని చిన్నబోయింది!
కన్నీటి మలుపులో...
ఇప్పుడతడి రూపం గుర్తుకురావటం లేదు,
కేవలం ఆయన పాదాలు తప్ప!!

**- సిరికి స్వామినాయుడు**
పార్వతీపురం, 94940 10330

# యక్షప్రశ్నలు ఎన్ని?



**దుప్పి వెంట దట్టమైన అడవిలోకి పరుగెత్తించి, దప్పికతో అలమటించేలా చేసి జటిల ప్రశ్నలతో ధర్మజుని దీక్షా దక్షతలకు పరీక్షపెట్టినవే యక్షప్రశ్నలు. నిగూఢత, మార్మికత, విజ్ఞత, లోకజ్ఞత – ఈ ప్రశ్నోత్తరాల ప్రత్యేకతలు. 'ఈ ప్రశ్నలు మొత్తం ఎన్ని?' అనేది సందేహాతీతంగా సమాధానం దొరకని ఆసక్తికరమైన ప్రశ్న!**

నిత్యజీవిత సంభాషణల్లో వీటి ప్రస్తావన తరచూ వినిపిస్తూనే ఉంటుంది. చిక్కు ప్రశ్నలనూ, కష్టమైన ప్రశ్నలనూ యక్ష ప్రశ్నలుగా సంభావించటం పరిపాటి. వివేకం, లోకజ్ఞానం, సూక్ష్మ పరిశీలన, తెలివితేటలను పరీక్షించే వీటిలో అధికభాగం పొడుపు కథల్లాంటివే.

**దుప్పి కొమ్ముల్లో నిప్పు కొయ్య**

ఈ ప్రశ్నల నేపథ్య గాథ ఈతరంలో చాలా మందికి తెలియదు. అరణ్యవాసం చివరి సంవత్సరం. ఓ రోజు పాండవుల దగ్గరకు ఓ బ్రాహ్మణుడు వచ్చాడు. 'నా అరణి (నిప్పు కొయ్య)ని ఒక దుప్పి కొమ్ముల్లో ఇరికించుకుని పారిపోయింది. దాన్ని తెచ్చివ్వండి' అని ప్రార్థించాడు.

వెంటనే అన్నదమ్ములు ఐదుగురూ దుప్పి వెళ్లిన దిక్కుగా బయల్దేరారు. కొంత సేపటికి అది వారి కంటపడింది. ఎన్ని బాణాలు వేసినా దానికేమీ తగల్లేదు. పారిపోతూ ఆగుతూ పాండవులను కీకారణ్యం మధ్యకు తీసుకుపోయి, ఆ దుప్పి మాయమైపోయింది.

అందరూ అలిసిపోయి ఆకలిదప్పులతో బాధపడసాగారు. నకులుడు ఒక చెట్టెక్కి చూశాడు. కొంత దూరాన నీటి మడుగు కనిపించింది. అందరికీ నీరు తెస్తానని వెళ్లి, మడుగు వద్దకు పోయి దాహం తీర్చుకోబోయాడు. 'ఆగు! ఈ కొలను నాది. ముందు నా ప్రశ్నలకు జవాబులు చెప్పకుండా నీరు తాగటానికి వీల్లేదు' అన్న అశరీరవాణి మాటలు వినిపించాయి. నకులుడు లెక్కచేయక నీరు తాగేశాడు. అక్కడే స్పృహ తప్పి పడిపోయాడు.

అతడు ఎంతకూ తిరిగిరాకపోవడం చూసి ధర్మరాజు సహదేవుణ్ని పంపాడు. అతనూ అశరీరవాణి హెచ్చరికలు ఖాతరు చేయకుండా నీరు తాగి మూర్ఛిల్లాడు. తర్వాత అర్జునుడు, భీముడిదీ అదే పరిస్థితి.

వెళ్లిన నలుగురూ ఎంతకూ రాలేదు. ధర్మరాజు కంగారుపడ్డాడు. వెంటనే ఆ మడుగు దగ్గరకు వెళ్లాడు. స్పృహ తప్పిన తమ్ముళ్లను చూశాడు. అతని హృదయం తల్లడిల్లింది. కొంచెంసేపటికి తేరుకున్నాడు. పరిసరాలను పరిశీలించాడు. అక్కడ వేరే వారి అడుగుజాడలు కనపడలేదు. 'ఈ కొలనులో నీరు విషపూరితమైంది అనటానికి వీరి శరీరంలో విషప్రయోగం జరిగిన లక్షణాలేమీ లేవు. ఒకవేళ దుర్యోధనుడు, అతని మిత్రులు అలా చేశారా?' అని పరిపరివిధాల ఆలోచిస్తూ కొలనులోకి దిగాడు.

అప్పుడు అశరీరవాణి 'నేనొక కొంగను. ఈ సరస్సు నాది. నా ప్రశ్నలకు సమాధానాలు చెప్పకుండా నీరు తాగినందుకు నీ తమ్ముళ్లను చంపాను. నీవయినా నా ప్రశ్నలకు సమాధానాలు చెప్పి కావలసినంత నీరు తీసుకో. లేదా, నీక్కూడా వారి గతే

**యువకుడు:** అమ్మాయిల్ని ఆకర్షించేందుకు ఏమైనా కొత్త యంత్రాలు వచ్చాయా?
**బార్బర్:** అయ్యో... ఈ మధ్యే మన ఊరు చివర్లో కొత్తగా రెండు ఏటీఎంలు ప్రారంభించారు మీకు తెలీదా బాబు...



పడుతుంది' అని హెచ్చరించింది.

ఈ మాటలు విని ధర్మరాజు 'నా సోదరులు ఒక పక్షిచేత చనిపోయేవారు కారు. నువ్వు కొంగ రూపం ధరించిన రుద్రుడివో, అగ్నిదేవుడవో, వాయుదేవుడవో తెలియదు. లేకపోతే ఎంతో పరాక్రమవంతులైన నా తమ్ముళ్లు ఇలా పడిపోరు. ఎవరు నువ్వు? నీకేం కావాలి?' అని అడిగాడు.

'అవును. నేను



కొంగను కాదు. యక్షరాజును' అంటూ తాటిచెట్టంత ఆకారంతో ధర్మరాజుకు కనిపించాడు. 'నువ్వు తెలివి కలవాడివి కాబట్టి నీరు తాగలేదు. నా ప్రశ్నలకు సమాధానం చెప్పు' అన్నాడు. 'నీవంటి వారికి సమాధానం చెప్పడం నా తరమా! అయినా నాకు తెలిసింది చెపుతాను' అన్నాడు ధర్మరాజు.

యక్షుడు అనేక ప్రశ్నలు అడిగాడు. అన్నిటికీ ధర్మరాజు తగిన సమాధానాలిచ్చాడు. యక్షుడు సంతోషించి, 'నీ తమ్ముళ్లలో ఒక్కరిని బతికిస్తాను. కోరుకో' అని చెప్పాడు. నకులుణ్ని కోరుకోగా ఆశ్చర్యపోయిన యక్షుడు - భీమార్జునులను కోరుకోలేదేమిటని అడిగాడు. 'మా తండ్రికి కుంతీ, మాద్రీ - ఇద్దరు భార్యలు. కుంతీ పుత్రుల్లో నేను బతికివున్నాను. అందుకే మాద్రి పుత్రుల్లో నకులుణ్ని బతికించు' అన్నాడు ధర్మరాజు. 'నీ ధర్మబుద్ధికి సంతోషించాను' అంటూ మిగిలిన వారినీ బతికించాడు.

అప్పుడు ధర్మరాజు 'నువ్వు మామూలు యక్షుడివి కావు. ఏ దేవతవో చెప్పు' అని ప్రార్థించాడు. 'నేను యమధర్మరాజును. నీ తండ్రిని. నిన్ను పరీక్షించడానికి వచ్చాను' 'నేనే దుప్పి వేషంలో మిమ్మల్ని ఇక్కడికి రప్పించాను' అని అరణిని వారికి తిరిగి అప్పగించాడు. పాండవులు దాన్ని బ్రాహ్మణుడికి అందించి ఆశీర్వాదం పొందారు.

**యుధిష్ఠిరుడి యుక్తి, ఓర్పు**

సమస్య ఎదురైనపుడు ఓర్పుతో, యుక్తితో ఎలా ఎదుర్కోవాలో, కార్యసాధకుడిగా ఎలా ప్రవర్తించాలో ఈ ఘట్టం తెలుపుతుంది. యుద్ధంలో స్థిరంగా నిలబడేవాడని ధర్మరాజుకు యుధిష్ఠిరుడని పేరు. సోదరులు విగతజీవులై ఉన్న సంక్లిష్ట స్థితిలో కూడా అతడలాగే ప్రవర్తించాడు. వారికి ఆ దుర్గతి ఎందుకు పట్టిందో గ్రహించడానికి ప్రయత్నించాడు. తన ప్రియ సోదరులను చంపానని చెప్పిన యక్షుడితోనూ గౌరవంగా, మర్యాదగానే మాట్లాడాడు.

దుఃఖాన్ని మనసులోనే దాచుకుని, యక్షుడి మౌఖిక పరీక్ష (ఇంటర్వ్యూ)ను బుద్ధిమంతుడైన విద్యార్థిలా ఎదుర్కొన్నాడు. 'తెలిసినంతవరకూ చెపుతా'నని వినమ్రత చూపాడు. ఎన్ని ప్రశ్నలడిగినా విసుగు చెందక దీక్ష, దక్షతలతో జవాబులు చెప్పాడు.

యక్షుడు చివర్లో ఒక ప్రశ్నను బహుళైచ్ఛిక (మల్టిపుల్ చాయిస్) పద్ధతిలో అడగటం విశేషం! 'బ్రాహ్మణ్యాన్ని ఏది ఇస్తుంది- కులమా, నడవడికా, వేదాధ్యయనమా? శాస్త్ర శ్రవణమా?' అని. ఇది విద్యార్థులు పరీక్షల్లో 'ఎలిమినేషన్' పద్ధతిలో జవాబు కనుక్కోవటం లాంటిది.

**ప్రతిఫలించిన పరిస్థితులు**

ఏ కాలం సాహిత్యమైనా నాటి సాంఘిక పరిస్థితులను ప్రతిఫలిస్తుంది. భారత ఇతిహాసంలోని ఈ ప్రశ్నోత్తరాల్లో నాటి సంఘ నియమాలూ, పరిస్థితులూ సూచనప్రాయంగా కనపడతాయి. వేదాలూ, యజ్ఞయాగాలపై విశ్వాసం (విశ్వసించని వారు నరకానికి పోతారనే హెచ్చరిక), కుటుంబ వ్యవస్థను శ్లాఘించటం గమనించవచ్చు. 'దరిద్రుడు బతికివున్నా చనిపోయినట్టే' అనే జవాబు పేదలకు సంఘంలో ఉన్న దయనీయస్థితిని చెబుతుంది.

సోదరులను పునరుజ్జీవింపజేసుకోవటమే కాదు; ధర్మరాజు సాధించిన ఘనత మరోటి ఉంది. ఎదురుగా ఉన్నది ఎవరో తెలిసే దాకా విడువకుండా వినమ్రంగా అడుగుతూనే వచ్చాడు.

**శతాబ్దాల ఎదురుచూపులు**

ఎర్రాప్రెగడ (1280-1364) తెనిగించిన శ్రీమదాంధ్ర మహాభారతం అరణ్యపర్వంలో ఈ ఘట్టం వస్తుంది. ఎర్రన ఈ ఘట్టం



**యక్ష ప్రశ్నలకు జవాబులిస్తున్న ధర్మరాజు శిలారూపం. క్రీ.శ. 500సం॥లో ఉత్తరప్రదేశ్, దేవగఢ్‌లో నిర్మించిన విష్ణాలయంలో ఉందీ విగ్రహం**

మొత్తాన్నీ సంపూర్ణంగా అనువదించలేదు. సంక్షిప్తం చేయటం వల్ల మూలంలోని యక్ష ప్రశ్నలు సగానికి మించి తెలుగులోకి రానే లేదు.

వ్యాసుడు రాసిన భారత కథ సంస్కృతం రాని తెలుగువారికి పూర్తిగా తెలియటానికి రెండున్నర శతాబ్దాల సుదీర్ఘకాలం పట్టింది. క్రీ.శ. 11వ శతాబ్దిలో నన్నయ ఆది, సభాపర్వాలూ; అరణ్యపర్వంలో కొంత భాగమూ తెనిగించాడు. 13వ శతాబ్దిలో తిక్కన రంగప్రవేశం చేసి విరాటపర్వం

నుంచి చివరిదైన స్వర్గారోహణ పర్వం వరకూ 15 పర్వాలు రచించాడు. 14వ శతాబ్దిలో ఎఱ్ఱాప్రెగడ వచ్చి పూర్తిచేసేదాకా అరణ్యపర్వ శేషం అలాగే ఉంది. ఇందులోనే వస్తుంది యక్షప్రశ్నల ఘట్టం!

అంటే యక్షప్రశ్నలను మాతృభాషలో పద్యరూపంలో మన తెలుగువారు చదివి తెలుసుకోవటానికి భారతానువాదం ప్రారంభమయ్యాక కూడా దాదాపు 250 సంవత్సరాలు నిరీక్షించాల్సి వచ్చిందన్నమాట!

**నూట పన్నెండేళ్ల క్రితం..**

తర్వాతి ఆరు శతాబ్దాల కాలంలో ఏ రచయితలైనా, కవులైనా ప్రయత్నించారో లేదో. 1901లో తిరుమలై కంద్యూరు రామానుజాచార్యులు సంస్కృత మహాభారతంలోని యక్షప్రశ్నలను తెలుగులోకి అనువదించారు. సరళ గ్రాంథిక తెలుగు వచనంలో ప్రతి శ్లోకానికీ తాత్పర్యం రచించి, పుస్తకంగా ప్రచురించారు.

సంపూర్ణ యక్షప్రశ్నలు పద్యరూపంలో లేని లోటును కొమాండూరు శ్రీనివాసాచార్య కవి పూరించారు. పాఠకులకు అందుబాటులోకి తెచ్చారు. 1904లో వెలువడిన ఆ పుస్తకంలో ఎఱ్ఱాప్రెగడ తెనిగించిన వాటినీ, తాను రచించినవాటినీ ప్రశ్నోత్తరాలు ఆమూలాగ్రం తెలియటానికి వీలుగా కథాక్రమాను సారం అమర్చారు. ఎఱ్ఱన పద్యాలను 'ప్రాచీనముల'నీ, తన పద్యాలను 'నూతనముల'నీ పేర్కొన్నారు.

"ప్రబంధ పరమేశ్వర బిరుదాంకితులగు నెఱ్ఱప్రెగడ గారి పద్యముల వరుసలో నా పద్యములుండుట దివ్యవజ్రమణిమాలాంతర్గత కాచమణుల భంగి నొప్పునని నమ్ముచున్నాడను" అని సంతోషాన్ని వెలిబుచ్చారు.

ఈ పుస్తకానికి పూండ్ల రామకృష్ణయ్య పీఠిక రాస్తూ- యక్షప్రశ్నలకు సంబంధించి సంస్కృతంలో సుమారు 150 శ్లోకాలున్నాయి. ఇంచుమించుగా 70 శ్లోకాలకు పైగా ఎఱ్ఱన ఆంధ్రీకరించలేదని స్పష్టం చేశారు. అందుకు హేతువు కనపడదన్నారు. అంతే కాదు; ఎఱ్ఱన ఆంధ్రీకరించిన పద్యాలకూ, మూలానికీ కొన్ని భేదాలున్నాయంటూ సోదాహరణంగా వివరించారు.

**ఇంతకీ యక్షప్రశ్నలెన్ని?**

ఇది కూడా యక్షప్రశ్నల్లాంటిదే! ఎఱ్ఱాప్రెగడ అనువాదం వరకూ చూస్తే ఇవి 47. పిలకా గణపతి శాస్త్రి వచన భారతం ప్రకారం 52. తెలుగు వికీపీడియాలో పేర్కొన్న ప్రకారం 72.

వ్యాసుడి సంస్కృత భారతమే మూలం కాబట్టి దానిలోని యక్షప్రశ్నలెన్నో పరిశీలించటమే సరైన పరిష్కారం. అయితే భారతం 'వనపర్వం'లో వచ్చే ఈ ఘట్టంలో పాఠాంతరాలూ, శ్లోకాల్లో హెచ్చుతగ్గులూ కనపడుతున్నాయి. కాలక్రమంలో ఇతరులు చేర్చిన 'ప్రక్షిప్తాల' అవకాశమూ లేకపోలేదు. దీని వల్ల నిర్దిష్టంగా చెప్పటం సాధ్యం కాదు. సంస్కృత భారతంలో గరిష్ఠంగా లభ్యమయ్యే యక్షప్రశ్నలు 120.

చివర్లో 'సవతి సోదరుడిని ఎందుకు బతికిస్తావు?' అనేదీ యక్షుడి ప్రశ్నే. దీన్నీ కలుపుకుంటే 121 అవుతాయి. కానీ దీన్ని యక్షప్రశ్నల్లో కలపకుండా ఉండటమే సబబనిపిస్తుంది. అప్పటికే ధర్మరాజు యక్షుడి పరీక్షలో నెగ్గేశాడు. ఇది యక్షుడు ఆసక్తికొద్దీ వెలిబుచ్చిన సందేహం మాత్రమే. ధర్మరాజు పరంగా ఇది వైయక్తిక కోణం వెల్లడించేది మాత్రమే. ఆయన ఏం చెప్పినా సరైన సమాధానమే అవుతుంది. ఏ తమ్ముణ్ని బతికించాలనే నిర్ణయం తీసుకోవటం జటిలం కావచ్చు కానీ దానికి కారణం చెప్పటం తేలికే కదా!




**సిహెచ్.వేణు**
హైదరాబాదు, 91770 04844


## ఇవీ యక్ష ప్రశ్నలు... 1



1. సూర్యుణ్ని ఉదయింపజేసేది ఏది?
2. అతని చుట్టుపక్కల సంచరించేవారెవరు?
3. సూర్యుణ్ని అస్తమింపజేసేది ఏది?
4. అతడు దేనిలో నిలిచివుంటాడు?
5. దేనివల్ల మానవుడు శ్రోత్రియుడవుతాడు?
6. దేనిచేత గొప్ప స్థానం పొందవచ్చు?
7. అతనికి అండగా ఉండేది ఏది?
8. దేనిమూలంగా బుద్ధిమంతుడవుతాడు?
9. బ్రాహ్మణులకు దేవత్వం ఏది?
10. వారికి సద్ధర్మం ఏది?

### సమాధానాలు

1. పరబ్రహ్మం 2. దేవతలు 3. ధర్మం 4. సత్యంలో 5. వేదం చదవటం వల్ల 6. తపస్సు చేత 7. ధైర్యం 8. పెద్దల సేవ చేత 9. బ్రహ్మచింత 10. తపస్సు

11. దేవలక్షణాలతో ఉన్న- వీరికి మనుష్య భావమేది?
12. వీరికి దుర్జనత్వం ఏది?
13. క్షత్రియులకు దేవత్వం ఏది?
14. వీరికి సద్ధర్మమేది?
15. వీరికి మనుష్య భావమేది?
16. వీరికి దుర్జనత్వం ఏది?
17. యజ్ఞానికి యోగ్యమైన సామం ఏది?
18. యజ్ఞ యజుస్సు ఏది?
19. ఏది యజ్ఞాన్ని వరిస్తుంది?
20. యజ్ఞం దేన్ని అతిక్రమించదు?



### సమాధానాలు

11. మరణం 12. నిందించటం 13. విలువిద్య 14. యాగం 15. భయం 16. రక్షించకుండా విడవటం 17. ప్రాణం 18. మనసు 19. రుగ్వేదం/రుక్కు 20. రుగ్వేదం/రుక్కు


*మిగిలిన ప్రశ్నలు.... 40,45,53, 55,58,63,65,70,77,86,98 పుటల్లో*

# ఈ జన్మకు అది చాలు

**ప్రియసఖా! శ్రీకృష్ణా!**

నీకు లేఖరాసి ఎన్ని యుగాలైపోయింది!

రాయాలని ఎప్పుడూ అనుకుంటూనే ఉంటాను.

ఆ ఆలోచనల్లోనే రగిలి పోతుంటాను.

ఎగసిపడే ఆలోచనలు యమునా తరంగాలై నన్ను ముంచేస్తుంటాయి.

ఎంత అందమైన ఆలోచనలు అవి? వాటిలోంచి బయటపడి లేఖ రాసేందుకు అవకాశమే లేదు మరి. నేనేం చేయను?

వాసుదేవా! నీకో విషయం తెలుసా?

నా గుండె వసంతం అయిపోయింది. అది "లబ్‌డబ్" అనడం మానేసి, "కృష్ణా కృష్ణా" అంటోంది. కృష్ణ నామాలు, వంశీ నాదాలు, మురళీ తరంగాలతో సిరలు, ధమనుల్లో రక్తానికి బదులుగా రాగాలు ప్రవహిస్తున్నాయి.

ఈ మధురానందంతో నా గుండె స్పందన మరీ ఎక్కువవుతుంటే, లోపలున్న నీవు నలిగిపోతావేమోనని నా భయం. పోనీలే, నా గుండె ద్వారా అలాగైనా నీ కౌగిలి భాగ్యం లభిస్తుందని ఓ ఆనందం నాకు.

యుగయుగాలుగా ఎంతమంది భక్తుల కౌగిళ్లలో నలిగిపోయావో తండ్రీ! నీ కోమల దేహం, అందుకే కందిపోయి, కమిలిపోయి, నల్లబడి పోయిందా? ఇప్పుడేమో నా గుండె మధ్యలో నీవు.

ఎంత మధురమైన ఆలోచన!

ఆ ఊహే నా ఊపిరిని ఆపేస్తుందేమో అనిపిస్తోంది.

ఆగిపోనీలే, ఆగిన ఆ నా గుండె మధ్యలో నీవున్నావుగా. వద్దొద్దు తండ్రీ,

ఆ ఒత్తిడిలో నీవు బందీగా వద్దు వద్దు.

అయినా నీవు సర్వాంతర్యామివి. నిన్ను నేను బంధించగలనా?

ఆ జగన్మాత యశోదమ్మకే సొంతమది.

కానీ, కన్నయ్యా! నా గుండెలో విరిసిన వసంతంలో పూల పుప్పొడుల మధ్య నిన్ను వసంతం ఆడించాలని చిన్న ఆశ. నీ మురళీనాదంతో కలిసి, నా గుండెలోని కోయిలల పాటల వాయిద్యాలతో బందీ చేయాలని ఆశ. అంతే!



అప్పుడెప్పుడో శబరి, రాముడిలాంటి నీకు ఎంగిలి పళ్లు తినిపించి ఆనందపడిపోయింది. నేనేమిచ్చి ఆనందించను? ఏమైపోయి సంతృప్తిచెందను? పక్షినౌదామంటే, ఎప్పుడో "జటాయువు" ఆ అదృష్టాన్ని సొంతం చేసుకుంది. రాయినౌదామంటే "అహల్య" ఆ అవకాశాన్ని లాగేసుకుంది. ఇలా ఎవరికి వారు ప్రతి అవకాశాన్నీ సద్వినియోగం చేసేసుకుంటున్నారు మరి!

సరేలే మాధవా!

ఎవరిలాగో నేను నిన్ను చేరడమేమిటి?

నేను, నేనుగానే నీకై మిగిలిపోతాను.

నన్ను నన్నుగా ఆమోదించి స్వీకరించు.

నా ఈ అక్షరాలనే, నా అశ్రువులుగా, నా ఆర్తిగా, నా ఆశలుగా, నా భక్తిగా, నేనుగా నన్ను స్వీకరించు ప్రభూ!

నన్ను నీవుగా మిగిలించు. ఈ జన్మకు అది చాలు.

**భక్త హృదయంతో**
**యల్లనూరు వెంకటరమణారెడ్డి,**
హైదరాబాదు 99516 60005

## మాట చాలు!

గూగులమ్మ గూటిలోకి కొత్త చిలుక రాబోతోంది. తెలుగులో మీరు మాట్లాడిన మాటలను ప్రపంచ భాషల్లోకి అనువదించే స్మార్ట్‌ఫోన్ యాప్ తయారవుతోంది. గళాధారిత అనువాద వ్యవస్థను రూపొందించడానికి 'గూగుల్' ఇప్పటికే పని ప్రారంభించింది. కంప్యూటర్ ఆధారంగా యంత్రానువాదం చేసే 'గూగుల్ ట్రాన్స్‌లేటర్' గురించి తెలిసిందే. గతేడాది ప్రపంచవ్యాప్తంగా 20 కోట్ల మంది దీన్ని ఉపయోగించుకున్నారు. అయితే, కంప్యూటర్లో రాసి ఉన్న విషయాన్ని మాత్రమే ఒక భాషలో నుంచి మరో భాషలోకి అనువదించడానికి ఇది పనికొస్తుంది. అలా 'రాత'తో సంబంధం లేకుండా... నోటిమాటను నేరుగా అనువదించే సాంకేతిక ఉపకరణం ఇప్పుడు తయారవుతోంది. 24 భాషల్లో ఈ యాప్‌ను తయారు చేస్తున్నారు. దీనిపై గూగుల్ అనువాద విభాగాధిపతి ఫ్రాంజ్ జోసెఫ్ మాట్లాడుతూ 'గళాధారిత అనువాద ఉపకరణాల తయారీ ప్రారంభమైంది. కొన్నేళ్లలో వాటిని పూర్తిస్థాయిలో అభివృద్ధి చేస్తా'మన్నారు.

**- తెలుగు వెలుగు బృందం**

# మమకారం

త్రిపురనేని గోపీచంద్

జోగయ్యమామ కర్రపోటు వేసుకుంటూ వచ్చి కాలవ కట్ట మీదవున్న నేరేడు చెట్టునీడను నుంచున్నాడు. సూర్యుని కిరణాలకు చెయ్యి అడ్డం పెట్టుకొని తన పొలాన్ని ఒకసారి చూసుకున్నాడు. తన చేల గట్ల మీద నున్న తుమ్మచెట్లన్నీ అతనికి గుర్తే. అవి కూడా తనతో పుట్టి తనతోపాటు పెరుగుతూ వస్తున్నాయి. అందులో తన హయాంలో అవసరంగా నాగలి దుంపలకు కావలసి వచ్చి రెండు తుమ్మచెట్లను మాత్రం నరికించాడు. అవి వుండే స్థలం యిప్పటికీ అతనికి బోసిగా కనిపిస్తూనే వుంటుంది. ఆ స్థలాన్ని చూచినప్పుడల్లా చేతికెదిగొచ్చిన యిద్దరు కొడుకులు తన్ను విడిచి వెళ్లినట్లు బాధపడుతూ వుంటాడు.

జోగయ్యమామ నిట్టూర్పు విడుస్తూ తలకు చుట్టుకున్న గుడ్డపరచి, నేరేడు చెట్టు కింద కూర్చున్నాడు. అతనికి ముగ్గురు కొడుకులు. పెద్దతను నరసయ్య పొలం పని చూసుకుంటున్నాడు. రెండో అతను దొరయ్య. బట్టల దుకాణం పెట్టి సొంతంగా నాలుగురాళ్లు సంపాదిస్తున్నాడు. ఆఖరి కొడుకు వెంకటసుబ్బయ్య. ఇంగ్లీషు చదువు చదువుతున్నాడు. వీళ్లు కాక అతనికిద్దరు కూతుళ్లు. అతని పిల్లలందరికీ అతనంటే యిష్టమే. అతనికీ వాళ్లంటే ప్రేమే కానీ, అవసరమైతే వాళ్లను చూడకుండా ఉండగలడు గాని, తన పొలాన్ని మాత్రం చూడకుండా ఒక్కమాటు కూడా వుండలేడు. పిల్లలందరూ పొలం మీద పాటుపడాలని వుంటుందతనికి. పొలాన్ని వృద్ధి చెయ్యటానికే వాళ్లు పుట్టింది. అందుకనే బట్టల దుకాణం పెట్టిన కొడుకు మీద మనసులో కొంచెం కోపం. "వాడూ మంచివాడే. పెళ్లాం మాట విని



చెడిపోయాడు" అని చెబుతాడు.

జోగయ్యమామ కిపుడు వందెకరాలు వుంది. ఆస్తంతా ఎక్కువ భాగం తాను రెక్కల మీద సంపాదించినదే, అందుకని మిగిలిన బాంధవ్యాలన్నీ ఆస్తి ముందు స్వల్పంగా కనిపిస్తయి అతనికి.

పొలాన్ని ప్రాణప్రదంగా కాపాడతాడు. పొలం బాగా పండటానికి ఏ పనైనా చేస్తే అనేకసార్లు తన ప్రాణాలను లెక్కచెయ్యకుండా అవతలవాళ్ల వేయించిన అడ్డకట్టలను తీయించి, తన చేనుకి నీళ్లు పెట్టుకున్నాడు. జోగయ్య ఎవళ్లొస్తారో ... ... ... కర్ర బట్టుకొని చేను గట్టుమీద నుంచుంటే వూరు వూరంతా హడలెత్తిపోయేది. బాగా నెర్రగొట్టిన తన చేను నీటిని గుటాగుటా తాగుతుంటే పసివానికి స్తన్యాన్నిస్తూ పరవశత్వంతో కూర్చునే తల్లిలా నుంచునేవాడు. కొడుకులు పెరిగొచ్చిం తర్వాత "మేం వుండగా నీకెందుకీ తాపత్రయం. కృష్ణా, రామా అనుకుంటూ కాలం గడుపుకోక" అంటున్నారు. వాళ్లకేం తెలుసు పసిగాయలు! ఈ తాపత్రయం వల్ల తనెంత సుఖపడుతున్నదీ వాళ్లకు అదేం అనుభవం కాదు.

నెలరోజుల క్రితం జోగయ్యమామ భార్యకు జబ్బు చేసి ప్రాణం మీదకు వచ్చింది. అప్పటికి పది రోజుల నుంచీ ఆమె ముక్కుతూ మూలుగుతూ ఉందేగాని, జోగయ్యమామ అట్టే పట్టించుకోలేదు. ఆ విషయం ఇంట్లో వాళ్లు ఎవళ్ళు కదిలించినా, "రోగాలు మనుష్యులకు రాక మానులకు వస్తాయా?" అంటూ వెళ్ళేవాడు. దమ్ము చేసే రోజులవి అతనికి తీరేది కాదు. ఏదైనా జబ్బు అంత తొందరగా మూసుకొస్తుందనుకోలేదు. "నువ్వింట్లో వుండు అమ్మని కనిపెట్టుకొని; నేను చేను తడిపించి వస్తాను" అని పెద్దకొడుకన్నాడే గాని జోగయ్య మామ యింటి దగ్గర వుండలేకపోయాడు. అసలే నీటికి ఎద్దడిగా వుంది. ఎవరు అడ్డం వేస్తారో. తన పెద్దకొడుకు బుద్ధిమంతుడే కాని వొట్టి అర్భకుడు. అవతలివాళ్ళు నోరు చేసుకుంటే వెనక్కు తగ్గుతాడు. తీరా పొలం తడపకపోతే, తరువాత యేమనుకునేం లాభం? అందుకని వూళ్ళో వైద్యుడి చేత భార్యకు నాలుగు మాత్రలు యిప్పించి, కాసిని నీళ్ళు తాగించి "కళ్లు మూసుకుపడుకో కునుకు పడుతుంది" అని చెప్పి పొలం బయలుదేరాడు. వూరి చివర చింతచెట్టు దగ్గరికి వచ్చేసరికి కొడుకు పంపిన మనిషి ఎదురుగుండా వచ్చాడు. "అవతలవాళ్ళు కర్రలూ, బల్లాలూ పుచ్చుకొని సిద్ధంగా వున్నారు. నరసయ్యకి కాలూ, చెయ్యీ ఆట్టం లేదు" అని చెప్పాడు.

జోగయ్యమామ గబగబా పొలానికేసి నడిచాడు. కాలవకు వేసిన అడ్డు తెంచి నీళ్లని తన చేలోకి మలిపాడు. అవతలివాళ్ళు కర్రలూ, బల్లాలూ పట్టుకొని చూస్తూ నుంచున్నారేగాని ఏమీ అనలేకపోయారు. తన చేలోకి నడుస్తున్న నీటి గలగల వింటూ సర్వం మరచి నుంచున్నాడు చేను గట్టుమీద జోగయ్యమామ.

"అమ్మ కెట్లావుంది?" అడిగాడు నరసయ్య.

"ఉంది" అన్నాడు జోగయ్యమామ.

"తగ్గిందా?" అడిగాడు నరసయ్య.

"తగ్గకేంజేస్తుంది?" అన్నాడు జోగయ్యమామ.

"ఇక మనం వెళ్దాం" అన్నాడు నరసయ్య. ఈ మాటకు జోగయ్యమామ ఉలిక్కిపడ్డాడు. "చేనంతా తడపకముందే విడిచి వెళ్లడమే?" అన్నాడు జోగయ్యమామ.

"ఇంటిలో యెవరూ లేరు మంచికైనా, చెడ్డకైనా" అన్నాడు నరసయ్య ఆదుర్దాగా.

"నువ్వు వెళ్లు. నేనిక్కడ వుంటా" అన్నాడు జోగయ్య. నరసయ్యకు తెలుసు తన తండ్రి పని మధ్యలో విడిచి రాడని. ఇష్టం లేకపోయినా, ఏమీ అనలేక తన తండ్రిని చేను గట్టుమీద విడిచిపెట్టి యింటికి వెళ్ళాడు నరసయ్య.

కాకులు కూస్తూంటే కబురువచ్చింది. ...జోగయ్య మామను తక్షణం రమ్మని. అతనికి తెలుసు... తనకూ, తన భార్యకూ ఋణానుబంధం తీరిపోతూ వుందని. కాని చేను యింకా వొకకొన తడవాల్సి వుంది. చూస్తూచూస్తూ పని మధ్యన వెళ్లలేకపోయాడు.

నీళ్లు నెమ్మదిగా పారుతూ నెర్రెల్నీ బొరియల్నీ నింపుతూ ఆ కొసని తడిపింది. అప్పుడు జోగయ్యమామ గబగబా యింటికి బయలుదేరాడు భార్యని చూద్దామని.

అతను వెళ్ళేటప్పటికి ఆమె అవసాన దశలో వుంది. ఆ అవస్థలో కూడా ఆమె ఇంటి సంగతులే మాట్లాడుతూ వుంది. "మూడోవాడికి ముడి వెయ్యమంటే నా మాట విన్నారు కాదు" అని భర్తని నిష్ఠూరాలాడింది. రెండో కోడలు తన మాట వినటం లేదని అక్కసు వెళ్ళబోసుకుంది. "ఎలుకలు పురువుల్ని కొట్టిపోస్తున్నాయ్. కాస్త మట్టి రాయించమంటే రాయించకపోతిరి" అన్నది. "బట్టలకి బాగా



తెలుగు కథకు రీతులు నేర్పిన త్రిపురనేని గోపీచంద్, నవలా రచయితగా కూడా ప్రసిద్ధులు. 'అసమర్థుని జీవయాత్ర' వంటి మనోవైజ్ఞానిక నవలతోపాటు 'పండిత పరమేశ్వర శాస్త్రి' వంటి తాత్త్విక నవలతోపాటు 11 నవలలు రాశారు. 1963లో 'పండిత పరమేశ్వర శాస్త్రి వీలునామా' నవలకు కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం లభించింది. 'తత్వవేత్తలు' వంటి తాత్త్విక గ్రంథాన్నీ రాశారు. తండ్రి రామస్వామి చౌదరి రచనా వారసత్వాన్ని పుణికిపుచ్చుకుని ఆధునిక ఆలోచనతో, ధోరణితో రచనలు చేశారు. 8 సెప్టెంబరు 1910లో జన్మించిన ఆయన 52 ఏళ్లకే అంటే 2 నవంబరు 1962లో మరణించారు. 'రైతుబిడ్డ', 'గృహలక్ష్మి', 'చదువుకున్న అమ్మాయిలు' వంటి చలన చిత్రాలకు మాటలు రాశారు. 'లక్ష్మమ్మ కథ'కు దర్శకత్వం వహించారు. వందకుపైగా రాసిన కథల్లో 'ధర్మవడ్డీ', 'జనానా' వంటి ఆణిముత్యాల కోవకు చెందినదే ఈ 'మమకారం'.

## తెలుగు సంస్థ

**మీకు భాషంటే ప్రాణమా? మీ సంస్థకు తేట తెలుగు పేరు పెట్టుకున్నారా? లేకపోతే ఏదైనా ఓ సంస్థకు అచ్చమైన, సృజనాత్మకమైన, చక్కటి తెలుగు పేరు చూశారా? అయితే ఆ వివరాలు, ఛాయాచిత్రం మాకు పంపించండి. కొత్తగా, ఆకర్షించేలా ఉన్నవి ఎంపికచేసి తెలుగు వెలుగు పత్రికలో మీ పేరుతో ప్రచురిస్తాం.**




'తెలుగు భాష, సంస్కృతి అంటే నాకు మక్కువ. మన అమ్మభాషకు నావంతు సేవ చేయాలని 'చందమామ' అని పేరు పెట్టుకున్నాను.. ఈ పేరు పెట్టడంలో మా అన్నయ్య సుభాష్ ప్రోత్సాహం, ప్రభావం ఉన్నాయి. ఆయన సివిల్స్ తెలుగు సాహిత్యం ఐచ్ఛికాంశంగా పరీక్ష రాసి ఉద్యోగాన్ని పొందారు. మొదటిసారి వచ్చిన వినియోగదారులు మీ అంగడి పేరు చాలా బాగుందని తప్పనిసరిగా చెబుతుంటారు.

**- బి.సబిత,**
ఇందిరానగర్‌కాలనీ, కర్నూలు

**చిత్రం: షకీర్, అశోక్‌నగర్, కర్నూలు**

గంజి పెట్టడంలే"దని చాకలి వాని మీద కేకలు వేసింది. తనే మజ్జిగ చెయ్యాలని కవ్వం కోసం లేవబోయింది. "పెద్దకోడలికి వెన్న తియ్యటమే చేతకాదు. సగానికి సగం మజ్జిగలోనే విడిచిపెడుతుంది" అని చెప్పింది. తాను గుటుక్కుమన్న తర్వాత యీ కాపరం ఏమవుతుందో అని వేదనపడ్డది.

"ఆ మాటలన్నీ ఇప్పుడెందుకు? ఒక్క క్షణం నిశ్చలంగా వుండు" అన్నాడు జోగయ్యమామ.

కాని ఆమె నోటికి మూతపడలేదు. ఆఖరి నిమిషం వరకూ మాట్లాడుతూనే వుంది. అందరికీ ఏదో ఒకటి చెబుతూనే వుంది. పనులు పురమాయిస్తూ వుంది. చివరికి 'అబ్బో అబ్బో' అంటూ బాధపడుతూ జోగయ్యమామ చెయ్యి గట్టిగా పట్టుకుంది. అతని చెయ్యి పట్టుకునే యీలోకాన్ని విడిచింది.

***

సరీగ్గా ఇప్పటికి నెల, ఆమె ఈలోకాన్ని విడిచి, భార్య జబ్బు లెక్కచెయ్యకుండా, ప్రాణాలను లెక్కచెయ్యకుండా అంత కష్టపడి నీరు పెట్టిన చేను మూస తిరిగింది. కూలివాళ్ళు కలుపు తీస్తున్నారు. హుషారుగా పాడుతున్నారు ఆడవాళ్ళూ మొగవాళ్లూ కలిసి.

జోగయ్యమామ అట్లాగే నేరేడు చెట్టునానుకుని కూర్చున్నాడు. అతని మనస్సు యిదివరకంత స్థిరంగా వుండటం లేదు. తన భార్య చనిపోయేటప్పుడు పడిన తాపత్రయం అతను మరచిపోలేక పోతున్నాడు. ఆమెకు తెలుసు తను పోతున్నానని. కాని ఒక్క నిద్రపోయి లేచేదానికి మల్లే మాట్లాడింది. పోయేదానికి తనకెందుకివన్నీ? ఒకళ్ళకు మాత్రం ఎందుకు? అంతా పోయేవాళ్ళే, అయితే యిక కావలసిందెవరికి? పొలంలో నుంచి పాట వినిపించింది.

ఒక్కసారి కన్నుతెరచి తన పొలం అంతా పారజూశాడు జోగయ్యమామ. ఆ మధ్య తన మనమడు తనతో పొలం వచ్చాడు. "తాతయ్యా, మన పొలం ఏది?" అని అడిగాడు. "నీకు కనబడుతున్నదంతా మందేరా" అన్నాడు. వంద ఎకరాల ఏక కంద్రిక. తన మనమడికి అవతలతట్టు కనబడకుండా సముద్రంలావున్న పొలం చూపిస్తూ 'ఇదంతా మందేరా' అన్నప్పుడు అతని మనస్సు ఆనందంతో నిండింది. మొట్టమొదట తానీవూరు ఎడ్లబేరానికి వచ్చాడు. తానెవరికయితే ఎడ్లని అమ్మాడో, ఆ ఆసామికే ఇల్లరికపుటల్లుడయాడు. తన నడవడిక చూచి, తన వ్యవహార జ్ఞానం చూచి ఆ ఆసామీ మోజుపడి కూతుర్ని తనకిచ్చిచేసి యింటిలో పెట్టుకున్నాడు. ఆనాటి నుంచీ వళ్ళు దాచుకోకుండా తాను పని చేశాడు. తను అడుగు పెట్టినప్పుడు తన మామకి అయిదెకరాలు వుండేది. తన చెమటతో తడిపి, పండించి పది సంవత్సరాలు తిరిగొచ్చేటప్పటికి ఆ అయిదెకరాలకీ మరొక అయిదెకరాలు జత చేశాడు. తన మామకి తన మీద గురి ఏర్పడ్డది. ఆయన పోతూపోతూ "నిన్ను దగ్గిరికి తీసినందుకు నా పరువు నిల్పావు" అన్నాడు. తను పడిన కష్టమంతా ఆ ఒక్కమాటతోనే తీరిపోయింది. తన మామ చనిపోయినప్పటికి వందెకరాలు చేశాడు. కాని వృద్ధి చేస్తున్నప్పుడు తనకు కలిగిన ఆనందం యిప్పుడు కల్గడం లేదు. రోజూపొలం రావటం, పొలాన్నంతా ఒక్కసారి చూచుకోవడం, పాలేళ్ళను గదమాయించడం, ఇంత వరకే మిగిలింది. అంటే ఆ ఆనందంపోయి అలవాటే మిగిలింది.

జోగయ్యమామ నేరేడు చెట్టుకానుకొని అట్టాగే కూర్చున్నాడు. పొద్దునెత్తిమీద కొచ్చింది. నేరేడు చెట్టు ఆకుల్లోంచి ఎండ జోగయ్యమామ ముఖం మీద పడ్డది. ఆ వేడికి ఆయన నెమ్మదిగా కన్ను తెరచి చూశాడు. పొలంలో కూలీలు లేరు. సర్దుకుని గబుక్కున లేవబోయాడు. కదిలాడు ఎదురుగా చెట్లకు కట్టిన మూటలు విప్పుకొని కూలీలు బువ్వ తినటం చూశాడు. కొంతమంది అన్నం ముద్దలు మింగుతున్నారు. కొందరు తలగుడ్డలు విప్పుకొని పడుకున్నారు.

'లేవండ్రా' అని కేకలేశాడు జోగయ్యమామ. "ఇంతవయస్సులో దొరకెంత యావ" అని నవ్వుకున్నారంతా. "ఇప్పుడేగా దొరా, కూటికొచ్చింది" అన్నాడొకడు కేరింతలు కొడుతూ. ఒక్కొక్కళ్ళూ మళ్ళీ చేలోకి దిగారు.

జోగయ్యమామ ఒక్కసారి పూరివైపు చూశాడు. మధ్యాహ్నం పూట ఆ నేరేడు చెట్టు కింద అన్నం తినటం జోగయ్యమామకు అలవాటు, ఇప్పటికీ ఆయన మనుమరాలు రోజూ అన్నం తెచ్చిపెడుతుంది. దూరంగా అన్నం గిన్నె నెత్తిమీద పెట్టుకొని మనుమరాలు రావటం చూశాడు. మబ్బు బాగా వేసింది. వర్షం కురుస్తుందేమో. తాను తడిస్తే ఫరవాలేదు కానీ, తన మనుమరాలు తడుస్తుందేమో! వర్షం ఎక్కువైతే పనసచెట్టు కింద గుడిసెలోకి వెళ్ళాలి. ఎప్పటి గుడిసె? ఎండకు ఎండుతూ, వానకు తడుస్తూ అట్లాగే నిలబడివుంది.

"తాతా అన్నం తెచ్చా" అని మనుమరాలు గిన్నె కిందబెట్టి గిన్నెకు కట్టిన గుడ్డ విప్పింది. ఒకపక్క గోంగూర పచ్చడి నల్లగా నిగనిగలాడుతూంది. ఒకపక్క ఆవకాయ పచ్చడి ఎర్రగా నెత్తురుముద్దలా వుంది. ఆ రెంటి మధ్యా తెల్లటి అన్నం.

"నువ్వు తింటూ వుండు తాతయ్యా నేను చేలోకి వెళ్ళివస్తా" అంటూ రివ్వున పరుగెత్తింది మనుమరాలు. జోగయ్యమామ నెమ్మదిగా లేచాడు. బట్టలు దులుపుకొని తలకు చుట్టుకొని కర్రపోటు వేసుకుంటూ గట్టు దిగాడు. కాలవలో నీళ్ళు దోసెడు తీసుకొని నోట్లో పోసుకొని పుక్కిలి వూశాడు. నెమ్మదిగా మళ్ళీ నేరేడుచెట్టు దగ్గర కొచ్చి కూర్చున్నాడు. కర్ర పక్కన పెట్టుకొని అన్నం గిన్నెముందుకు లాక్కున్నాడు. ఒక లొట్ట వేశాడు. ధ్వని కలగలేదు అలవాటు ప్రకారం ఆవకాయ పచ్చడి నాలిక్కి రాసుకొని, అలవాటు ప్రకారం లొట్టవేశాననుకున్నాడు, బాగుందనుకొని.

***

చేలో కూలీవాళ్ళు కలుపు తీస్తున్నారు. జోగయ్యమామ మనుమరాలు కాసేపు గట్టుమీద నుంచుని చూసింది. కూలివాళ్ళు 'చిన్న దొరసాని వొచ్చిం'దని పరియాసకాలాడారు. పరికిణి కాళ్ళకు తగలకుండా చేత్తో పట్టుకొని చేను గట్టుమీదుగా తాత దగ్గరకు పరిగెత్తడం మొదలుపెట్టింది. దారిలో తండ్రి కనిపించాడు.

"జరీపరికిణీ వేసుకొచ్చావేం అమ్మా, చేలోకి? బురద కాదూ?" అని అడిగాడు.

"తాత వేసుకురమ్మన్నాడు నాన్నా! ఈ పరికిణీ కట్టుకొస్తే చూడాలన్నాడు" అన్నది.

"చూశాడా?"

"మరచిపోయాడు"

"తాత అన్నం తిన్నాడా అమ్మా?"

"పెట్టొచ్చాను."

"ఎక్కడున్నాడు?"

"అదేం, ఆ నేరేడు చెట్టుకిందే"

ఇద్దరూ నేరేడు చెట్టు దగ్గరకు బయలుదేరారు. ఆకాశం మబ్బేసింది. వర్షమొస్తుందేమో అనుకున్నాడు నర్సయ్య. అరవయి ఏళ్ళు నిండినా తండ్రి పొలం రావటం నర్సయ్యకి యిష్టం లేదు. పొలానికి అన్నం తెప్పించుకోవటం అసలు యిష్టం లేదు. అతను ఊళ్లో పంచాయితీ బోర్డు ప్రెసిడెంటు. కొంచెం పరువుగా బతకాలంటాడు. కాని ఏం లాభం? తండ్రి తన మాటవినడు. చేను గట్టుమీద అన్నం తింటే పరువుపోతుందా అంటాడు.

ఎక్కడో వురిమింది. మెరుపుకూడాను. చిటపట చినుకులు. చిట్టి నాలుక సాచి చినుకులు రుచి చూస్తోంది. నడుస్తూ గబగబా నర్సయ్య నేరేడు చెట్టు దగ్గరకు నడిచాడు. చెట్టునానుకుని కూర్చొని వున్నాడు తండ్రి.

చేతికర్ర, తలపాగా ఒకపక్కన పడి వున్నాయి. కళ్ళు మూసుకొని ఏమిటి ఆలోచిస్తున్నాడు? అవసరం వున్నాలేకపోయినా ఆలోచించడం తప్పదు. గుప్పిడి ముక్కుకి ఆనించుకొని ఏదో వాసన చూస్తున్నాడు. గుప్పెటలో ఏముంది? పువ్వా? కాదు. పొగాకా. కాదు. మన్ను... వట్టిమన్ను! ... నేరేడిచెట్టు కింద రేగడి మన్ను.

"అయ్యా, అయ్యా" అని పిలిచాడు కొడుకు ... మళ్ళా పిలిచాడు.

'అబ్బాయ్' నీరసంగా తండ్రిమాట. గుప్పిలి సడలి చెయ్యి కిందికి వాలిపోయింది.

మన్ను ధారగా పడింది. మట్టి మట్టితో కలిసింది.

"అయ్యా! అయ్యా"

అయ్యమరి పలకలేదు.

***

## ఇవీ యక్ష ప్రశ్నలు... 2



21. వ్యవసాయదారులకు ఏది శ్రేష్ఠం?
22. విత్తనాలు చల్లేవారికి ఏది శ్రేష్ఠం?
23. ప్రతిష్ఠ పొందేవారికి ఏది శ్రేష్ఠం?
24. సంతానం పొందేవారికి ఏది శ్రేష్ఠం?
25. బతికివుండీ మరణించినవాడెవడు?
26. భూమికంటే బరువైనది ఏది?
27. ఆకాశం కంటే ఉన్నతుడు ఎవరు?
28. గాలి కంటే వేగం కలదేది?
29. గడ్డి కంటే విరివిగా పెరిగేది?
30. నిద్రలోనూ కన్ను మూయనిది ఏది?

### సమాధానాలు

21. వర్షం 22. ధాన్యం 23. గోవులు 24. పుత్రుడు 25. దేవతలూ, అతిథులూ, సేవకులూ, పితరులకు పెట్టనివాడూ; తాను అనుభవించనివాడూ 26. తల్లి 27. తండ్రి 28. మనసు 29. చింత 30. చేప

# మా ట క ట్టు 11



**నిలువు**

1. కంట్లో పడి బాధపెట్టేది (3)
2. కోట చుట్టూ తవ్వేది, ఎటైనా అదే! (3)
4. స్త్రీ (3)
5. పాటలు పాడేవాడు (4)
9. శ్రీలంకకి మరో పేరు శీర్షాసనం వేసింది (3)
10. సంప్రదాయం (3)
11. భార్యాభర్తలు (5)
13. కొద్దిపాటి నిద్ర (3)
14. ముసలి (2)
17. నశించడం (4)
18. నాచు కింది నుంచి (3)
19. ఇటు కాదు (2)
21. ఏనుగు కొమ్ము (2)
23. రామునిచేత చంపబడిన ఒక రాక్షసి కింది నుంచి (3)
24. ఇది ఒక మూల (3)
27. పరాచకం, సయ్యాట (3)
28. అంతస్తుల ఇల్లు (2)

**అడ్డం**

1. స్వర్గం కానిది (3)
3. శిరస్సు (2)
6. మోసపోవడాన్ని ఇలా కూడా అంటారు (2)
7. మొదలు (4)
8. మాయని మచ్చ (3)
10. ప్రమాణం (2)
12. కాచిన చింతపండు రసం అటు నుంచి (2)
13. వినాయకుడికి ప్రియమైనవి(4)
15. మృగరాజు (2)
16. మనస్సు అటు నుంచి (2)
19. అటుకులు ఏకవచనం తడబడింది (3)
20. లయాత్మక ధ్వని (2)
22. నేర్పరితనంతో కూడిన ఉపాయం తడబడింది (3)
24. కత్తి (2)
25. వంద (2)
26. పాడేది (2)
27. అయోధ్య ఈ నది ఒడ్డున ఉంది (3)
29. ఓ రకమైన చర్మవ్యాధి (3)
30. దెప్పిపొడుపు, వెక్కిరింత (2)
31. కొడుకు భార్య (3)
32. వారం వారం జరిగే అంగళ్ల సముదాయం (2)

↑ ఆధారాలు



**గేదెల సుశీల,** మద్రిపాలెం,
విశాఖపట్నం 85009 30755

సమాధానాలు 98లో...

# పంటచేలో ఒంటరి దిష్టిబొమ్మ



మొక్క మొలిచిననాడే
మళ్లీ కథ మొదలయ్యింది.
పైరు విత్తుతున్న ప్రతిసారీ
రైతు గుండెలో విచ్చుకత్తులు
దిగుతున్నాయి.
మొక్క ఎదుగుతున్న కొద్దీ
బతుకు గొడ్డుమోతుదవుతోంది.
కాయకష్టం కొండెక్కుతుంటే
ఊతమిచ్చినవాడే ఊరేగుతూ
ఉరితాళ్లు పేనుతున్నాడు.
కర్రు కదిలించినప్పుడల్లా
కన్నీళ్ల పర్యంతమవుతున్నాడు.
పాదు ఫలమిచ్చినా ఊతకర్రదే పెత్తనమంతా.
ఏళ్లు గడుస్తున్నా ఓటి బతుకే రైతుదంతా.
ప్రతి తిండి గింజపై తినేవారి పేరు రాసుంటే!
రైతు నాలుకలపై ఆ బీజాక్షరాలు ఎందుకు లేవు?
నీటిచుక్క నేలకింకినప్పుడల్లా
కొత్త అప్పులు పూస్తున్నాయి.
కాలం కరుగుతున్నప్పుడల్లా
బతుకుపై ఆశలు ఆవిరవుతున్నాయి.
పంట పండుతున్న ప్రతిసారీ
డొక్కలు ఎండుతూనే ఉన్నాయి.
బోరు గొట్టం దిగినప్పుడల్లా
రైతు పాతాళంలో పడిపోతున్నాడు.
పురుగులు తొలుస్తున్న ప్రతిసారీ
జేబుకు చిరుగులు పడుతున్నాయి.
ఆకాశం ఉరిమినప్పుడల్లా
చేతికందాల్సింది... నోటికందదనే బెంగ
భయాలు భూతంలా చుట్టుముట్టినప్పుడల్లా
పంట చేలో ఒంటరి దిష్టిబొమ్మలా కాపలా
గింజగింజనూ కాపాడుకునే వారికి
చేను కూడా అర్ధనారీశ్వర స్వరూపమే!
మట్టితో ముడిపడిన వారి జీవితం
లోతెంతో తెలియని నీటిజాడల రూపమే!
పొలమే జీవితంగా శ్వాసించిన వారికి
మనుగడే మాయ కావడం వింతే!
జీవన సారాన్ని ఔపోసన పట్టిన వాడికి
మార్కెట్ తంత్రాలు అర్థంకాని బ్రహ్మ పదార్థమే!
పదేపదే పడి లేస్తున్న ప్రయాసలో
రైతుబతుకంతా ఓ జూదమే..!

**- అమిర్నేని హరికృష్ణ,**
హైదరాబాదు
80080 01909


New
priya
RICE RICH
Healthy Cooking Oil
Refined Rice Bran Oil
100%
PURE
1l. Net.





# కాలానికి నిలిచే 'కాలాతీత వ్యక్తులు'

రచయిత్రులు సాహిత్యాన్ని కష్టాలు, కన్నీళ్లు, అసూయా ద్వేషాలు, ప్రేమలు అపార్థాలతో నింపేశారని ఫిర్యాదు చేసే వారికి తిరుగులేని సమాధానం చెప్పే నవల ఇది. జీవితం మీదా, సమాజం మీదా అద్భుతమైన అవగాహన, మేధో సంపత్తితో డా॥ పి.శ్రీదేవి నిజంగానే ఒక కాలాతీతమైన నవలను అలవోకగా సృష్టించి తెలుగు సాహితీ లోకానికి బహూకరించారు.

### సామాజిక దర్పణం

ఈ నవలలో చిత్రించింది 1950ల్లోని వాతావరణం! ఇందిర అనే పద్దెనిమిదేళ్ల యువతి తండ్రితో సహా విశాఖపట్నంలో ఒక ఇంటి కింది భాగంలో అద్దెకు దిగుతుంది. అదొక బ్రహ్మచారుల ఇల్లు! పైభాగంలో ప్రకాశం అనే మెడికో ఉంటాడు. చలాకీ ఇందిర




ప్రకాశంతో ఇట్టే స్నేహం చేస్తుంది. ప్రకాశం స్నేహితుడు కృష్ణమూర్తితో కూడా!

అద్దె పంచుకోడానికి వీలుగా ఉంటుందని ఒకరోజు కల్యాణి అనే స్నేహితురాలిని ఆ ఇంట్లో ఒక గదిలో ప్రవేశపెడుతుంది ఇందిర. కల్యాణిదో సినిమా దీనగాథ! తల్లి లేదు. తండ్రి రోగిష్టి. ఇంటిమీద అప్పు! ఎవరితోనూ కలవదు. ఎప్పుడూ తన దీనావస్థను తల్చుకుని కన్నీళ్లు పెట్టుకోవడం తప్ప ఆమెకు మరేమీ చేత కాదు.

కల్యాణి వచ్చాక ప్రకాశం ఆమె పట్ల ఆకర్షితుడవటంతో ఇందిర కల్యాణితో నిరంకుశంగా ప్రవర్తిస్తుంది. ఆమె వెళ్లిపోవడానికి కారణమవుతుంది. తండ్రిని పోగొట్టుకున్న కల్యాణికి స్నేహితురాలు వసుంధర ఆశ్రయమిస్తుంది. మునసబు రామినాయుడుని ఆస్పత్రికి తీసుకువెళ్లిన సందర్భంలో డాక్టర్ చక్రవర్తి కల్యాణికి పరిచయమవుతాడు.

ప్రకాశం మేనమామకు ఇందిరతో ప్రకాశం చనువుగా ఉంటున్నాడన్న సంగతి తెలిసి ఇందిరను హెచ్చరిస్తాడు. ప్రకాశాన్ని ఊరికి తీసుకుపోయి ఓ సంబంధం ఖాయం చేస్తాడు. భీరువైన ప్రకాశం మేనమామ మాట కాదనలేక, ఆ తర్వాత ఇందిర మీద వ్యామోహాన్ని వదులుకోలేక పారిపోయి వస్తాడు. ఇందిర అతడిని ఛీకొడుతుంది. తన కోసం మామయ్యను ఎదిరించి కాకుండా, పారిపోయి వచ్చినందుకు తిరస్కరిస్తుంది. అనుక్షణం మామయ్య నుంచి అతణ్ని రక్షించలేను వెళ్లమంటుంది!

మరోపక్క వసుంధర కృష్ణమూర్తి వైపు ఆకర్షితురాలవుతుంది. కానీ ఇందిరతో అమిత సాన్నిహిత్యం వసుంధరను వద్దనుకునేలా చేస్తుంది కృష్ణమూర్తిని! కథ అనేక మలుపులు తిరిగి కృష్ణమూర్తి ఇందిరనూ, చక్రవర్తి కల్యాణినీ పెళ్లాడటంతో ముగుస్తుంది.

### నిలువెత్తు ఆత్మస్థైర్యం

ఈ నవలకు హీరో - హీరోయిన్, ప్రాణం - జీవం... అన్నీ ఇందిరే! 'కాలాతీత వ్యక్తులు' పేరు వినగానే నిలువెత్తు ఆత్మవిశ్వాసంతో, సమాజాన్ని ధిక్కరిస్తూ ఆ పాత్ర కళ్లముందు సాక్షాత్కరిస్తుంది. అబ్బుర పరుస్తుంది. భయంగా కూడా ఉంటుంది. ఈ నవలలో కృష్ణమూర్తి, డాక్టర్ చక్రవర్తి, వసుంధర వంటి మంచి వాళ్లు; సెల్ఫ్ పిటీతో కుంగిపోతూ ఎప్పటికైనా దాన్లోంచి బయట పడుతుందో లేదో తెలీని కల్యాణి వంటి సాధారణమైన అమ్మాయిలూ; వైదేహి, ప్రకాశం వంటి భీరువులూ; ప్రకాశం మేనమామ వంటి స్వార్థపరులు; ఆనందరావు లాంటి పరాన్నజీవులూ - ఏ పాత్రకదే ప్రతిభావంతంగా తీర్చిదిద్దిందే అయినా వీళ్లందరినీ తోసిరాజని అంతటా తానై నిలబడుతుంది ఇందిర.

సిగ్గు, అణకువ, కన్నీరు, పాతివ్రత్యం- ఇలాంటి వాటికి ఆమె వద్ద చోటు లేదు. ప్రకాశం, కృష్ణమూర్తి ఇద్దరితోనూ చనువుగా ఉంటుంది. అవసరమైతే మొహం పగలగొట్టినట్లు మాట్లాడుతుంది. జీవితాన్ని మహా తేలిగ్గా తీసేసుకుంటూ గొప్ప అనుభవజ్ఞురాలిలా, ఆరిందాలా ప్రతి సమస్యనూ పూచిక పుల్లలా తీసేసే ఇందిరను చూసి మనం భయపడాలి తప్ప ఆమె దేనికీ భయపడదు.

'బతుకులో నాకు కావాల్సినదొకటి, దొరుకుతుంది ఇంకొకటి. అంచేత కసికొద్దీ లోకాన్ని ధిక్కరిస్తున్నాను. నాకూ ఓ ఇల్లూ, సంసారం, నాదీ అనిపించుకునే ఓ

## మంచి పుస్తకం

భర్తా పిల్లలు ఇవేవీ అక్కర్లేదనుకోను. కానీ నాకు లాటరీలో వచ్చినవి ఫైళ్లు, ఆఫీసు, నా మీద ఒరిగి బతికేసే నాన్న! నీ బరువులూ, సమస్యలూ నా మీద పడేయ్... అనగలిగి, నా కోసం సమస్తమూ ఒదులుకోగలిగే మగాడు నాకు కావాలి' అనే ఇందిరను చూస్తే జాలి కలుగుతుంది.

ప్రకాశం మీద మమకారాన్ని కూడా అతణ్ని జీవితాంతం మోయలేక తెంచుకుంటుంది. పైకి లెక్కలేనట్లు ప్రవర్తించినా ఆ ఘటన ఆమెను నొప్పిస్తుంది. కొన్ని సందర్భాల్లో ఆమె అనుభవిస్తున్న ఒత్తిడి, దాన్ని కనిపించకుండా సమాజాన్ని కాల్తో తన్నేసి ధిక్కరించే ఆమె ధీరత్వాన్ని చూస్తే ఓదార్చాలని అనిపిస్తుంది. కానీ జాలి పడటాలు, ఓదార్చడాలు అంటే ఆమెకు ఒళ్లు మంట. దటీజ్ ఇందిర!

ప్రకాశం విషయానికొస్తే దుర్బలత్వానికి మాత్రమే కాదు; అవకాశ వాదానికీ, ఆత్మ వంచనకూ పక్కు నిర్వచనం. అటు కల్యాణిని పోగొట్టుకునీ, ఇటు ఇందిర ఛీ కొట్టాక ఏమీ తోచక అల్లాడి ఆ తర్వాత స్థిమితంగా 'ఇది మేలే కానీ కీడు కాదు' అని అప్పటికప్పుడు ఆత్మవంచన చేసేసుకుంటాడు.

ఈ నవల్లో మంచి వ్యక్తులు కృష్ణమూర్తి, వసుంధర. కుర్రతనపు జోరులో కృష్ణమూర్తి ఇందిర కోసం అర్రులు చాచినా, ఆమె అతనితో గడిపాక ఆమె సాహసానికి నివ్వెరపోతాడు. కల్యాణి, వసుంధర తనతో చనువుగా ఉంటే భయం వేస్తోందని వసుంధరతోనే చెప్పేంత స్వచ్ఛమైన మనిషి. చక్రవర్తి మాటల్లో 'మధ్య తరగతి సంస్కారంలోని కుళ్లుకీ, మూర్ఖత్వానికీ అతని ప్రవర్తన ఒక దివ్యమైన విరుగుడు'.

'ఇదొక పోటీ ప్రపంచం. నేను నిన్ను మింగడానికి ప్రయత్నించకపోతే నువ్వు నన్ను మింగుతావు. అందరం గొంగళ్లలోనే అన్నాలు తింటున్నాం! మనమంతా శుద్ధ నూనె మిఠాయి సరుకులం! రెక్కలు ఉన్నాయనుకుని ఎగరడానికి ప్రయత్నిస్తాం. రెక్కలు లేవు మనకు. ఉన్నా అవి తడిసిపోయాయి. నా రెక్కల్ని బీదరికం తడిపేసింది. నీ రెక్కల్ని మితిమీరిన డబ్బు తడిపేసింది' అని ఇరవయ్యేళ్లయినా నిండని ఇందిర కఠోర జీవిత వాస్తవాల్ని కళ్ల ముందు ఆవిష్కరిస్తుంటే ముగ్ధుడవుతాడు.

పెళ్లి జరిగినప్పుడు కూడా ఇందిర చెప్పే మాటలు కృష్ణమూర్తికే కాదు, మనకూ ఎంతో నచ్చుతాయి. 'ఇది జీవితంలో ఒక భాగం మాత్రమే నాకు. నీతో ఎంత దూరం రమ్మన్నా వస్తాను కానీ ఏ ఘట్టంలోనూ నా వ్యక్తిత్వాన్ని చంపుకోలేను. ఇలా ఒకళ్ల కళ్లలోకి ఒకళ్లు చూస్తూ కూర్చునేందుకు కాదు ఇలా దగ్గరైంది. ఇద్దరం కలిసి ఒకే లక్ష్యం వైపు చూడగలిగితేనే సార్థకత' అంటుంది ఆ అమ్మాయి.

ఇహ కల్యాణిని మనలో చాలామంది ఎరుగుదురు. ఆమె పెరిగిన వాతావరణం



అలాంటిది మరి. తండ్రిని కూడా పోగొట్టుకుని అనాథగా మారి వీలైనన్ని సార్లు కళ్లనీళ్లు పెట్టుకుంటూ, దురదృష్టాన్ని నిందించుకుంటూ, కష్టాలకు ఎదురీదాలని ప్రయత్నిస్తూ కోపం చూపాల్సిన చోట కూడా అసహాయతను చూపిస్తూ మంచి పిల్లగా పేరు తెచ్చుకుంటుంది. మనసారా నవ్వుతూ, అంతలోనే బెదిరిపోయి కళ్లలో శ్రావణ మేఘాలు కమ్మించుకుంటుంది. అందుకే అందరి సానుభూతీ ఇట్టే సంపాదించు కుంటుంది. కానీ చక్రవర్తి భావించినట్లు ఆమె దుఃఖం కోసమే దుఃఖాన్ని ప్రేమిస్తుందేమో అనిపిస్తుంది కూడా.

### శ్రద్ధగా చెక్కిన శిల్పం

ఈ నవల ప్రత్యేకంగా ఏ సందేశమూ ఇవ్వదు. అలా ఇవ్వకపోవడమే ఈ నవల ప్రత్యేకత. ప్రతి పాత్రా అత్యంత శ్రద్ధగా చెక్కిన శిల్పంలా తోస్తున్నా, మరో పక్క రచయిత్రి మాత్రం వాటిని అలవోకగా, సునాయాసంగా సృష్టించారేమో అన్న భావన కలుగుతూనే ఉంటుంది. ప్రపంచంలో ఇన్ని రకాల స్వభావాలున్నాయా? రచయిత్రి వీటిని నిశితంగా పరిశీలించారా అని ఆశ్చర్యం కలుగుతుంది. కొడుకు మీద పగ సాధించి అతడి జీవితాన్ని నాశనం చేసి విజయం సాధించాననుకునే డాక్టర్ చక్రవర్తి పెంపుడు తల్లి, ఆమె కళ్లతో భర్తను బేరీజు వేసి జీవితాంతం ద్వేషంతో బతికిన అతడి భార్య... వీళ్లంతా మనకు ఎక్కడో ఒకచోట తారసపడే ఉంటారు.

ఆడపిల్లలు మగ పిల్లలతో స్నేహం చేయడాన్ని సహించలేని వసుంధర పిన్ని, నాకు సంబంధాలు చూడకండి మొర్రో అని చెప్పలేక పారిపోయి ఇందిర ఇంటికొచ్చే వైదేహి... కల్యాణిని ఓదార్చడానికి భుజం అందించడానికి పుట్టినట్లుండే మంచి డాక్టరు చక్రవర్తీ... వెరసి ప్రతి పాత్రా పరిశోధన చెయ్యదగ్గ పాత్రగా రూపుదిద్దుకుంది.

'తెలుగు స్వతంత్ర' వార పత్రికలో 1957-58 మధ్య 21 వారాలపాటు ధారావాహికగా ప్రచురితమై అప్పట్లోనే పాఠకులను ఉర్రూతలూగించింది. 1958లో వచ్చిన మొదటి ముద్రణ ప్రతులు మూడు నెలల్లోనే అయిపోయాయట. తరువాత చాలా ముద్రణలు పడింది.

ఈ నవల ఆధారంగా 1963లో చదువుకున్న అమ్మాయిలు సినిమా వచ్చింది. దశాబ్దాలు గడచినా ఈనాటికీ మళ్లీ ముద్రణకు వస్తూ, అసంఖ్యాక పాఠకులు 'తప్పక చదవాల్సిన నవల'గా ఎన్నుకుంటున్న క్లాసిక్ 'కాలాతీత వ్యక్తులు'. పఠితలకు ఏదో అశాంతినీ, ఎన్నో ఆలోచనలనూ, కొంత హాయినీ ఒకేసారి కలిగించే విశిష్ట రచన!



**వి.ఎల్.సుజాత**, అమెరికా
gulabi98@gmail.com

# పసిడి పలుకులు పిల్లల పాటలు



జైసీతారాం

**వేకువమ్మ లేచింది**
**తూరుపు వాకిలి తెరిచింది**
**గడపకు కుంకుమ పూసింది**
**బంగరు బిందె తెచ్చింది**
**ముంగిట వెలుగులు చల్లింది**

ఆ వేకువ పేరు జైసీతారాం. ఆయన చల్లిన వెలుగులు... బాలల గేయాలు. నీలాల నింగిలోన ఏడు రంగుల బాలల జెండా ఎగరేసిన 'ఏకోపాధ్యాయుడు' సీతారాం. బట్టీ చదువులనే చుక్కల నడుమ చిక్కిన జ్ఞానమనే చందమామ మీదకు చిన్నారులను చేర్చడానికి అపోలో వ్యోమనౌకల్లాంటి గేయాలను కూర్చిన వ్యక్తి ఆయన.

కుటుంబ బంధాలు, భావాలు, పండుగలు, కాలాలు, కొలతలు, లోహాలు, ఆటలు, పక్షులు, జంతువులు, రంగులు, రుచులు, శబ్దాలు, అక్షరాలు, కారణాలు, కార్యకారణాల నుంచి చరిత్ర, భూగోళ శాస్త్రం, సామాజిక అంశాల వరకూ రచనా వస్తువు ఏదైనా కావొచ్చు! పిల్లలకు గేయం అర్థమైతే చాలు... అది వారిలో ఊహాశక్తిని, పరిసరాల పట్ల ఆసక్తిని పెంచుతుంది. ప్రేమించే తత్వాన్ని నేర్పుతుంది. విజ్ఞానఖనుల్లా తీర్చిదిద్దుతుంది. అలాంటి మేలిమి ముత్యాల్లాంటి గేయాలనే రాశారు జైసీతారాం. అవి చిన్నారుల్లో 'చదవాలన్న' తపన పెంచుతాయి. వారి ఉజ్వల భవిష్యత్తుకు బాటలు వేస్తాయి.

పిల్లలు బళ్లోగానీ, ఇంట్లోగానీ మొదటగా 'చిట్టిచిలకమ్మ' గేయాన్ని వల్లె వేస్తారు. అదెంతో ప్రాచుర్యం పొందినప్పటికీ అంతకంటే గేయాలు మనకు లేవా అనిపిస్తుంది. పిల్లల పాటలు, గేయాల పేరుతో ఎంతోమంది ఎన్నో రాశారు. కానీ అవన్నీ తరగతి గదిలో ఉపాధ్యాయులు, పిల్లలు తేలికగా పాడుకునేలా ఉండవు. ఆ కొరతను జైసీతారామ్ గేయాలు తీరుస్తాయి. దాదాపు 150 వరకు ఆయన రాసిన బాలల గేయాలు ఎంతో సృజనాత్మకం. లయబద్ధం. సులువుగా, రాగయుక్తంగా ఆలపించేలా ఉంటాయి. అవి పిల్లల హృదయాలకు హత్తుకుని వాళ్లను ఆనంద పరవశుల్ని చేస్తాయి. జైసీతారాం గేయాలు రాయడమే కాదు, పిల్లలతో ఆడి పాడారు. వారి మనసులను దోచుకుని, అనుభూతి పొందిన అనుభవాల సారాన్ని అక్షరీకరించి 'మేం పిల్లలం' అంటూ ఓ పుస్తక రూపాన్ని దాల్చారు.

పిల్లల మనోభావాలను తెలుపుతూ ఆయన రాసిన ఈ చిట్టి గేయాన్ని చూడండి...

**అద్దంలో ఎవరమ్మ**
**ముద్దు మొగం బొమ్మా?**
**నే నెట్లు దువ్వితే**
**తానట్లె దువ్వు!**
**నేనెట్లు నవ్వితే,**
**తానట్లె నవ్వు!**

పిల్లలకు ఇష్టమైన వస్తువుల్లో అద్దం ఒకటి. కళ్లజోడు, టోపీ, దుస్తులు, మేజోళ్లు చిన్నారులకు అతి ఇష్టమైన వస్తువులు. వాటిని వేసుకొన్నప్పుడు వారి కళ్లలో ఆనందం, గర్వం తొణికిసలాడుతుంది. అలాంటి ఒక భావనను జైసీతారాం పై గేయంలో హృద్యంగా చిత్రీకరించారు.

పరిసరాలను పరిశుభ్రంగా ఉంచుకోవాలని చెబితే పిల్లలు వింటారా? దాన్నే అందమైన గేయరూపంలోకి మార్చి చెబితే... కచ్చితంగా వింటారు. సీతారాం అదే పని చేశారు.

**ఈగా! ఈగా! వెళ్లిపో!**
**ఇల్లు విడిచి వెళ్లిపో!**
**సుబ్బరంగ నువ్వుంటె**
**చెప్పకుండ వెళతా!**
**దోమా! దోమా! వెళ్లిపో!**
**దూరంగా వెళ్లిపో!**
**మురుగు నీరు లేకుంటె**
**తిరిగైన చూడను!**

బాలల దినోత్సవం నాడే...

చిన్నారుల కోసం అలతి అలతి పదాలతో, పొందికైన భావాలతో ఇంత చక్కటి గేయాలను రాసిన జైసీతారాం... అనంతపురం జిల్లా కోగిర గ్రామవాసి. గౌని ఓబుల్ రెడ్డి, చెన్నమ్మ దంపతులకు 1924 నవంబరు 14న జన్మించారు. కూనపురం, నడిపల్లి, బొంతలపల్లి,





కోగిర, రామగిరి తదితర ప్రాంతాల్లోని పిల్లలకు 1949 - 85 మధ్యకాలంలో విద్యాబుద్ధులు నేర్పించారు. 1983లో ఉత్తమ ఉపాధ్యాయుడిగా పురస్కారాన్నందుకున్నారు. 1984-85 విద్యా సంవత్సరానికి రెండో తరగతి వాచకాన్ని అందించారు. ఎక్కువ కాలం ఒకటో తరగతి ఉపాధ్యాయుడిగా, ఏకోపాధ్యాయుడిగా పని చేయడంతో... పసిపిల్లలంటే ఆయనకు చాలా ఇష్టం. వారికి సులువైన పద్ధతిలో బోధన చేయడానికి గేయాలను రాసి, పాడేవారు. 'ఉపాధ్యాయుణ్ని చూసి పిల్లలు భయపడకూడదు. ఆటపాటలతో వారికి దగ్గరవ్వాలి. వారి మనస్తత్వాలను తెలుసుకుని చదువు చెప్పాలి. అదే నా లక్ష్యం' అని చెప్పేవారాయన. అందుకుతగ్గట్టుగానే గేయరచన చేశారు.

యాభైయ్యారక్షరాల తెలుగు వర్ణమాలతో చిన్నారులకు దోస్తీ పెంచడానికి చక్కటి గేయం రాశారు సీతారాం.

**అ ఆ ఇ ఈ నేర్పండి అయ్యవారూ!**
**హక్షదంక అక్షరాలు యాభైయ్యారూ!**
**ఉయ్యాల జంపాల ఉ ఊ ఋ ౠ**
**ఎక్కడ? ఏవీ? ఎ ఏ ఐ**
**ఒహో! ఓహక్షా! ఒ ఓ ఔ**
**అం మమ్మమ్మమా! అః హహ్హహ్హా!**

. . . . . . . .

ఇలా సాగే గేయం పాడుకునేందుకు ఎంతో అనువుగా అంటుంది. అక్షరాలే కాదు, ఒత్తులు, సర్వనామాలు, పోలికలు జైసీతారాం గేయాల ద్వారా పిల్లలు సులభంగా నేర్చుకుంటారు. అలాగే రంగులు, రుచులు, అంకెలు కూడా. అన్యాపదేశంగా 'ఒత్తుల'ను నేర్పే గేయమిది...

**అక్కా! పెట్టు**
**చుక్కా బొట్టు!**
**అవ్వా! నాకు**
**బువ్వా పెట్టు!**
**అమ్మా! నాకు**
**బొమ్మా ఇవ్వు!**
**నాన్నా! నాకు**
**పెన్నూ ఇవ్వు!**

అలాగే రుచులను తెలుపుతూ 'అరటిపండు తీపు! - ఆదివారం రేపు!' రంగులను వివరిస్తూ 'కాకమ్మ నలుపు! - కారు మబ్బు నలుపు!', జంతువుల అరుపులను అనుకరిస్తూ 'పిల్లి పిల్లి! ఏమంటావ్ - మ్యావ్! మ్యావ్! మ్యావ్!' లాంటి గేయాలు జైసీతారాం కలం నుంచి జాలువారాయి. 'పిల్లి పిల్లి' గేయాన్ని తరగతి గదిలో ఆయన పాడుతుంటే, పిల్లలు శ్రుతి కలిపేవారు. దాంతో పరిసరాలంతా పిల్లులు, కుక్కలు, ఆవుల అరుపులతో మారుమోగేవి. చిన్నారులకు ఆకట్టుకునే బోధనా శైలి ఇది. అలాగే వాయిద్యాల శబ్దాలను తెలిపే 'తప్పెట కొడితే ఢం! ఢం! ఢం!' వంటి గేయాలను



రాగయుక్తంగా, భావయుక్తంగా పాడినప్పుడు పిల్లల ఆనందానికి అవధులు ఉండవు. ఈ గేయాల ద్వారా పిల్లల్లో ఒక కొత్త వెలుగును, ఆనందాన్ని చూస్తాం.

రకరకాల వృత్తుల మీద ఆయన రాసిన గేయం 'ఎంతోమంది పనివాళ్లు' దగ్గర నుంచి వారాలు, ఆటలు, పనిముట్లు, బంధుత్వాలు- అనుబంధాలు పిల్లల బాధ్యతలు... ఇలా ఆయన సృజించని అంశం లేదు. చెప్పుకుంటూ పోతే, ప్రతి గేయం ఒక ఆణిముత్యమే. మరీ ముఖ్యంగా చిన్నారుల్లో 'మాతృభాష'పై మమకారం పెంచడానికి రాసిన గేయమైతే మేలిమి మౌక్తికమే.

. . . . . . . .

**ఐతే మాత్రం మరువం! మరువం!**
**మాతృభాష మధురం**
**'అమ్మా' అంటూ అమృతం ఒలికే**
**కమ్మని పలుకే పలకండీ!**
**'నాన్న' అంటూ వెన్నెల విరిసే**
**వెన్న మాటనే వాడండీ!**
**అమ్మా! అమ్మా! నాన్నా! నాన్నా!**
**అమ్మా! అమ్మా! నాన్నా! నాన్నా!**

ఎలాంటి సంగీత పరిజ్ఞానమూ లేని వారైనా సులభంగా, భావయుక్తంగా పాడుకోగల గేయాలివి. ఆయన రాసిన గేయాలన్నింటినీ సంకలనం చేసి 'టింబక్టు కలెక్టివ్' వారు 'మేం పిల్లలం' పేరుతో పుస్తకాన్ని ప్రచురించారు. బాలల గేయాలతో పాటు జైసీతారాం... 'అక్షరసైన్యం, నిట్టూర్పులు' తదితర ఉద్యమ సాహిత్యం, 'జైసీతారాం సీసాలు' పేరిట వివిధ అంశాలపై సీస పద్యాలు, నాటికలు రాశారు. సీతారాం చేయితిరిగిన రచయితే కాదు... తబలా, హార్మోనియాలను వాయించడంలో దిట్ట. మంచి చిత్రకారుడు కూడా. తన గేయాలకు తానే బొమ్మలేసుకునే వారు. 'బాలసాహిత్యం పిల్లలకు అర్థమయ్యే భాషలో ఉండాల'ని చెప్పే జైసీతారాం తన రచనలో ఆ ప్రమాణాలనే పాటించారు. చిన్నారుల సర్వతోముఖాభివృద్ధికి అక్షరం ఆలంబన కావాలని కోరుకున్న ఆయన అక్టోబరు 9, 2000న లోకాన్ని విడిచి వెళ్లారు.

ప్రతి ప్రాథమిక పాఠశాలలో, ప్రతి ప్రాథమిక ఉపాధ్యాయుని వద్ద, చిన్న పిల్లలున్న ప్రతి ఇంట్లో ఉండాల్సిన పుస్తకం 'మేం పిల్లలం'. భాషాభివృద్ధికి, సృజనాత్మకత పెంపునకు ఎంతో దోహదపడే ఈ గేయాలను పిల్లలకు తప్పక పరిచయం చేయాలి. మనం కూడా అలాంటి గేయాలను రాయాలని, కొత్తదనం చూపాలనే స్ఫూర్తిని పిల్లల్లో కలిగిస్తాయవి. 'అగ్గిపుల్ల, సబ్బుబిళ్ల కాదేదీ కవితకనర్హం' అని సాధారణ పదాలతో శ్రీశ్రీ... కవితలకు కొత్త ఉరవడిని సృష్టించినట్లే, బాలల గేయాలకు జైసీతారాం నూతన ఉరవడిని సృజించారు. బాలసాహిత్యం ప్రాముఖ్యతను అర్థం చేసుకుని, దాన్ని చిన్నారుల నేస్తంగా మలచడమే మనం ఆయనకు ఇచ్చే నివాళి.



**టి.వి.రామకృష్ణ,**
నెల్లూరు. 99514 41131

# మలయాళీ తెలుగు ప్రేమ 'చిత్రాతి చిత్రం'

**నీంగల్ తెలుగు సంసారిక్కుమో?**
**(నువ్వు తెలుగులో మాట్లాడగలవా?)**
**ఎనిక్కు తెలుగు సంసారిక్కన్ అరియిల్లా. పక్షే, ఎనిక్కు తెలుగు సినిమా ఇష్టమాను.**
**(నాకు తెలుగు మాట్లాడటం రాదు. కానీ, తెలుగు సినిమాలంటే ఇష్టం)**

కేరళ తీరప్రాంత పట్టణం కాలికట్‌లోని మలబారు క్రైస్తవ కళాశాల విద్యార్థులను అలా ప్రశ్నిస్తే ఇలా సమాధానమిస్తారు. అయినా.. అంతదూరం వెళ్లి వాళ్లను ఆ ప్రశ్న అడగాల్సిన అవసరమేంటి? మన భాష రానప్పుడు మరి వాళ్లలా మన సినిమాలపై ఇష్టం పెంచుకున్నారు?

అనగనగా ఓ సహాయ ఆచార్యుడు. పేరు... ఎంసీ వశిష్ట్. మలబారు కళాశాల చరిత్ర విభాగంలో పని చేస్తుంటారు. పక్కా మలయాళీ. చలనచిత్రాలంటే చెవికోసుకుంటారు. అవి ఏ భాషకు చెందినవైనా సరే, ఆయనకు పట్టింపు లేదు. అన్నింటినీ చూస్తారు. ఆ క్రమంలోనే తెలుగు చలనచిత్రాలతో ప్రేమలో పడ్డారు. మన శంకరాభరణం, సాగరసంగమం, ఆకలిరాజ్యం, రుద్రవీణ, శివ, స్వాతికిరణం తదితర చిత్రాలంటే ఆయనకెంత ఇష్టమో. దర్శకుడు కె.విశ్వనాథ్‌కు వీరాభిమాని. ఆయన చిత్రాల్లో తొణికిసలాడే తెలుగుదనానికి వశిష్ట్ ఆకర్షితులయ్యారు. తెలుగు సంస్కృతిని అభిమానించడం ప్రారంభించారు. వృత్తి రీత్యా చరిత్ర ఆచార్యులు కావడంతో దేశం గురించి, దేశ ప్రజల గురించి ఆలోచనలు ఎక్కువ. రాష్ట్రాలకతీతంగా, భాషలకతీతంగా భారతీయులందరూ కలిసుండాలనేది ఆయన అభిమతం. భౌగోళికంగా కేరళ, ఆంధ్రప్రదేశ్‌లు దక్షిణ భారతంలోనే ఉన్నా... రెండు రాష్ట్రాల ప్రజలకు ఒకరి గురించి మరొకరికి తెలిసింది తక్కువ కదా అని అనిపించింది ఆయనకు. తనకెంతో ఇష్టమైన తెలుగు సినిమాల ద్వారానే తన విద్యార్థులకు తెలుగు ప్రజలను, వారి సంస్కృతిని పరిచయం చేస్తే ఎలా ఉంటుందన్న ఆలోచన మొదలైంది.



అప్పటికే తెలుగు సినిమాలు మలయాళంలోకి అనువాదమై వస్తున్నాయి. విజయవంతమవుతున్నాయి. (అవును! తెలుగు అనువాదాలకు కేరళలో మంచి గిరాకీ ఉంది) కానీ, తెలుగు నటీనటులు తెలుగులో మాట్లాడే దృశ్యాలను మలయాళీలు ఎప్పుడూ చూడలేదు. అంతేకాదు, అనువాద చిత్రాలన్నీ కొత్తవి. కళాఖండాల్లాంటి తెలుగు చిత్రాల గురించి వారికి తెలియదు. అంటే, అసలు తెలుగు చిత్రాలకు వారు దూరంగా ఉన్నట్లే కదా! వాటిని తెచ్చి చూపిస్తే... తెలుగు భాష, సంస్కృతితో మలయాళీ విద్యార్థులకు పరిచయం అవుతుంది కదా అనిపించింది వశిష్ట్‌కు. అదే సమయంలో కళాశాలలో 'పాత్రికేయ, పర్యావరణ, అంతరిక్ష' క్లబ్‌లు ఏర్పాటయ్యాయి. ఆయా అంశాలపై వివిధ కార్యక్రమాలు నిర్వహిస్తూ విద్యార్థుల్లో వాటిపై అవగాహన పెంచడం వాటి లక్ష్యం.

వాటి బాటలోనే జనవరి, 2011లో 'తెలుగు ఫిల్మ్‌క్లబ్'ను ఏర్పాటు చేశారు వశిష్ట్. తెలుగు సినిమాకు 80 ఏళ్లు పూర్తయిన సందర్భంగా అదే ఏడాది సెప్టెంబరులో రెండు ప్రదర్శనలు నిర్వహించారు. తెలుగు చలనచిత్ర, పత్రికా రంగాలకు సంబంధించి ముఖ్యాంశాలను వివరిస్తూ వాటిని నిర్వహించారు. సామాజిక ఇతివృత్తాలతో నిర్మితమైన 'ఈనాడు' (కథానాయకుడు కృష్ణ) లాంటి చిత్రాలతో పాటు అలనాటి తెలుగు ఆణిముత్యాలను ప్రదర్శించారు. వాటిని చూసిన అధ్యాపకులు, విద్యార్థులు ఆశ్చర్యపోయారు. 'తెలుగు' వైపు ఆకర్షితులయ్యారు. ఈ ప్రదర్శన గురించి తెలుసుకుని బయటి వారెందరో వచ్చారు. మన చిత్రాలను చూశారు. తర్వాత కూడా ఫిల్మ్ క్లబ్ తరపున వివిధ చిత్రాలను ప్రదర్శించారు. వాటికీ అదే స్పందన వచ్చింది. ఇటీవలే 'తెలుగు చలనచిత్ర మహామహులు' పేరిట ఓ ప్రదర్శన ఏర్పాటు చేశారు. ఆనాటి నుంచి ఈనాటి వరకూ తెలుగు చలనచిత్ర పరిశ్రమకు విశిష్ట సేవలందించిన పెద్దల ఛాయాచిత్రాలతో పాటు వారి జీవిత విశేషాలను ఈ ప్రదర్శన ద్వారా కళాశాల విద్యార్థులకు పరిచయం చేశారు.





**ఉమ్మడి శత్రువు**

తెలుగు అద్భుతమైన, కవితా భాష. రెండు ద్రావిడ రాష్ట్రాలకు చెందిన ప్రజలను దగ్గర చేయాలన్నదే మా ప్రయత్నం. ఈ రెండు ప్రాంతాల భాషలూ ఆంగ్లం ధాటికి దెబ్బతింటున్నాయి. మలయాళ మాధ్యమ పాఠశాలల కన్నా కేరళలో ఆంగ్ల పాఠశాలలకే ప్రాచుర్యం ఎక్కువ. పారిశ్రామికంగా మా రాష్ట్రం వెనుకబడి ఉండటం వల్ల ఉద్యోగాల కోసం యువత ఇతర రాష్ట్రాలకు వలసపోతోంది. దాంతో తప్పనిసరి పరిస్థితుల్లో ఆంగ్లం నేర్చుకోవాల్సి వస్తోంది. ఫలితంగా వాళ్లు మాతృభాషను మర్చిపోతున్నారు. మాతృభాషలను పరిపాలన, బోధన భాషలుగా అమలు చేయాలి.

**– వశిష్ట్,**
**సహాయ ఆచార్యులు**




మొన్ననే తెలుగు దినపత్రికల ప్రదర్శన కూడా నిర్వహించారు.

ప్రస్తుతం వశిష్ఠ్‌తో పాటు తెలుగు ఫిల్మ్‌క్లబ్‌లో 40 మంది శాశ్వత సభ్యులున్నారు. అందరూ మలయాళీలే. కానీ, 1200కు పైబడిన విద్యార్థులతో అలరారే కళాశాలలో తెలుగును ప్రచారం చేయడమే లక్ష్యంగా పని చేస్తున్నారు. ఒక విద్యార్థికి తెలుగు తెలిసిందంటే, తన కుటుంబ సభ్యులకు, స్నేహితులకూ అది దగ్గరవుతుంది. వారూ మన భాషపై, సంస్కృతిపై ఆసక్తి పెంచుకుంటారు. తెలుగు ఫిల్మ్‌క్లబ్ పుణ్యమా అని కాలికట్‌లో అలా ఆసక్తి పెంచుకున్న వారెందరో! అడగకుండానే... 'తెలుగు'కు ఇంత ఉపకారం చేస్తున్న వశిష్ఠ్, ఆయన మిత్ర, విద్యార్థి బృందానికి ఏమివ్వగలం!

వశిష్ఠ్‌జీ... ఒరుపాడు నన్ని! (చాలా కృతజ్ఞతలు)

**- తెలుగు వెలుగు బృందం**



## ఇవీ యక్ష ప్రశ్నలు... 3



31. పుట్టాక కూడా కదలనిది ఏది?
32. దేనికి హృదయం లేదు?
33. వేగంతో ఏది వృద్ధి చెందుతుంది?
34. దారిలో నడిచేవానికి మిత్రులెవరు?
35. గృహస్థునికి స్నేహితురాలెవరు?
36. రోగపీడితునికి స్నేహితుడెవరు?
37. చనిపోయేవాడికి ఏది నేస్తం?
38. సర్వభూతాలకూ అతిథి ఎవరు?
39. ప్రాచీన ధర్మం ఎలాంటిది?
40. అమృతమేది?

### సమాధానాలు

31. గుడ్డు 32. రాతికి 33. నది 34. తోటి ప్రయాణికులు 35. భార్య 36. వైద్యుడు 37. దానం 38. అగ్ని 39. అమృతంలాగా అనుభవించదగింది 40. సోమతీర్థం

## ఒక తల్లి బిడ్డలే!



పలుకుకు, పనిముట్టుకు పోలికేంటి?

పలుకు... జీవజాతులన్నింటిలో మనిషిని ప్రత్యేకంగా నిలిపింది.

పనిముట్టు... జీవజాతులన్నింటికీ మనిషినీ నాయకుణ్ని చేసింది.

నరులకు, వానరులకు విభజన గీతలు ఈ రెండే. ఇవే లేకపోతే ఈ లోకంలోని కోటానుకోట్ల జీవుల్లో ఒకరిగా మాత్రమే మానవుడు మిగిలిపోయేవాడు. అలాంటి ఆ రెండింటి మధ్య ఏదైనా సంబంధం ఉందా?

అలాంటిది ఇలాంటిది కాదు... ఏకంగా 'రక్త'సంబంధమే ఉంది. భాషను వినియోగించేటప్పుడు, పనిముట్లను తయారు చేసేటప్పుడు మెదడుకు ఒకే పద్ధతిలో రక్తప్రసరణ జరుగుతుంది. అంతేకాదు, ఈ రెండింటికీ మెదడులో మూలస్థానమూ ఒకటే. 'భాషా వినియోగం, పనిముట్ల తయారీ అనేవి రెండూ సంక్లిష్ట ప్రణాళిక, సమన్వయీకృత కార్యాచరణ అవసరాల'ని జీవ పరిణామ సిద్ధాంతకర్త ఛార్లెస్ డార్విన్ ప్రతిపాదించాడు. ఈ రెండు విషయాలకు సంబంధం ఉందని మొదట చెప్పిన వ్యక్తి ఆయనే. అయితే, దానిని నిరూపించడానికి అప్పట్లో అంత సాంకేతికత లేదు. ఇప్పుడు ఎఫ్‌టీసీడీ అనే అధునాతన అల్ట్రాసౌండ్ పరీక్షతో లివర్‌పూల్ విశ్వవిద్యాలయ పరిశోధకులు ఈ విషయాన్ని నిరూపించారు. రాతి పనిముట్ల తయారీదారులపై పరీక్షలు నిర్వహించి వాస్తవాలను నిర్ధరించారు. ఆహారాన్ని సంపాదించుకోవడానికి పనిముట్లను తయారు చేసుకున్న మనిషి... ఆ సంపాదనా క్రమంలో తన అనుభవాలను తోటివారితో పంచుకోవడానికి మాటలు నేర్చాడు. మానవ జాతి ప్రస్థానానికి మూలమైన ఈ విషయాల మధ్య భౌతిక సంబంధం ఉండటం ఆశ్చర్యంగా ఉంది కదూ!

**- తెలుగు వెలుగు బృందం**

# కన్నీటి అక్షరాల జలధి

## యాతమేసి తోడినా...



పాలు తాగి రొమ్ము గుద్దేవాళ్లకు... కులాల కుంపట్లు రాజేసి చలి కాచుకునే వాళ్లకు... పక్కవాణ్ని ద్వేషిస్తూ, పైకి మోసుకుపోలేని పైసల్ని ప్రేమించే వాళ్లకు మొట్టికాయలేసే మాటలవి. కుల, మత, ఆర్థిక, లింగ భేదాలకతీతంగా మనిషిని, మనిషిలా చూడటమే మానవత్వమని ప్రబోధించే పలుకులవి. అంతేనా... కష్టాలు కయ్యానికి వచ్చినప్పుడు కంగారుపడి కన్నీళ్లు పెట్టుకుంటే ఫలితముండదనే వాస్తవాన్ని విడమరచే పదాలవి. జానపదాల జలధి జాలాది కలాన్ని అజరామరం చేసిన అక్షరాలవి.

తెలుగు సినీ జానపద సాహిత్యంలో కొసరాజు చక్రవర్తి. 'నేను సామంత రాజును' అని ప్రకటించడమే కాదు... 'అక్షరాలా' నిరూపించిన పల్లెపదాల మొనగాడు జాలాది రాజారావు. తన పాటల ద్వారా పల్లీయుల పలుకుబడుల్లోని అందచందాలను ఆబాలగోపాలానికి ప్రదర్శించిన వ్యక్తి ఆయన. అలాంటి జాలాది రచించిన 'యాతమేసి తోడినా' (చిత్రం: ప్రాణం ఖరీదు) గీతాన్ని వింటే.... జీవితం గాయం చేసినప్పుడు గేయం ఇచ్చే ఓదార్పు ఎలా ఉంటుందో తెలుస్తుంది.

**యాతమేసి తోడినా యేరు ఎండదూ**
**పొగిలి పొగిలి ఏడ్చినా పొంత నిండదు**
**దేవుడి గుడిలోదైనా పూరి గుడెసెలోదైనా**
**గాలి ఇసిరికొడితే... ఆ దీపముండదు**
**॥యాతమేసి॥**

**పలుపుతాడు మెడకేస్తే పాడి ఆవురా**
**పసుపుతాడు ముడులేస్తే ఆడదాయిరా**
**కుడితి నీళ్లు పోసినా అది పాలుకుడుపుతాదీ**
**కడుపుకోతకోసినా అది మనిషికే జన్మ ఇత్తాదీ**
**బొడ్డు పేగు తెగిపడ్డా రోజు తలుసుకో**
**॥యాతమేసి॥**

**అందరూ నడిసొచ్చిన తోవ ఒక్కటే**
**సీమునెత్తురులు పారే తూము ఒక్కటే**
**మేడ మిద్దెలో ఉన్నా సెట్టునీడ తొంగున్నా**
**నిదరముదరపడినాకా పాడె ఒక్కటే**
**వల్లకాడు ఒక్కటే**
**కూతనేర్చినోళ్ల కులం కోకిలంటరా**
**ఆకలేసి అరసినోళ్లు కాకులంటరా ॥యాతమేసి॥**

చక్రవర్తి సంగీత సారథ్యంలో ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం ఆలపించిన ఈ పాట సాహిత్యంలో వేమన భావాలతో పాటు అన్నమయ్య ఆలోచనలూ కన్పిస్తాయి. సమాజంలో వేళ్లూనుకున్న అంతరాలను అక్షరాలతో ఎదుర్కొన్న ఆ మహానుభావుల అడుగుజాడల్లో నడుస్తూ సామాజిక దురాచారాలపై జాలాది సంధించిన అస్త్రం ఈ గీతం. పల్లె పదాలు, పలుకుబళ్లు, సామెతల స్థాయిలోని పాదాలతో సాగిన ఈ రచన... తెలుగు సినీ కవుల ప్రతిభకు మెచ్చుతునక.

మనసులోని బాధను ఏరుగా భావిస్తే... ఏడుపు ఏతమవుతుంది. ('ఏతం'...నీళ్లు తోడటానికి వాడేది. ఇద్దరు వ్యక్తులు అటూ ఇటూ దీంతో నీళ్లు తోడతారు. ఒకప్పుడు పొలాలకు నీళ్లు పెట్టడానికి వాడేవారు) ఏడిస్తే బాధ పోతుందన్న నమ్మకం లేదు కదా. ఈ వేదాంతపరమైన విషయాన్నే జాలాది 'ఏతమేసి తోడినా ఏరు ఎండద'ంటూ ప్రతీకాత్మకంగా చెప్పారు. ఏడుపును ఏతంతో పోల్చడంలో విశేషం ఉంది. ఇద్దరు పట్టుకుని ఏతంతో నీళ్లు తోడినట్లే... రెండు కళ్లు కలిసే కన్నీటిని వర్షిస్తాయి!

పొంత అంటే వేన్నీళ్లు కాసే కుండ. పూర్వం వంటకు రాళ్ల పొయ్యిలు వాడేవారు. దాంట్లో రెండు వైపులా రాళ్లు పెట్టి మూడో వైపు ఓ నీళ్ల కుండ పెడతారు. వంట చేసేటప్పుడు పొయ్యిలోని మంట వేడికి ఆ నీళ్లు కాగుతాయి. వాటిని స్నానానికి వాడుకునే వారు. చలికాలాన్ని మినహాయిస్తే, సాధారణంగా వేన్నీళ్లతో స్నానమెందుకు చేస్తాం? అలసిన ఒడలుకు సాంత్వన కలిగించడానికి! 'పొంత నింపుతున్నామంటే'... శారీరక కష్టం నుంచి ఊరడింపు పొందాలనుకుంటున్నామనే కదా! అదే... మనసు అలసిపోతే! దానికి సాంత్వన చేకూర్చడానికి కన్నీళ్లతో 'పొంత'ను నింపాలనుకోవడం అర్థరహితం. మంట వేడి(బాధ తీవ్రత)కి పొంతలో పడిన కన్నీటి చుక్క ఆవిరవుతుంది కానీ ఆదరువు కాబోదు... దాంతో ఎన్ని కన్నీళ్లు కార్చినా ఆ పొంత నిండదు. మనసు తేలికపడదు.

సుఖదుఃఖాలు రేయింబవళ్లు. కష్టాలకు అతీతంగా కాపురాలు సాగవు. కాలం కలిసిరానప్పుడు ఎంతటి వారైనా నూకలు తినాల్సిందే. గుడిలో ఉందా, గుడిసెలో ఉందా అన్నది ముఖ్యం కాదు, గాలి విసిరికొడితే దీపం కొండెక్కిపోతుందన్నది పరమసత్యం. ఈ ఒక్క ఉపమానంతో కష్టాల సామ్యవాదాన్ని కళ్లకు కట్టారు జాలాది. మనకు వచ్చిందే పెద్ద కష్టమంటూ అధైర్యపడటమెందుకని ఆత్మవిశ్వాసాన్ని పంచే ప్రయత్నం చేశారు.

అ అంటే అమ్మ, ఆ అంటే ఆవు... పసివారికి వర్ణమాలతో పరిచయం పెంచడమే కాకుండా అమ్మకు, ఆవుకు ఇంకేమైనా పోలికలున్నాయా? ఎందుకు లేవూ... ఆకలి తీర్చే ఆవును 'గోమాత'

అంటూ తల్లిని తలచుకుంటున్నాం కదా. అందుకే జాలాది రెండో చరణంలో స్త్రీ పురుష భేదభావాలను ఎండగట్టడానికి అమ్మకూ ఆవుకూ పోలిక పెట్టారు. ఆవును అదుపులో ఉంచుకోవడానికి మెడలో పలుపు



తాడు వేస్తారు... స్త్రీ ఒకరికి సొంతమైందని చెప్పడానికి పసుపు తాడు కడతారని (పెళ్లితో పురుషుడు కూడా మరొకరికి సొంతమవుతాడు కదా. దాని గుర్తేంటి? లేదు) చెప్పారు. కుడితి నీళ్లు పోశామని చెప్పి పాడి ఆవు పాలివ్వకుండా ఉంటుందా. తన స్తన్యంతో తన బిడ్డ ఆకలినే కాదూ యజమాని అవసరాలనూ తీరుస్తుంది. (కుడుపు అంటే స్తన్యమివ్వడం, ఆహారం, తాగడం) స్త్రీ కూడా అంతే. కడుపు కోసి (శస్త్రచికిత్స) కన్నీళ్లు పెట్టించినా సరే, మనిషికి జన్మనిస్తుంది. నిస్వార్థతకు పర్యాయపదం నారి. అలాంటి తనను బాధపెట్టి బావుకునేదేంటని ప్రశ్నిస్తున్నారిక్కడ కవి.

ఉన్నోళ్లు, లేనోళ్లు, ఉన్నత కులాలు, నిమ్న జాతులు... ఎన్ని రకాలుగా విడిపోవాలో అన్ని రకాలుగా విడిపోయాడు మనిషి. సృష్టిలో మరే ప్రాణికి లేని 'ఆలోచన' ఉన్న మనిషే... మరే జీవజాతుల్లో లేని భేదభావాలకు దాసోహమయ్యాడు. అందుకే జాలాది... తల్లి గర్భంలో ఉన్నప్పుడు ఎవరికీ అంటని 'మరకల'ను ఆ క్షణం తర్వాత ఎవరికి వారు అంటించుకోవడం ఎందుకని అంటున్నారు. ఉమ్మనీటిని దాటుకుంటూ అందరూ నడిచొచ్చిన తోవ ఒకటే అయినప్పుడు... భూమ్మీద బతుకు ప్రయాణంలో తరతమ భేదాలతో ఎవరి దారి వారు చూసుకోవడమెందుకని ఆవేదన చెందుతున్నారు కవి. సీము, నెత్తురులు పారే తూము అంటే శరీరం. వెంట్రుకల నుంచి అరికాళ్ల వరకూ మానవుల శరీర నిర్మాణమంతా సమానం. కళ్లకు కనిపించే ఈ 'సమానత్వాన్ని' వదిలేసి కంటికి కనిపించని మానసిక వికారాలతో పక్ష చూపుకోవడం ఎందుకంటున్నారు.

మిద్దెలోని హంసతూలికా తల్పాలపై శయనిస్తున్నారా, మట్టి గోడల గుడిసెలోని నేలపై పడుకున్నారా అన్నది ముఖ్యం కాదు శాశ్వతనిద్రలోకి జారుకున్నాక (నిదరముదరపడినాకా) అందరూ పాడెపై పవళించాల్సిందే. వల్లకాటికి బైలెల్లాల్సిందే. అంతమాత్రం దానికి పేద, ధనిక అంటూ గొప్పలు చెప్పుకోవడం దేనికంటున్నారు జాలాది చివరి చరణంలో.

చివరి రెండు వాక్యాలతో పాటకు అద్భుతమైన ముగింపునిచ్చారు కవి. 'కూతనేర్చినోడు కోయిల'గా సత్కారాలు అందుకుంటుంటే 'ఆకలేసి కేకలేసినోడు కాకి'గా ఛీత్కారాలు పొందుతున్నాడని సమాజంపై వ్యంగ్య బాణాలేశారు. కడుపు నిండిన వాడు కూనిరాగాలు తీస్తాడు. వాటినే కుహుకుహు రాగాలుగా భావించి సమాజం శ్రవణానందం పొందుతుంది. ఆకలి కేకలతో అలమటించే అన్నార్తుల వ్యథను మాత్రం 'కాకిగోల'గా అసహ్యించుకుంటుంది. ఇదెంత వరకు న్యాయమని ఎండగడతారు కవి.

ఈ పాట బాణీయే కాదు ప్రతి పాదమూ జానపదమే! ఇందులో దృష్టాంతాలంకారం కనిపిస్తుంది. రెండు అంశాలను ఒకదానికొకటి బింబ ప్రతిబింబాలుగా పోల్చడమే దృష్టాంతాలంకారం అవుతుంది. యాతమేసి తోడినా... పొగిలి పొగిలి ఏడ్సినా... అన్న మాటలను ఒకదానికొకటి బింబంగా చూపించారు. దేని అర్థం దానికున్నా ఆ రెండింటిలోనూ ఒకే విషయాన్ని చెప్పే ప్రయత్నం చేశారు. అలాగే, పలుపుతాడు మెడకేత్తే - పసుపుతాడు ముడులేత్తే, ...తోవ ఒక్కటే. ...తూము ఒక్కటే; .స్వచ్ఛమైన తెలుగు పదాలతో గుబాళించే పూదోట ఈ పాట.

'ఎక్కువ పాటలు రాయాలనే కోరిక నాకెప్పుడూ లేదు. రాసిన నాలుగూ మంచివి రాయాలనే తపన తప్ప' అని చెప్పిన జాలాది మాట మీద నిలబడ్డారు. లక్షల విలువ చేసే అక్షరాలను తెలుగు వారికి కానుకగా అందించారు.

**- తెలుగు వెలుగు బృందం**

### ఇవీ యక్ష ప్రశ్నలు... 4



41. ఈ జగత్తు ఏది ప్రధానంగా కలది?
42. ఒంటరిగా సంచరించేవాడు ఎవరు?
43. మరలమరలా పుట్టేదెవరు?
44. మంచుకు మందేది?
45. నిండు జలాన్ని ఏది పొందింది?
* పెద్ద విత్తనాల పాత్ర ఏది?
46. ధర్మానికి ప్రధాన ఆశ్రయం ఏది?
47. కీర్తికి ముఖ్యమైన ఆశ్రయం?
48. స్వర్గానికి ముఖ్యమైన దారి ఏది?
49. సుఖం ఏ ఆధారంతో కూడింది?
50. మనిషికి ఆత్మ ఏది?

**సమాధానాలు**

41. వాయు ప్రధానం 42. సూర్యుడు 43. చంద్రుడు 44. అగ్ని 45. భూమి * భూమి 46. సామర్థ్యం 47. దానం 48. సత్యం 49. మంచి నడవడిక 50. పుత్రుడు




# మంచి మాటలకు మంచి రోజులు

**పక్క రాష్ట్రాల వాళ్లు భాషా... భాషా... అని చచ్చిపోతుంటే.. మీరు తెలుగే చచ్చిపోవాలనుకుంటున్నారు. తెలుగంటే ముక్కీ మూలిగి ముప్పై ఐదు మార్కులు తెచ్చుకోవడం కాదురా... అది అమ్మతో మన బాధల్నీ, ఆనందాల్నీ పంచుకునే వారధి.** 'పిల్ల జమీందార్' చిత్రంలోని ఈ మాటలు తెలుగును తెగులనుకుంటున్న వారికి సూటిగా గుచ్చుకోవూ! తెలుగు చలనచిత్ర సంభాషణల శక్తే ఇంత! నాటి పింగళి నుంచి నేటి త్రివిక్రమ్ శ్రీనివాస్ వరకూ సినీ రచయితల కలాలన్నింటికీ పదునెక్కువే. మానవ భావోద్వేగాలను, ప్రతిస్పందనలను అవి ప్రభావవంతంగా అక్షరాల్లోకి మార్చేస్తాయి. ఆమధ్య కొంతకాలం పాటు మన సినిమాల్లో వంకర మాటలు వాసికెక్కినా ఇప్పుడు మళ్లీ అర్థవంతమైన అచ్చ తెలుగు పలుకులు వినిపిస్తున్నాయి. ప్రేక్షకుల్లో ఆలోచనలను రేపుతున్నాయి.

సినిమా అత్యంత బలమైన ప్రసార మాధ్యమం. ఎప్పుడో 83 ఏళ్ల క్రితం... ఓ మూగ సినిమా ప్రారంభమైనప్పుడు అది ఇంతగా అభివృద్ధి సాధిస్తుందనీ, ఇన్ని సాంకేతిక సోపానాలు అధిరోహిస్తుందనీ ఎవరూ ఊహించి ఉండరు. తెరపై బొమ్మలు కదలడం ఓ వింతైతే... అవి మాట్లాడటం మరో మాయాజాలం. హెచ్.ఎం. రెడ్డి 'భక్తప్రహ్లాద' తెలుగులో తొలి టాకీ సినిమా. బలిజేపల్లి లక్ష్మీకాంతం తొలి సినిమా మాటల రచయిత. లవకుశ, హరిశ్చంద్ర, అనసూయ, మళ్లీపెళ్లి, బాలనాగమ్మ లాంటి చిత్రాలకు మాటలు రాసి... ఈ ప్రక్రియకు ఓ పునాదిని వేసింది ఆయనే. ఆ తర్వాత తాపీ ధర్మారావు 'మాలపిల్ల'కు మాటలు నేర్పారు.

ఎవరూ పుట్టించకపోతే మాటలెలా పుడతాయి అంటూ తన పద చతురతతో పింగళి తెలుగు సినిమా మాటను కొత్తపుంతలు తొక్కించారు. డింగరీ వంటి ఊతపదాలతో పాటు... అసమదీయులు, తసమదీయులులాంటి పారాలనూ

చెప్పేశారు. కొత్త కొత్త పదాలు, సరికొత్త పాటలు, ఇంకెన్నో జాతీయాలతో మాటల కోటలు కట్టారు. ఆయన తర్వాత సముద్రాల సైతం జనసామాన్య పదాలతో అద్భుతాలు చేశారు. ఇక సదాశివబ్రహ్మం 'మాట' వరుస గురించి చెప్పేదేముంది. అప్పు చేసి పప్పుకూడు, లవకుశ చిత్రాలు చూస్తే చాలు... ఆయన పాండిత్యపు విలువ తెలుస్తుంది. ఆ తర్వాత చక్రపాణి తనదైన శైలితో సంభాషణలకు పదును చేకూర్చితే... డి.వి.నరసరాజు, ఆత్రేయ లాంటి వారు కాలంతో పాటే మాట్లాడారు.

దిగ్గజ రచయితల తరం ముగిశాక 'మార్పు' కొట్టొచ్చినట్లు కనిపించింది. రచయితలే దర్శకులుగా మారారు. దాసరి నారాయణరావు లాంటివారి రాక... సంభాషణల్లో పెద్ద విప్లవాన్నే తీసుకొచ్చింది. మాటలతో సందర్భాన్ని మార్చేయడం దాసరి ప్రత్యేకత అయితే... వాడుక మాటల్నే సినీ సంభాషణలుగా పలికించడం ముళ్లపూడి పద్ధతి. సరిగ్గా ఇదే సమయంలో జంధ్యాల... మాటలతో చక్కిలిగింతలు పెట్టారు. శంకరాభరణం లాంటి చిత్రాలను తక్కువ మాటలతో అందంగా మాలకట్టారు. ఇక పరుచూరి సోదరులైతే... మాటలతో కోటలూ కట్టారు... పేటలూ మెట్టారు. సినిమా డైలాగ్‌ను అందరి మాటగా తీర్చిదిద్దారు.

కథానాయకుల ప్రాధాన్యత పెరిగిన తర్వాత మాటలు మరో మలుపు తిరిగాయి. కథానాయకుణ్ని బట్టి మాటలు అల్లే ప్రక్రియ మొదలైంది. 'దాన వీర శూరకర్ణ'లో 'ఆచార్య దేవా ఏమంటివి... ఏమంటివి...' అంటూ కొండవీటి వారు రాసిన మాటలు లోకప్రసిద్ధం. 'ప్రేమనగర్'లో నాగేశ్వరరావు సంభాషణల్లో మరో ప్రత్యేకత ఉంటుంది. ఎస్టేట్‌లోకి ప్రవేశిస్తూ... 'ఇక్కడ నుంచే మా అధికారం ప్రారంభమౌతుంది... మా అహంకారం విజృంభిస్తుంది' అంటూ... ఆత్రేయ భూస్వామ్య వ్యవస్థ రూపాన్ని ఆవిష్కరించారు. 'అల్లూరి సీతారామరాజు' పలుకులు మన గుండెల్ని ఉప్పొంగిస్తాయి. 'సకల శాస్త్రాలూ పుట్టిన ఈ వేదభూమికి మీరు నాగరికత నేర్పారా... నా జాతి ప్రజలంతా కలిసి ఒక్కసారి ఉమ్మేస్తే... అందులో మీరంతా కొట్టుకుపోతారు...' వంటి దేశభక్తి, ఆత్మవిశ్వాసం కలగలిసిన మాటలు త్రిపురనేని మహారథి కలం నుంచి జాలువారాయి. ఇదే సమయంలో ముళ్లపూడి వారి మాటలు మరో రకంగా పేలాయి. 'సెగట్రీ... ఆకాశంలో ఏదో మర్డర్ జరిగినట్టు లేదూ. సూర్యుడు నెత్తురు గడ్డలా లేడూ..', 'మడిసన్నాక కాసింత కళాపోసన ఉండాలయ్యా. ఊరికే తిని తొంగుంటే మడిసికీ గొడ్డుకీ తేడా ఏముంటాది...' వీటిని మర్చిపోగలమా!

వర్తమానంలో మాటల తీరు బొత్తిగా మారిపోయింది. ముఖ్యంగా యాక్షన్, ఫ్యాక్షన్ సినిమాల పుణ్యమా అని... ఊరొచ్చాను, పీకలు కోస్తాను వంటివి డైలాగులు అయిపోయాయి. ఆ వరుసలో తెలుగు ఆంగ్లం సంకరమై పుట్టిన మాటలు సైతం ప్రేక్షకులు మెచ్చిన భాషగా చలామణి అవుతున్నాయి.

అయితే, భూమి గుండ్రంగా ఉంటుందన్న విషయం ఎంత వాస్తవమో.. చరిత్ర పునరావృతం అవుతుందన్న మాట అంతే నిజం. ఈ మధ్య కాలంలో కొన్ని సినిమాల్లోని మాటలు చూస్తుంటే... నాటి సినీ మాటల స్వర్ణయుగం తిరిగొచ్చిందా అనిపిస్తోంది. పిల్లజమీందార్, ఓనమాలు, కృష్ణం వందే జగద్గురుం, దేవస్థానం, మిథునం లాంటి చిత్రాలు ఇందుకు చక్కని ఉదాహరణలు.

ఎంతో కాలంగా పరిశ్రమలోనే ఉన్న బుర్రా సాయిమాధవ్ 'కృష్ణం వందే జగద్గురుం'తో తన ప్రతిభను చాటిచెప్పారు. 'బువ్వ లేకపోతే మట్టినడిగితే పెట్టుద్ది. మరి మట్టే లేకపోతే... దోచుకుపోతున్నారు..' అంటూ గనుల దోపిడీపై అక్షర శరాలు సంధించారు. 'న్యాయం కంటే అన్యాయం ఓ అక్షరం పెచ్చుగదా.. అదే గెలుస్తుంది' అని చెబుతూ వ్యవస్థపై కసి పెంచుకున్న వ్యక్తి అంతరంగాన్ని వెల్లబికించారు. 'పశువులూ పక్షులూ ఏదోచోట బతికేస్తాయ్ బాబు. కానీ మనం మనుషులం. మనమే కాదు... మనముండే చోటూ బతకాలా.. మన తోటోడూ బతకాలా'... మనిషన్న వాడు ఎలా బతకాలో ఇంతకు మించి ఎవరైనా ఏం చెప్పగలరు! అతని మాటల్లో ఎక్కడా ఆంగ్ల పదాలు లేవు. బూతులు అంతకంటే లేవు. కానీ ఈ డైలాగులన్నీ బాగా పేలినవే.

'ఓనమాలు'కు మాటలనందించిన ఖదీర్‌బాబులోనూ ఇదే ప్రత్యేకత కనిపిస్తుంది. ప్రతి మాటా మనసు లోతుల్లో గుచ్చుకుంటుంది. 'అసలు మనిషి కూడా ఒక పశువేనయ్యా. కాకపోతే జ్ఞానం నేర్చుకుని మనిషయ్యాడు. మానవత్వం మర్చిపోయి పశువౌతున్నాడు..' అనడంలో ఎంత తాత్వికత ఉంది! 'మతం అంటేనే మంచి. అది దేవుడి చేతిలో బెత్తం...' అంటూ మతాన్ని నిర్వచించాడు. అమ్మభాషను మరచిపోతున్న వాళ్లని గురించి చెబుతూ.. 'పరాయిభాషకి కిరీటం పెట్టడానికి... మాతృభాష శిరస్సు ఖండించడం ఎంత పొరపాట'ని ఆవేదన వ్యక్తం చేస్తారు. 'పిల్లలు ఏదడిగితే అదివ్వడం కాదమ్మా... వాళ్ల అవసరాన్ని గుర్తించి ఏది కావాలో అదివ్వాలి' అంటూ బిడ్డల్ని అతిగారాబం చేసే వాళ్లని సున్నితంగా మందలించారు. అంతేనా... పల్లె తల్లి గొప్పతనాన్ని గురించి చెబుతూ... 'పాలు ప్యాకెట్ల నుంచి వస్తాయని, బియ్యం బస్తాల్లో పండుతాయనీ, కూరగాయలు ఫ్యాక్టరీల్లో తయారవుతాయని నమ్మే హైటెక్ పిల్లలకి మన దేశపు మట్టివాసన గురించి, రాలే కన్నీటి బొట్టు విలువ గురించీ తెలియాలంటే... అది పల్లెటూళ్ల నుంచే నేర్పించాలం'టారు. పాఠాల పేరుతో పిల్లల పసితనాన్ని చిదిమేసే కర్కశత్వంపై కలంతో దండెత్తిన ఖదీర్... 'నెమలి పిల్లలు జూలో బతికినట్టే' అంటూ చక్కని పోలిక పెట్టారు. ఈ మాటల్లోనూ ఎక్కడా అసహజ పదాలు దొర్లలేదు. చక్కగా మనం రోజూ మాట్లాడు కునే పదాలే. మనసును హత్తుకునే మాటలే.

వీటికంటే ముందు 'పిల్లజమీందార్' అనే చిత్రం వచ్చింది. అందులో జి.చంద్రశేఖర్ రాసిన మాటలు ప్రతి మనసునీ కదిలించాయి. యువతను దృష్టిలో పెట్టుకుని తీసిన సినిమాలో... అందునా అల్లరిని చూపే సందర్భాల్లోనూ... నవ్వులు పండించే సన్నివేశాల్లోనూ... అచ్చతెలుగుతోనే మాటలు అల్లారు. 'గెలుపుదేముందిరా... మహా అయితే ప్రపంచానికి నిన్ను పరిచయం చేస్తుంది. ఒక్కసారి ఓడిపోయి చూడు... ప్రపంచం అంటే ఏమిటో

పరిచయమౌతుంది'... ఈ మాటలో లోతుని వెతుక్కుంటూ వెళితే... చీకటి వెలుగుల జీవితపు దూర తీరాలను చూసి రావచ్చు. 'కాలేజీలో గడిపిన జీవితం... కాలం విలువేంటో నేర్పింది. ఇక్కడ గడిపిన కాలం జీవితం ఎంత గొప్పదో చెప్పింది'... కళాశాల జీవితాన్ని ఇంత గొప్పగా ఆవిష్కరించిన మాటలు ఈ మధ్యకాలంలో రాలేదు. 'సైన్స్ కావాలంటే... ఇంటర్నెట్‌లోనూ దొరుకుతుంది. సంస్కారం కావాలంటే మీలాంటి వాళ్ల దగ్గరే దొరుకుతుంది' అంటూ తెలుగు ఉపాధ్యాయుల ఔన్నత్యాన్ని చక్కటి మాటల్లో చెప్పారు. ఈ సినిమా మొత్తం హాస్యభరితంగానే సాగుతుంది. ఎక్కడా పెడార్థాలు వినిపించవు. బూతులు మాత్రమే నవ్విస్తాయని నమ్మే వారికి పిల్లజమీందార్ మాటలు... చెంపపెట్టు.

అప్పట్లో పెద్ద పెద్ద డైలాగులు ప్రేక్షకుల్ని ఆకట్టుకుంటే... ఇప్పుడు కట్టె, కొట్టె, తెచ్చే లాంటి చిన్న సంభాషణలు జనాల్లోకి దూసుకుపోతున్నాయి. ఇలాంటి మాటలకు ఆదరణ కల్పించిన ఘనత రచయిత, దర్శకుడు త్రివిక్రమ్ శ్రీనివాస్‌దే. 'నాకిక్కడ ఏదనిపిస్తే అది మాట్లాడతా... నాకిక్కడ ఏదనిపిస్తే అది చేస్తా'నంటూ ప్రారంభించి ప్రేక్షకుల పైకి ఎన్నో మాటల తూటాలను సంధించారు. 'లాజిక్‌లు ఎవరూ నమ్మరు... అందరికీ మేజిక్‌లే కావాలి. అందుకే మనకు సైంటిస్ట్‌ల కంటే... బాబాలే ఫేమస్'... 'మనం ఇష్టంగా అనుకునేది అదృష్టం. బలంగా కోరుకునేది భవిష్యత్తు'... 'భయపడ్డంలోనే పడటం ఉంది. మనం పడొద్దు. ఆశతో ఉన్నవాడు క్యాన్సర్‌ను జయిస్తాడు. ఆశ లేని వాడు అల్సర్‌కే భయపడతాడు'... ఇలాంటి సంభాషణలను త్రివిక్రమ్ తప్ప ఎవరు రాయగలరు? అందుకే ఆయన ఉత్తమ మాటల రచయితగా అయిదుసార్లు నంది బహుమతులు గెలుచుకున్నారు.

ఈ మధ్యకాలంలో వచ్చిన 'దేవస్థానం', 'మిథునం' వంటి చిత్రాలు మంచి మాటలకు చక్కని నిదర్శనాలుగా నిలిచాయి. ఈ రెండూ పుస్తక రచనల ఆధారంగా తెరకెక్కినవి. రచయితలు దర్శకులుగా మారి రూపొందించినవి. అందుకే ఈ సినిమాల్లోని మాటల్లో అన్ని సాహితీ విలువలు. సునీల్ కుమార్ రెడ్డి తొలి సినిమా 'సొంత ఊరు'కు ఎల్బీ శ్రీరాం సంభాషణలు అందించారు. 'ఊళ్ల కోసం రోడ్లు గానీ, రోడ్ల కోసం ఊళ్లు కాదు...' లాంటి మాటలు జనంలోకి వెళ్లడమే కాదు... నంది పురస్కారాన్నీ సంపాదించి పెట్టాయి. ఆ తర్వాత వచ్చిన 'గంగపుత్రులు' మంచి మాటలతోనే విజయ తీరాలకు చేరుకుంది. 'ఎందుకమ్మా మమ్మల్ని చూసి జాలిపడతారు. మీ బతుకులు మీకు గొప్పైతే... మా బతుకులు మాకు గొప్ప. మీ కళ్లతో చూసి అనవసరంగా మా బతుకులు చిన్నవి చెయ్యమాక. మా బతుకులు మాకొగ్గెయ్యండి. ఒకప్పుడు మా తాత, అయ్య బానే బతికినారు. మీలాంటోళ్లు మా బతుకులు బాగు చేయాలన్నాకే... మొదలయ్యాయి ఈ కట్టాలు. కరెంటు ఫ్యాక్టరీలు పెట్టి మా బతుకుల్ని సీకటి చేసింది సాలమ్మా' ఇలాంటి మనసును హత్తుకునే మాటలెన్నో సునీల్‌కుమార్ రెడ్డి ఆ చిత్రంలో వినిపిస్తారు.

చెప్పుకుంటూ వెళ్తే ఎన్నో చిత్రాలు, ఇంకెన్నో మాటలు... ఈ తరం ప్రేక్షకుల నాణ్యమైన అభిరుచికి, పరిశ్రమలోకి పోటెత్తుతున్న కొత్త ప్రతిభకు నిదర్శనాలుగా నిలుస్తున్నాయి. తెలుగు సినిమాల్లో తెలుగు చచ్చిపోతోందని బాధ పడాల్సిన అవసరం లేదు. మాతృభాషపై మమకారం ఉన్న రచయితలు ఇలాంటి మరికొన్ని మాటలు రాస్తే చాలు. ఆయా చిత్రాల రూపంలో తెలుగు సజీవమవుతుంది.

కాలంతో పాటే భాష దిశ, దశలు మార్చుకుంటుందే తప్ప... భావాలు, భావనల్లో పెద్దగా మార్పు రాలేదు. ఎందుకంటే మనిషి... మనిషిగా బతకడానికే విలువనిస్తున్నాడు. ఫలితంగా ఆ తరహా సినిమాలకే కాదు... సంభాషణలకు సైతం వన్నె వస్తోంది. మార్పు అనేది సునామీ కాదు... అమాంతం వచ్చి మీద పడిపోవడానికి. అదో విప్లవం. 'చినుకు... చినుకు కలిసి చిత్ర కావేరి... చివరికా కావేరి కడలి దేవేరి' అన్న వేటూరి పలుకుల్లా... మాటల చినుకులు చలనచిత్ర మహాసముద్రంలో కలిసిపోవాల్సిందే. జన హృదయాల్లో అనంత భావాలై నృత్యం చేయాల్సిందే.




**పరవస్తు నాగసాయి సూరి**
హైదరాబాదు. 99494 97202


### ఇవీ యక్ష ప్రశ్నలు... 5



51. దైవం ఏర్పరిచే స్నేహితురాలు?
52. మానవునికి జీవనమేది?
53. ఇతనికి ముఖ్యంగా కోరదగినది?
54. గొప్పతనాల్లో ఉత్తమ గొప్పతనం ఏది?
55. ధనాల్లో ఉత్తమ ధనమేది?
56. లాభాల్లో ఉత్తమ లాభమేది?
57. సుఖాల్లో ఉత్తమ సుఖమేది?
58. ఏది ఉత్తమ ధర్మం?
59. ఎల్లప్పుడూ ఫలించే ధర్మమేది?
60. జనులు దేన్ని నిగ్రహిస్తే దుఃఖం పొందరు?

**సమాధానాలు**

51. భార్య 52. మేఘం 53. దానం 54. నేర్పరితనం 55. పెద్దల వల్ల వినికిడి 56. ఆరోగ్యం 57. తృప్తి 58. అహింస 59. వేదోక్త ధర్మం 60. మనసు

**ప్రేయసి:** మనం ఇప్పుడెలా ఉంటున్నామో అన్యోన్యంగా, సంతోషంగా పెళ్లయ్యాక్కూడా సెల్‌ఫోన్, సిమ్‌కార్డులా కలిసిమెలిసి ఉండాలి డియర్...

ప్రేయసి మాటలు విన్న ప్రియుడు రాకేష్ ఎగిరి గంతేశాడు.

**ప్రేయసి:** మధ్యలో ఏమైనా పిచ్చిపిచ్చి వేషాలేశావంటే సిమ్‌కార్డు మార్చేస్తా జాగ్రత్త!?



# సమస్యా వినోదం

## సమస్య: విద్య ఉన్నవాడు వింత పశువు

రచయితలకు నిబంధనలు

- పూరణం తేట తెలుగులో, సరళమైన భాషలో సామాన్యులు సైతం రసానుభూతి పొందేలా ఉండాలి.
- ఒక రచయిత ఒక పద్యం మాత్రమే పంపాలి.
- ఈ పద్యం ఎక్కడా ప్రచురితం, ప్రసారం కాలేదని హామీపత్రం జతచేయాలి.
- ఫొటో, ఫోన్‌నెంబరు, పూర్తి చిరునామా తప్పనిసరి.
- ఏ నెలలో ఇచ్చిన సమస్య ఆ నెలలోనే పూరించి పంపాలి.
- మీ పూరణం చేరేందుకు గడువు: ప్రతినెలా 10వ తేదీ.
- ఎంపికలో తుది నిర్ణయం సంపాదకవర్గానిదే. ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.
- వచ్చిన పూరణాల్లో అత్యుత్తమమైన అయిదింటిని ఎంపిక చేసి ప్రచురిస్తాం.
- ప్రచురితమైన ఒక్కో పూరణానికి రూ. 100 బహుమతీ ఉంటుంది.

అక్టోబరులో నెలలో ఇచ్చిన
**చెల్లని చెక్కులే; ప్రగతి చేర్చును మిక్కిలి వైభవమ్ముతోన్** సమస్యకు వచ్చిన పూరణాల్లో
మేలైన ఐదు పద్యాలు.

ఉల్లము క్రూరమైన మహితోత్తములౌగతి సంచరించుచున్
పిల్లన గ్రోవి రావమన ప్రీతిని నేతల పల్కులెంచగన్
చెల్లని చెక్కులే; ప్రగతి చేర్చును మిక్కిలి వైభవమ్ముతోన్
ఎల్లర సౌఖ్యరాశి మరి నెంచు మహాత్ములు చేయు కర్మముల్!

**- టి.సురేశ్‌బాబు,** డోను, కర్నూలు

అల్లదె స్వర్గసీమ! కను, డా దివి మీకయి త్రుంచి తెత్తు! మీ
రెల్లరు వోటు నాకొసగి యెన్నిక చేసిన' నంచు దుర్జనుల్
చల్లగ చెప్పు మాటలవి చాల రుచించిన, నమ్మవచ్చునే?
చెల్లని చెక్కు లేప్రగతి చేర్చును? మిక్కిలి వైభవమ్ముతోన్

**- ఎం.హనుమంతరావు,** హైదరాబాద్

ప్రల్లదనాలతో మిగుల యప్పులు సేసియు, తీర్చలేకయున్
యుల్లములేక యేమొసగి యేగును జైలుకు? జాతికీ కృషిన్
మొల్లము రైతులున్? దశమి డోలిక లూగును యంబ దేనితోన్
చెల్లని చెక్కులే - ప్రగతి చేర్చును - మిక్కిలి వైభవమ్ముతోన్

**- ఆవుల శ్రీనివాసులు,** ప్రొద్దుటూరు, కడప

ఎల్లలు దాటి విశ్వమున నెంతయు కీర్తిని గాంచు భారతిన్
మెల్లగ నాక్రమించె నవ మాన భరంబగు వక్రమార్గముల్
నల్లధనంబుపై గొనుచు నాణ్యమెరుంగని పాలనమ్ములో
చెల్లని చెక్కులే ప్రగతి చేర్చును మిక్కిలి వైభవమ్ముతోన్

**- కె.కామేశ్వరి,** విశాఖపట్నం

చిల్లులువోవ మీ చెవులు చెప్పెద నమ్ముడు నాదుమాట వే
దోల్లసితంబ! అమ్మపయి ఒట్టు! తిరస్కృతి ముద్రపడ్డ ఓ
ట్లెల్లను లెక్కకున్ కొసరుకేనియు చెల్లకయుండుగాక! ఈ
చెల్లని చెక్కులే ప్రగతి జేర్చును మిక్కిలి వైభవమ్ముగన్

**- ఎర్రాప్రగడ రామమూర్తి,** ఖమ్మం

---

## తెలివికి తెలుగు

ఆంగ్లం మాత్రమే నేర్చుకోండి... ఆంగ్లంలో మాత్రమే మాట్లాడండి... అంటూ మీ పిల్లలకు ఆంక్షలు పెడుతున్నారా? అయితే వారి తెలివితేటలను చేతులారా మీరే చిదిమేస్తున్నట్లే. వారి ఆలోచన, జ్ఞాపకశక్తులకు గండికొడుతున్నారన్న మాటే! ఇది తెలుగును నిర్లక్ష్యం చేస్తున్నారన్న భావనతో చెబుతున్న మాట కాదు. ఒక భాష కంటే రెండు భాషలను నేర్చుకునే, మాట్లాడే పిల్లలే చురుకైన వారవుతారని శాస్త్రవేత్తలు నిరూపించారు. వేర్వేరు భాషలు నేర్చుకునే పిల్లల పెద్దమెదడు పైపొర (కార్టెక్స్)లోని నాడీకణాలు వృద్ధి చెందుతాయట. తెలివి, గ్రహణశక్తి, జ్ఞాపకశక్తి, కొత్త విషయాలను నేర్చుకోవడం, తార్కికత తదితరాలకు మూలం ఈ మెదడు పైపొరలోని నాడీకణాలే. చిన్నప్పుడు ఒక భాషను నేర్చుకుని, కొంత వయసు వచ్చాక మరో భాషను అభ్యసించే




వారిలో ఈ నాడీకణాలు బాగా అభివృద్ధి చెందుతాయి. ఫలితంగా వారి మేధోశక్తి పెరుగుతుంది. రెండు భాషలు మాట్లాడే పిల్లలు, ఒకే భాష మాట్లాడగలిగే చిన్నారులకు ఎంఆర్ఐ స్కానింగ్ తీసి ఈ విషయాన్ని కనిపెట్టారు కెనడాలోని మెగిల్ విశ్వవిద్యాలయ పరిశోధకులు కాబట్టి తల్లిదండ్రులూ.... మీ చిన్నారి బంగారాలకు ముందు తెలుగు నేర్పించండి. తర్వాత ఆంగ్లమే కాదు, మీకిష్టమైన ఏ ఇతర భాషనైనా పరిచయం చేయండి. అప్పుడే మీ కలల సౌధాల పునాదులు దృఢంగా నిలబడతాయి.

**- తెలుగు వెలుగు బృందం**

# బుర్రుపిట్ట బుర్రుపిట్ట తుర్రుమన్నది

వేసవి కాలమంటే పిల్లలకు సెలవులతోపాటు రెక్కలూ వస్తాయి. పిల్లలు ఊళ్లకు, పెద్దలు బాల్యంలోకి ప్రయాణం మొదలుపెడతారు. ఈసారి మా తోడల్లుడు పిలిచాడని మహదేవ్‌పూర్‌కు బయల్దేరాం. ఇద్దరు పిల్లలు, తనూ, నేనూ బైక్ మీదంటే కష్టమే అయినా... అడవి అందాలని ఆస్వాదిస్తూ వెళ్లొచ్చని బైక్ మీదే ప్రయాణమయ్యాం. మా తోడల్లుడు సాంఘిక సంక్షేమాధికారిగా మహదేవ్‌పూర్‌లో ఒక భవనం అద్దెకు తీసుకొని ఉంటున్నాడు.



అది పెద్దపల్లెలాంటి చిన్న ఊరు. వ్యవసాయం, చేతివృత్తులు లాంటి పనులు చేసుకుని బతికే కష్టజీవులే అంతా. వారి చెమటతో తడిసిందా అన్నట్లుండే ఒక రకమైన ఆత్మీయ పరిమళం ఆ మట్టిలోంచి వస్తుంది. దుబ్బనేలల నుంచి ఉదయం, సాయంత్రం పశువులు రేపే గోధూళి ఎర్రని మేఘాలై ఆకాశంలోకి లేచిపడేది. ఎటుచూసినా చుట్టూ దడి నాటి ఉన్న పూరిగుడిసెలే. గుడిసెలపైకి పాకిన బీర, ఆనప, చిక్కుడు తీగలు గుండెపైన ఉండే రక్తనాళాలను తలపిస్తాయి. పశుసంపదకు కొదవే లేదు. ఎండాకాలమనేమో పశువులు కాస్త బక్కచిక్కి కనిపిస్తున్నాయి. గేదెలకు పిల్లిపిండి, తౌడు తినిపించి పాలు పితుకుతుంటారు. అప్పుడే పితికిన పాలు నురగలు తేలి కమ్మని వాసన వేసేవి.

సాయంత్రమైతే చాలు ఆరుబయట నీళ్లు చల్లి ఉంచేవారు. తడిసిన నేల మీద నులక మంచాలేసుకుని పడుకుంటారు. నేను కూడా మంచంపై వెల్లికిలా పడుకొని నల్లని ఆకాశంలో మిణుకు మిణుకుమంటున్న చుక్కల్ని చూస్తున్నాను. చిన్నప్పటి జ్ఞాపకాలేవో బాల్యమిత్రుల్లా పలకరిస్తున్నాయి. పచ్చటి బయళ్ల మీది నుంచి అలలు అలలుగా ప్రవహిస్తూ వచ్చిన చల్లని గాలి మెల్లగా జోల పాడుతోంది. హాయిగా నిద్దట్లోకి జారుకున్నాను.

'కాళేశ్వరం వెళ్లాలి లేవండ్లేవండి' అనే మా ఆవిడ పిలుపుకి తొలికోడి కూత నేపథ్య సంగీతంలా వినిపించి పొద్దునే ఓ పల్లెటూరి మధుర భావన కలిగింది. కళ్లు తెరవగానే గుంపులుగా వచ్చి వాలిన పిచ్చుకలు కిచకిచ శబ్దాలు చేస్తున్న దృశ్యం కనిపించింది. లేచి కూర్చోగానే తూర్పున ఉదయించి మెల్లమెల్లగా ఆకాశంలోకి ఎగబాకుతున్న ఉదయభానుడి దర్శనమయ్యింది.

పల్లె అందాలు ప్రతిఒక్కటి కంటి కెమెరాతో క్లిక్ చేసి గుండె హార్డ్‌డిస్క్‌లో పదిలపర్చుకుంటున్నా. చిన్నిచిన్ని గడ్డిపూలు తలలూపుతూ పచ్చని పసిరిక వాసనేదో కమ్మగా వెదజల్లుతున్నాయి. మా పక్కింటి తెల్ల ఆవు 'అంబా' అని ఆప్యాయంగా పిలిచింది. తల్లి పిలుపు విన్న లేగదూడ 'అంబా' అంటూ చెంగులేస్తూ వచ్చింది. ఆవు ప్రేమగా లేగ శరీరాన్ని నాకుతోంది. లేగ చటుక్కున తల్లి పొదుగులో ముఖాన్ని దూర్చి ఆత్రుతగా పాలు తాగుతోంది. తల్లి పరవశించిపోతున్న ఆ మనోహర దృశ్యాన్ని చూసేందుకు నాకు రెండు కళ్లూ చాలడం లేదు. ఆ పనీ ఈ పనీ చేసుకుంటూ నా మీద ఓ కన్నేసి ఉంచిన మా ఆవిడ 'ఏమండోయ్! తొందరగా సిద్ధం కండి' అంటూ ప్రేమగా కసిరింది. ఎంత దగ్గరి వాళ్లింటికెళ్లినా, దూరపు బంధువుల ఇంటికెళ్లినా ఈ ఆడవాళ్లు వంటపనుల్లో ఎవరూ అడక్కుండానే భలే పరకాయ ప్రవేశం చేస్తారు. కప్పు వేడివేడి టీ తాగి కాలకృత్యాలు ముగించాను. చుట్టూ కందిపొరక నాటిన స్నానాల గదిలో నీరెండలో చన్నీటి స్నానం శరీరానికే కాదు మనసుకూ ఎంతో హాయినిచ్చింది.

బైక్‌ల మీద ప్రయాణం ప్రారంభమైంది. ఆకుపచ్చని అడవిని చీల్చుకుంటూ నల్లని తార్రోడ్డు. చెట్ల సందుల గుండా సూర్యకిరణాలు ముక్కలైన అద్దంలా వచ్చి పడుతున్నాయి. రెండు చిన్న కుందేళ్లు మా ముందు నుంచి పరుగెత్తి పొదల్లోకి దూరి అదృశ్యమయ్యాయి. మా ఆవిడ ఆశ్చర్యానందాలతో పులకించిపోయింది. కొద్దిదూరం వెళ్లామో లేదో జింకల గుంపు... 'ఎన్ని జింకలో' అంటూ ఆనందంతో అరిచింది మా ఆవిడ. బైక్‌ని ఆపి చూశాం. దాదాపు ఇరవై వరకూ జింకలు మిలమిలలాడే కళ్లతో మమ్మల్ని చూసి బెదిరిపోయి గంతులేస్తూ అడవిలోకి పారిపోయాయి. పట్నవాసపు కృత్రిమ

జీవితాల్లోంచి వచ్చిన మాకు ఇదొక
అనూహ్యానుభూతి. ప్రయాణం సాగుతోంది.
చాలా దూరం వరకూ ఊర్లేమీ
కనిపించలేదు. ఒక ఆర్టీసీ బస్సు మాత్రం
కనిపించింది. వరుసగా కచ్చరాలు
(ఎడ్లబండ్లు) వెళ్తున్నాయి. వాటన్నిటినీ
దాటేస్తూ... కాలాన్ని కరిగిస్తూ
పొద్దెక్కేలోపు కాళేశ్వరం చేరుకున్నాం.
దేవాలయం దగ్గర్లో వాహనాలను
నిలిపేశాం. పక్కనే గోదావరి నది గలగలా
పారుతోంది. నీళ్లని చూస్తే ఎందుకో
పిల్లలకు పట్టరాని సంతోషం. నది ఒడ్డునే
కాళేశ్వరాలయం. అద్భుతంగా
శోభాయమానంగా భాసిల్లుతోంది. స్నానాలు
చేసొద్దామని నదిలోకెళ్లాం. ఇసుకలో కాళ్లు
దిగబడుతున్నాయి. నదీ ప్రవాహం
తక్కువగానే ఉంది. నీళ్ల మీద కిరణాలు
పడి ప్రతిఫలిస్తూ వెలుగులను
విరజిమ్ముతున్నాయి. వెచ్చని ఎండ, చల్లని
నీటిలో సరిగంగ స్నానాలు చేశాం. పిల్లలు
ఆనందంతో ఉబ్బితబ్బిబ్బయ్యారు.
పారుతున్న నీటిలో చిన్నచిన్న చేప పిల్లల్ని
పట్టుకోబోయి బోర్లాపడిపోతున్నారు. వాళ్లను
పట్టుకుని స్నానాలు చేయించి బట్టలు
మార్చి దేవాలయానికి బయల్దేరాం.
ఇసుకలో రంగురంగుల రాళ్లు, నత్తగుల్లలు
తెచ్చుకున్నాం. దక్షిణ కాశీగా ప్రసిద్ధమైన
కాళేశ్వరాలయంలో అభిషేకాలు
చేయించుకున్నాం. ఒక భోజనశాలలో తిని
తిరుగు ప్రయాణం ప్రారంభించాం. ఎండ
ఎక్కువగా ఉంది. దాదాపు అరగంట
ప్రయాణం జోరుగా సాగింది. ఒక
ఊరొచ్చింది. కాసేపు సేదతీరి మంచినీళ్లు
తాగి మళ్లీ పయనమయ్యాం. కొద్దిదూరం
వెళ్లేసరికి రోడ్డు మీద ఒక పిచ్చుక
పడిపోయి విలవిల్లాడుతూ కన్పించింది.
బండిని ఆపి దగ్గరగా వెళ్లేసరికి పిచ్చుక
ఇంకా భయపడిపోయింది. జాగ్రత్తగా
చేతుల్లోకి తీసుకుని పక్కకొచ్చి కొన్ని నీళ్లను
పిచ్చుకపైన చిలకరించి, కొన్ని తాగించాను.
పిచ్చుకను మా ఆవిడ చంటిపాపలా
జాగ్రత్తగా పట్టుకుని కూర్చుంది.
మహదేవ్‌పూర్ చేరేసరికి సాయంత్రమైంది.
మళ్లీ పిచ్చుకకు చల్లటి నీళ్లు తాగించాం.
ఇంకాచురుగ్గా కదల్లేకపోతుంది. స్నానం

**అనుభూతి**

చేసొచ్చి పిచ్చుకను చేతుల్లోకి తీసుకుని
కూర్చుండిపోయాను. కొద్దిసేపటికి తలతిప్పి
అటూఇటూ చూడటం మొదలుపెట్టింది.
జాగ్రత్తగా మందార చెట్టు నీడలో దాన్ని
వదిలేశాను. దగ్గరలో ఒక గిన్నెలో నీళ్లు
పెట్టాను. మా అందరికీ ఆ కాసేపట్లో
పిచ్చుక అపురూపమైంది. మెల్లగా ఎగిరి
గిన్నె అంచు మీద కూర్చుని నీళ్లు తాగుతూ
నాకేసి చూస్తోంది. అందరూ నిద్దట్లోకి
జారుకున్నారు. నేను మాత్రం ఆ చిన్ని
పిచ్చుకను చూస్తూ కూర్చుండిపోయాను.
దానికీ నాకూ స్నేహం కుదిరిన భావన.
అప్పుడప్పుడూ నాకేసి చూస్తోంది. ఏమైనా
చెప్పాలనుకుంటుందా... ధన్యవాదాలా...
మరింకేమన్నానా...? బుజ్జిది. పాపం
మాటలు రావు గదా. మనసులో ఒక
అవ్యక్తానందం. ఆకాశం భళ్లున తెల్లారింది.

ఓహో..! పిచ్చుక మెల్లమెల్లగా
ఎగుర్తోంది. గోధుమ రంగుపైన నల్లగా,
తెల్లగా చారలు చాలా అందంగా
కన్పిస్తున్నాయి. నా వైపు తిరిగి తన
అందమైన కళ్లతో నవ్వుతున్నట్లుగా
అన్పించింది. పరిసరాలను మరచి దాన్నే
చూస్తున్నాను. ఒకసారి రెక్కల్ని
విదిలించింది. అంతే తుర్రుమని
ఎగిరిపోయింది. ఆకాశం మబ్బులు పట్టి
వాతావరణం చల్లగా ఉంది. పిచ్చుక
కన్పించినంత మేర చూస్తూ 'బుర్రు పిట్ట...
బుర్రు పిట్ట తుర్రుమన్నది... పడమటింటి
కాపురం చేయనన్నది' చిన్నప్పుడు చదివింది
గుర్తొచ్చి నవ్వుకున్నాను. కాసేపట్లోనే తనతో
ఏర్పడ్డ అనుబంధానికి సంతోషమేసి
'పిచ్చుకమ్మా మీ వాళ్లను చేరుకున్నావా...
ఎండలో తిరగకేం!' అనుకున్నా. ప్రకృతిని
ప్రేమించడం వస్తే అందరినీ ప్రేమగానే
చూడగలమేమో అన్పించింది. ఈ
ప్రయాణంలో ఏరుకున్న చిన్నచిన్న
అనుభూతుల్నీ, ఆనందాల్నీ మాలగా
అల్లుకుంటూ ఉండిపోయాను.



**ఎస్. సంపత్‌కుమార్**
కరీంనగర్, 93464 35123



## ఎవడు వీడు

కచ్చితంగా వీడో రాజాధిరాజు!
అడగకుండానే సర్వం సమకూరాలి!!
నటనా సార్వభౌమునికీ వశంకాని
నవరసాలొలుకుతాడు!
గాన గంధర్వునికీ చేతకాని
బాణీలు పలుకుతాడు!
వీడు మహా జాదూగర్!
కొమ్ములు తిరిగిన తాతల్నీ
పసివాళ్లని చేసి ఆడిస్తాడు!
చిరునవ్వుతోనే చిత్తు చేస్తాడు!!
అడుగడుగుకీ రక్షణకోటలు
కట్టుకున్న చక్రవర్తి!
ఆహ్లాదమౌ అల్లరితో
రోజుకో తాజమహలు కట్టే
మొగలు రాజు!
అలవోకగా...
నవ్వుల్లో ముంచి తేల్చే
ఆస్థాన విదూషకుడు!
చేయి చాస్తే
లేదనని దానకర్ణుడు!
సహనాన్ని పరీక్షచేసే
ధర్మరాజు!... ఎదురేమున్నా
బెదురులేక సాగే
వీర జవాను! చిట్టి చేతుల్తో
మట్టిపిసికే బాల కృషీవలుడు!
అడుగిడిన చోటల్లా
బృందావనాలు తీర్చే
బాలకృష్ణుడు!
అలా విని ఇలా పట్టేసే
అష్టావధాని!
ఇంటి యూనివర్సిటీలో
సకల శాస్త్రాలూ ఒంట బట్టించి
పట్టాలెన్నో పుచ్చుకున్న
చిట్టి మేధావి!!

- **భైరి ఇందిర**, ఇల్లెందు, ఖమ్మం
98491 73560

# గ్రంథాలయమే కోవెలగా... వెలగా

**తెలుగులో బాల సాహిత్యంపై తొలి పరిశోధకుడాయన... ఆ రంగంలో అయిదు దశాబ్దాల పైచిలుకు కృషి ఆయనది... డెబ్బైకి పైగా పుస్తకాల రచన, మరెన్నిటికో సంపాదకత్వం, కేంద్ర సాహిత్య అకాడమీ సభ్యత్వం, గ్రంథాలయ రంగంలో ఎనలేని కృషి ఆయన సొంతం... ఆసక్తిలో రేపటి తరంతో, ఉత్సాహంలో ఈ తరంతో పోటీపడే ఎనిమిది పదుల యువకుడాయన... ఆయనే గ్రంథాలయ గాంధీగా సాహిత్యాభిమానులు పిలుచుకునే వెలగా వెంకటప్పయ్య. ఆయనతో 'తెలుగు వెలుగు' ముఖాముఖి.**



**సాహిత్యం, గ్రంథాలయ రంగాలపై ఆసక్తి ఎలా పెంచుకున్నారు?**

ప్రముఖ రచయిత చక్రపాణి తెనాలిలోని మా ఇంటికి సమీపంలో ఉండటం, బెంగాలీ పుస్తకాలను అనువదించటం; 'చందమామ'(ఈ పత్రికలో చక్రపాణి పనిచేశారు)ను చదవటం; చలం, కొడవటిగంటి మొదలైన వారి పుస్తకాలు మా ఊరు నుంచే ప్రచురణకు నోచుకోవటం; చదువుకునే రోజుల్లో హేమాహేమీలైన గురువులూ ఉండటం ఇందుకు కారణం. ఇంటర్మీడియట్ తర్వాత గ్రంథాలయాధికారిగా ఉద్యోగంలో చేరాను. దాంతో ఎన్నో పుస్తకాలు చదివే భాగ్యం కలిగింది.

గ్రంథాలయ రంగం విషయానికొస్తే ఆంధ్ర విశ్వవిద్యాలయంలో గ్రంథాలయాధికారిగా పనిచేసిన అబ్బూరి రామకృష్ణారావు, శరణు రామస్వామి చౌదరి, అడుసుమిల్లి శ్రీనివాసరావుల ప్రభావం ప్రధాన కారణం. గ్రంథాలయ రంగంలో విశేష కృషి చేసిన అయ్యంకి వెంకటరమణయ్య ప్రభావం గణనీయమైంది. అయ్యంకి వారు వంద ఎకరాల ఆసామి. అయితే తన కృషిలో భాగంగా చివరకు ఆస్తి మొత్తం కోల్పోయి... అవసాన దశలో మందులు కొనుక్కోవడానికీ ఇబ్బంది పడ్డారు.

**ఇంటర్మీడియట్‌తో ఆపేశానంటున్నారు... పీహెచ్‌డీ చేశారు కదా?**

చదువంటే నాకు చాలా ఆసక్తి. అందుకే, ఉద్యోగం చేస్తూ ప్రైవేటుగా బీఏ పూర్తి చేశా. తర్వాత బీఎల్ఐఎస్సీ. ఆ తర్వాత ఎంఏ. యాభైఒక్క ఏళ్ల వయసులో ఆంధ్ర విశ్వకళా పరిషత్ నుంచి పీహెచ్‌డీ పట్టా అందుకున్నాను. 'తెలుగులో బాల సాహిత్యం - ఆంధ్రప్రదేశ్ బాలల గ్రంథాలయ ప్రగతి' అనే అంశంపై చేసిన ఈ పరిశోధనకు ఉత్తమ సిద్ధాంత వ్యాసంగా త్రిపురనేని గోపీచంద్ స్వర్ణపతకం లభించింది.

**మీ రచనలు?**

ప్రధానంగా గ్రంథాలయ శాస్త్రానికి సంబంధించి వివిధ విశ్వవిద్యాలయాలకు 70 పుస్తకాలు రాశాను. ప్రస్తుతం వాడుకలో ఉన్న పదాలను చేర్చి శంకర నారాయణ ఇంగ్లిష్- తెలుగు, తెలుగు- ఇంగ్లిష్ నిఘంటువులను రివైజ్ చేశాను. బ్రౌన్ నిఘంటువును కూడా రివైజ్ చేశాను. సామాన్య ప్రజల వాడుకలో ఉన్న పదాలను నిఘంటువులో చేర్చడం బ్రౌన్ చేసిన గొప్ప పని. కడపలో పనిచేస్తున్నప్పుడు వేలాది పొడుపు కథలను సేకరించాను. అలాగే బాలగేయాలు కూడా... ఇటీవలే వెలువడ్డ

తిరుమలశెట్టి శేషగిరి

తెలుగు శతక మంజరి, పొడుపు కథలు, సామెతలు, బాలల గేయాలు, జాతీయాలు అనే అయిదు పుస్తకాల 'పాత బంగారం' సంకలనానికి సంపాదకత్వం వహించాను.

**ఆ సంకలనం విశేషాలేంటి?**

ఇది ఎన్నో ఏళ్ల శ్రమ ఫలితం. దీని వెనుక 24 సంవత్సరాల ప్రయత్నం ఉంది. మొత్తం అయిదు పుస్తకాలు ఈ సంకలనంలో ఉన్నాయి. వీటిలో మొదటిది 'తెలుగు శతక మంజరి'. దీని మొదటి భాగంలో 27 శతకాలు పూర్తిగా, శతక భాగాలతో మరో 60 శతకాలను రెండో భాగంలో పొందుపరచాం. ప్రసిద్ధ శతకాలతోపాటు ఎక్కువ మందికి తెలియనివి కూడా కూర్చాం.

రెండోది పొడుపు కథలపై. వాటిపై సమగ్ర పుస్తకం ఇంతవరకు రాలేదు. పొడుపు కథలు అన్ని వయసుల వారినీ ఆలోచింపజేసే వినోద గుళికలు. విజ్ఞాన వీచికలు. సామాజిక అవగాహనకు, లోకజ్ఞాన పెంపుదలకు ఆలంబనలు. ముఖ్యంగా పిల్లల్లో చురుకుదనం, వివేచనా శక్తి పెంచే అనుభవ సారాలు. పల్లీయుల ఆచార వ్యవహారాలకు, అలవాట్లకు, సంస్కృతికి అద్దంపట్టే జీవిత సత్యాలు. ఈ పుస్తకంలో నాలుగువేల పొడుపు కథలు, పొడుపు పద్యాలు వివరణలతో ఉన్నాయి. సామెతలు, బాలల గేయాలు, జాతీయాలపై మరో మూడు పుస్తకాలు తెచ్చాం.

**ఎన్ని సామెతలను సేకరించారు?**

తెలుగు సామెతలు అనాదిగా వాడుకలో నిలిచి ఉన్నాయి. తెలుగు వాఙ్మయానికి ఇంపుసొంపును చేకూర్చాయి. వీటిలో తెలుగింటి వాతావరణం, ఆనవాయితీలు, వావి వరుసలు, వేడుకలు, సాధక బాధకాలు, ఈతిబాధలు కనిపిస్తాయి. వాడీ, వేడీ, చమత్కారం, సద్భావం ఇమిడి ఉంటాయి. సామెతల వాడకం జీవితానికి మరింత జీవాన్ని తెస్తుంది. ఈ పుస్తకం విషయానికి వస్తే ఇందులో మనం అనునిత్యం వాడే సుమారు పదిహేనువేల సామెతలను ఇచ్చాం. 1868లో కెప్టెన్ కార్ అనే విదేశీ ఉద్యోగి సేకరించి ఆంగ్లంలోకి అనువదించి ముద్రించిన సామెతలనూ చేర్చాం.

**బాలల గేయాలపై ఎన్నో పుస్తకాలు వచ్చాయి కదా. మీ పాత్రం ప్రత్యేకతేంటి?**

మనిషికి భాషా బోధన అమ్మ ఒడిలో జోలపాటతో మొదలవుతుంది. శిశువు పెరిగే కొద్దీ జోలపాట స్థాయిని దాటి పాట ఎన్నో తీర్ల సాగుతుంది. లాలిపాటలు, జోలపాటలు, పాలపాటలు, ఉగ్గుపాటలు తెలుగులో తొలి బాలగేయాలు. ఈ పుస్తకంలో లాలి, జోల పాటలతో పాటు పండుగ పాటలు, ఆటపాటలు, ఎగతాళి పాటలు, తొక్కు పలుకులు మొదలైనవి ఉన్నాయి.

---

**ఇవీ యక్ష ప్రశ్నలు... 6**



61. ఎవరితోటి సాంగత్యం చెడదు?
62. దేన్ని విడిస్తే అందరికీ ఇష్టుడవుతాడు?
63. దేన్ని విడిస్తే దుఃఖం పొందరు?
64. దేన్ని విడిస్తే ధనవంతుడవుతాడు?
65. దేన్ని విడిస్తే సుఖవంతుడవుతాడు?
66. బ్రాహ్మణునికి దానమెందుకు?
67. నట నర్తకులకు దానమెందుకు?
68. పనివారికి దానమెందుకు?
69. రాజులకు ఎందుకు ఇవ్వాలి?
70. దేనిచేత లోకం ఆవరించినది?

**సమాధానాలు**

61. సజ్జనుల తోటి 62. గర్వం 63. కోపం 64. కోరిక 65. లోభం 66. ధర్మం కోసం 67. కీర్తి కోసం 68. వారి పోషణార్థం 69. భయం చేత 70. అజ్ఞానం చేత

---

**జాతీయాలను ప్రత్యేకంగా కూర్చడంలో ఉద్దేశమేంటి?**

సామాజిక జీవనంలో వచ్చే మార్పులు జాతీయాల పుట్టుకకు మూలకారణం. ఇవి భాషకు జవజీవాలు కల్పించడమేగాక, సులభ అవగాహనకు తోడ్పడతాయి. వ్యవహార జ్ఞానాన్ని, లోకజ్ఞతను పెంపొందిస్తాయి. నిత్య వ్యవహారంలో జాతీయాలు ఎంత ఎక్కువగా వాడితే భాష అంత వినసొంపుగా ఉంటుంది. ముఖ్యంగా కలికి గాంధారి వేళ, కరణం దస్త్రం, పోలీసు గద్దలు, తాళి పెరిగిపోయింది లాంటి జాతీయాలను పుస్తకంలో వివరించాం. మన భాష రమ్యతను తెలియజేయడానికి ఈ ప్రయత్నం ఉపయోగపడుతుందన్నది మా భావన. తెలుగు దినపత్రికల్లో విరివిగా ప్రయోగంలో ఉన్న కొత్త జాతీయాలనూ ఇందులో చేర్చాం.

**'పాత బంగారా'న్ని వెలుగులోకి తేవాలన్న ఆలోచనకు మూలం?**

జాతికి శ్వాస భాష. ఏ భాషకైనా జనం నోళ్లలో నానే జాతీయాలు, పొడుపు కథలు, సామెతలు, గేయాలు ఆయువుపట్లు. ఇవి జానపదులు సృష్టించిన భాషా సంపద. ఇదే భాషకు ప్రాణం, ఆధారం. జానపదుల భాష పల్లెల్లో పుట్టి, పల్లెల్లో పెరిగి అక్కడి ప్రజల నాలుకలపై నాట్యమాడుతూ జీవం తొణికిసలాడుతూంటుంది. కడపలో గ్రంథాలయాధికారిగా పనిచేసేప్పుడు ఈ విషయం గమనించాను. కమ్మని భాష అంటే నిఘంటు పదాల కూటమి కాదు. సందర్భోచితంగా అలవోకగా, అతి సహజంగా జనుల నోట వెలువడే సామెతలు, జాతీయాలు, పదబంధాలు, జంటపదాలు, ఊతపదాలు, తిట్లు, శాపనార్థాలు, నుడికారాలు తెలుగు నేల నలుమూలలా గాలిస్తే, అలాగే ఇతర ప్రాంతాల తెలుగువారిని కలిస్తే, తెలిసే కొత్త పదాలు, నుడికారాలు అపారం, అసంఖ్యాకం, అగణితం. ఇది తెలుగు జాతికి గర్వకారణం. సాధారణ సంప్రదాయ నిఘంటువుల్లో కనిపించని జానపద సంపదలో ఒక తావున లభించేది తక్కువే. ఉన్నది కాస్తా పలు తావుల్లో సంప్రదించేందుకు వీలులేకుండా ఉండిపోయింది. ఇదే నాకు స్ఫూర్తిగా నిలిచి, నా చేత ఈ పని చేయించింది.

**సేకరణలో ఎవరైనా సహకరించారా?**

రాయలసీమ జాతీయాలను సేకరించేందుకు పుట్టపర్తి నారాయణాచార్యులు ఎంతో సహకరించారు. సామెతలు, జాతీయాల వాడకం తెలంగాణలోనూ ఎక్కువే. ఇక్కడి వాటి సేకరణకు గుడిపూడి సుబ్బారావు సాయం చేశారు. ఇది ఎంత సమగ్రమైన ప్రయత్నమైనా సేకరించాల్సినవి ఇంకా చాలా ఉన్నాయి.

**సాంకేతికత అణువణువునా పెరిగిన**






**తరుణంలో గ్రంథాలయాల ప్రాధాన్యత ఏంటి?**

ఎంత సాంకేతిక విజృంభించినా పుస్తకం జీవితాంతం తోడుగా ఉండే గొప్ప స్నేహితుడు. ఏ దేశంలోనూ చదివే అలవాటు తగ్గలేదు. అయితే మన రాష్ట్రంలోని గ్రంథాలయాల్లో మంచి పుస్తకాలు ఉండటం లేదు. ఇక అమెరికా, ఇంగ్లాండ్ లాంటి దేశాల్లో గ్రంథాలయాలకు ఉన్న ఆదరణ అంతా ఇంతా కాదు! అక్కడ ప్రభుత్వంకంటే ప్రజల నుంచి వచ్చే విరాళాలే గ్రంథాలయాల నిర్వహణకు ప్రధాన ఆధారం. ఉదాహరణకు న్యూయార్క్ గ్రంథాలయాన్నే తీసుకుంటే ప్రజలే వేల డాలర్లు విరాళాలిస్తారు. వారు గ్రంథాలయాన్ని ఉపయోగించుకుంటారు కనుక దాన్ని కాపాడాలనుకుంటారు. ఇదే భావన మన దగ్గరా రావాలి.

**రాష్ట్రంలో ప్రస్తుతం గ్రంథాలయాల పరిస్థితి?**

ఏమీ బాగాలేదు. ఒకప్పుడు ప్రజలే గ్రంథాలయాలను నడిపేవారు. ఇవాళ ప్రభుత్వం ఆధ్వర్యంలో నడుస్తున్నాయి. గ్రంథాలయాల నిర్వహణ నానాటికి తీసికట్టుగా మారింది. చట్టంలో గ్రంథాలయాలు- విద్యారంగంలో విశిష్ట సేవలందించిన వారే అధ్యక్షులుగా నియమితులవ్వాలని ఉంది. అయితే ఏ ప్రభుత్వమూ దీనిని గౌరవించిన పాపాన పోలేదు. ఇందులోనూ రాజకీయాలే ప్రధానపాత్ర పోషిస్తున్నాయి. ఒకప్పుడు గ్రంథపాలకులు సేవాభావంతో పనిచేసేవారు. ఇవాళ అలాంటి పరిస్థితి అసలే కనిపించదు. సాహిత్య అకాడమీ, నేషనల్ బుక్ ట్రస్టు ప్రచురించే పుస్తకాలు మనకు గ్రంథాలయాల్లో మచ్చుకైనా కనిపించవు. కేవలం సిబ్బందికి జీతాలు ఇవ్వడం తప్ప చాలా గ్రంథాలయాలు మరెందుకూ పనికి రాకుండా పోయాయి.

**ఇప్పుడొస్తున్న బాల సాహిత్యాన్ని పరిశీలిస్తున్నారా? అది నేటి పిల్లల అవసరాలు తీర్చే స్థాయిలో ఉంటోందా?**

ఒకప్పుడు చాలా మంచి పుస్తకాలు వచ్చేవి. ఇప్పుడు అలాంటివి రావట్లేదు. వచ్చినా ఏ ఇద్దరు ముగ్గురివో వస్తాయి. ఇప్పుడు నేను కొన్ని పుస్తకాలు ఎడిట్ చేస్తున్నాను. ప్రస్తుతం కేంద్ర సాహిత్య అకాడమీ సభ్యుడిగా బాల సాహిత్యం విషయంలో కృషి చేస్తున్నాను. సాహిత్య అకాడమీ పుస్తకాలు రాజ్యాంగం గుర్తింపు పొందిన 22 భాషల్లో వస్తాయి. అయితే నేటి బాల సాహిత్యం అంత గొప్పగా ఉండట్లేదు.

**సాహిత్యాన్ని పిల్లలకు దగ్గర చేయాలంటే...**

'చేసి చూపడం' ప్రక్రియకు ప్రాధాన్యం ఇవ్వాలి. ఆసక్తికరంగా ఉంటూ పిల్లల సృజనాత్మకతను తట్టి లేపేవిగా ఉండాలి. పిల్లలకు ప్రత్యేకంగా విజ్ఞాన సర్వస్వం రావాలి. వచ్చే పుస్తకాలు కూడా రంగుల్లో ఉండాలి. పుటలు పెద్ద పరిమాణంలో ఉంటే మంచిది. బాలభారతం పత్రికలా ఉండాలి. మంచి పుస్తకాలు, పత్రికలు ప్రతీ బడికి చేరేలా ప్రభుత్వమే చొరవ తీసుకోవాలి. ఈ విషయంలో కర్ణాటక ప్రభుత్వ కృషి ప్రశంసనీయం. కర్ణాటక ప్రభుత్వం సాహిత్య అకాడమీ పుస్తకాలను అక్కడి పాఠశాలలకు ఉచితంగా పంచింది.

**ఇంగ్లిష్ కామిక్స్ ఆకట్టుకున్నంతగా తెలుగు బాలసాహిత్యం పిల్లలను ఆకర్షించక పోవడానికి కారణం?**

తెలుగులో తెలుగు వాతావరణం ప్రతిబింబించే కాశీమజిలీ కథలు, మర్యాద రామన్న కథలు, తెనాలి రామకృష్ణుని కథలు లాంటివి పూర్తిగా బొమ్మలతో ఆకట్టుకునేలా రావాలి. అంతేతప్ప ఇంగ్లిష్ నుంచి రాబిన్‌సన్ లాంటివి అనువదించడమో, అనుకరించడమో చేయడంవల్ల లాభం లేదు.

**తెలుగు భాషను భావితరాలకు అందించాలంటే?**

వీలైనన్ని మంచి పుస్తకాలు ప్రచురణకు నోచుకోవాలి. ఇంగ్లిష్‌లో పాపులర్ ఇంగ్లిష్ పేరుతో వాడుక భాషలోని పదాలతో చిన్న చిన్న పుస్తకాలు అచ్చువేస్తారు. అలా తెలుగులోనూ వెయ్యి పదాలతో కేవలం 100- 150 పేజీలతో పుస్తకాలు రావాలి. వీటిని తక్కువ ధరకు అందించగలగాలి. ఇక ప్రముఖ పాత పుస్తకాలను పెద్ద పరిమాణంలో, వీలైనన్ని బొమ్మలతో, కంటికి శ్రమ కలగకుండా ఉండేలా కొత్తగా రూపొందించాలి. అప్పుడే పాఠకులను ఆకట్టుకోగలం. చదివే అభిలాష పెంచాలంటే మంచి పుస్తకాలను ముద్రించటమే ప్రధాన అంశం. ఇలాంటి ప్రయత్నం రామోజీ రావులాంటి వారే చేయగలరు.




**పావులూరి శ్రీనివాసరావు**
గ్రంథాలయాధికారి, గుడివాడ.
9440492235

## ఇవీ యక్ష ప్రశ్నలు... 7



71. లోకం దేనిచేత ప్రకాశించదు?
72. దేనిచేత స్నేహితులను కోల్పోతారు?
73. స్వర్గానికి దూరం చేసేది ఏమిటి?
74. చనిపోయినవాడితో ఎవరు సమానం?
75. దేశం ఎలా నశిస్తుంది?
76. శ్రాద్ధమెలా చెడినదవుతుంది?
77. యాగం ఎలా నష్టప్రాయమవుతుంది?
78. లోకానికి దిక్కు ఎవరు?
79. జలం ఏది?
80. అన్నం ఏది?

### సమాధానాలు

71. చీకటి చేత 72. లోభం వల్ల 73. ఇంద్రియ విషయాసక్తి 74. దరిద్రుడు 75. రాజు లేకపోతే 76. శ్రోత్రియుడు లేకపోతే 77. దక్షిణ ఇవ్వకుంటే 78. సజ్జనులు 79. ఆకాశం 80. భూమి

## పకపకల నవ్వు

ఆపాతమధుర గేయం



పక పక మని నవ్వు
పసిపాప ముఖం
పసిపాప ముఖంలో
నెలవంక వెలుగు
నెలవంక వెలుగులో
అమృతపు ధార
అమృతపు ధారలో
హంసా కుమారి
హంసా కుమారికి
తొలిరెక్క కానలు
తొలిరెక్క కానలలో
బంగారు పూత
బంగారు పూతలో
మెరుపు మిల మిలలు
మా పాప నవ్వులో
చిలిపి కిల కిలలు.

## చెప్పుకోండి చూద్దాం!

మేడిపండు విధము మెరుపు వెందులకోయి
నోరు మంచిదైన ఊరు మంచి
మంచి మాటలతో ప్రపంచ పౌరుడనైతి
పూల ఋతువునాది బాలలార

అరువది పిల్లలు గలయది
అరువది అరువదుల మనుమలందిన యదియున్
ఇరువది నలుగురు చెలులన్
స్థిరముగ నుండకను తాను తిరుగుచునుండున్

# నాటకానికి అడుగుజాడ కందుకూరి

**చిటికెడు అపార్థం... పిడికెడు అభిమానం... చారెడు విషాదం... దోసెడు ఆనందం... వీటన్నింటి కలబోతే జీవితం. ఆ జీవిత రంగంపై చీకటి వెలుగుల తారంగం; వెలుగు నీడల సయ్యాట నాటకం. అనేక రుచులున్న జనానికి వండి ఒకే పళ్లెంలో వడ్డించేది నాటకం. అది కన్నీళ్లను చిందిస్తుంది. నవ్వుల పువ్వులను పూయిస్తుంది. చెర్నాకోలాతో ఛెళ్లున చరుస్తుంది. మొద్దు నిద్దురను వదిలిస్తుంది. కళ్లలో ఎర్ర జీరల్నీ తెప్పిస్తుంది. గుప్పిళ్లను బిగింపజేస్తుంది. కదిలి కదిలిస్తుంది. నడిచి నడిపిస్తుంది. మంచిదారులను చూపిస్తుంది. మనిషిని మనీషిగా చేస్తుంది. మాటతో మంత్రం వేస్తుంది. కళ్లతో యజ్ఞాన్నీ చేయిస్తుంది. అలాంటి నాటకం తెలుగు నాట ఎప్పుడు పుట్టింది?**



నాటకం... అది అందమైన దృశ్యకావ్యం. కావ్యం, కథ, నవల వంటి ప్రక్రియల రాత ప్రతినో... ముద్రణనో చదువుకుంటే సరిపోతుంది. మరి నాటకానికి అది కుదరదు. పాత్రల నోటి వెంట వచ్చే మాటల్ని వినాలి. దానికి తోడుగా వచ్చే హావభావాలను కదలికలను ఏకకాలంలో చూడాలి. ఎందుకంటే ఇది ప్రదర్శన యోగ్యమైంది కాబట్టి. మరి ఇంత గొప్పదైన తెలుగు నాటకం పుట్టు పూర్వోత్తరాలు ఏమిటి. తెలుగు నాటక రంగస్థల తెర ఎప్పుడు తొలగింది. తెలుగు కావ్యం 11వ శతాబ్దంలో పుడితే తెలుగు నాటకం 19వ శతాబ్దం వరకూ రాకపోవటం గమనార్హం. ఎందరో కవులు సంస్కృత నాటకాలను కావ్యాలుగా రాశారు. ఆంగ్ల భాషా ప్రభావంతో కథ, నవల వంటి ప్రక్రియలతోపాటు తెలుగు నాటకం కూడా పురుడు పోసుకుంది. 1857లో బొంబాయి, కలకత్తా, మద్రాసు నగరాల్లో మూడు విశ్వవిద్యాలయాలు ప్రారంభమయ్యాయి. దీంతో ఆంగ్ల భాషపై సంస్కృత పండితులకు కూడా మోజు కలిగింది. ఆంగ్ల భాషలోని సారాన్ని జీర్ణించుకున్న ఉపాధ్యాయులు తెలుగులో నాటక రచన చేయడానికి ఉత్సాహం చూపారు. అటువంటి వారిలో కోరాడ రామచంద్రశాస్త్రి, కొక్కొండ వెంకటరత్నం పంతులు, పరవస్తు వేంకట రంగాచార్యులు, వావిలాల వాసుదేవ శాస్త్రి వంటి వారున్నారు. తొలి తెలుగు నాటక రచనకు కోరాడ రామచంద్రశాస్త్రితో అంకురార్పణ జరిగినట్లు, దాని పేరు 'మంజరీ మధుకరీయము' అని డాక్టర్ పి.ఎస్.ఆర్.అప్పారావు పేర్కొన్నారు. ఉత్తరరామ చరితము ఆంధ్రీకరణకు 9.11.1883న రాసిన పీఠికలో వావిలాల వాసుదేవశాస్త్రి తొలితెలుగు రూపక రచన చేసింది కోరాడ రామచంద్రశాస్త్రి అని పేర్కొన్నారు. కోరాడ ఈ నాటికను 1860 ప్రాంతంలో రచించి ఉండవచ్చునని ఘనవృత్త పీఠికలో కోరాడ రామకృష్ణయ్య రాశారు.

## తొలి వెలుగు

ఇది నాలుగు అంకాల నాటిక. మధుకరుడనే రాజ పరమేశ్వరుడు మంజరి అనే రాజకన్యకను పెళ్లి చేసుకోవడం ఇందులోని కథా సారాంశం. ఆచార్య మొదలి నాగభూషణ శర్మ 'మంజరీ మధుకరీయము' మొదటి నాటక రచన కాదని సోపపత్తికంగా త్వరలో పరిశోధన వ్యాసాన్ని వెలుగులోకి తీసుకొని రాబోతున్నట్లు చెప్పారు. ఆ పరిశోధన వివరాలు వెలుగులోకి వస్తే ఈ నిర్ధారణలో మార్పు ఉండొచ్చు. అంతవరకూ తెలుగులో తొలినాటకం 'మంజరీ మధుకరీయము' అనే భావించాలి.

1872 మహామహోపాధ్యాయ కొక్కొండ వెంకటరత్నం పంతులు 'నరకాసుర విజయ వ్యాయోగా'న్ని రచించారు. ముద్రణకు నోచుకున్న తొలి సంస్కృతాంధ్రీకరణ రూపకమిది. వారణాశి ధర్మసూరి రచించిన సంస్కృత రచనకు కొక్కొండ అనువాదం చేశారు. 1871లో మొదలుపెట్టి 1872లో దీనిని ప్రకటించారు. "ఆంధ్రమున రూపకకావ్యమిది" అని





కొక్కొండ 'నరకాసుర విజయ వ్యాయోగ' ప్రస్తావనలో సూత్రధారుని ద్వారా చెప్పించారు.

వావిలాల వాసుదేవశాస్త్రి రాసిన 'నందక రాజ్యం' నాటకం 1880లో ముద్రితమైంది. తెలుగు స్వతంత్ర రూపకాలలో నందక రాజ్యం రెండోది. తొలి తెలుగు సాంఘిక నాటకంగా, ముద్రణకు నోచుకున్న తొలి తెలుగు నాటకంగా 'నందక రాజ్యం' నాటక రంగ చరిత్రలో నిలిచిపోయింది. ఈ నాటకంలో నందకుడు అనే జమీందారు ఏలుబడిలో ఉద్యోగులు ప్రజలను పీడించసాగారు. ఆలస్యంగా ఈ విషయాన్ని గ్రహించిన నందకుడు వారిని శిక్షించి మంచి పాలన అందించడం ఈ నాటక ఇతివృత్తం. వావిలాల వారే షేక్స్‌పియర్ రచించిన 'జూలియస్ సీజర్' నాటకాన్ని 'సీజరు చరిత్రము' పేరుతో నాటకంగా అనువదించారు. 1874లో తెనిగించి 1876లో ప్రకటించారు. ఇది తొలితెలుగు ఆంగ్లానువాద నాటకం. అయితే ఈ నాటకాలేవీ ప్రదర్శనలకు నోచుకోకపోవడం గమనార్హం.

తొలి తెలుగు నాటక ప్రదర్శనకు అంకురార్పణ చేసిన నాటక వైతాళికుడు కందుకూరి. ఈయన 1880లో 'బ్రహ్మవివాహము' అనే ప్రహసనాన్ని రచించి 'హాస్య సంజీవని' పత్రికలో ప్రచురించారు. "బ్రహ్మవివాహము వెలువడిన కొన్ని దినముల వరకు జనులు గుంపులు గుంపులుగా గూడి వీధి యరుగుల మీద గూర్చుండి దానిని చదివి పకపక నవ్వు చుండిరి. దీనిని జనులు పెద్దయ్య గారి పెండ్లి పుస్తకమనెడి వారట" అని కందుకూరి స్వీయ చరిత్రలో (రెండోభాగం, పుట 175) పేర్కొన్నారు.

'హాస్య సంజీవని'లో 'బ్రహ్మవివాహ' ప్రహసనానికి కొనసాగింపుగా కందుకూరి 'వ్యవహార ధర్మబోధిని' ప్రహసనాన్ని ప్రచురించారు. దీనిని పాఠకులు ప్లీడరు నాటకంగా పిలుచుకున్నారు. దీనిని రాజమహేంద్రవరంలోని శ్రీవిజయనగరం మహారాజా బాలికా పాఠశాలలో 1880లో కందుకూరి ప్రదర్శించారు. ఇది తెలుగులో తొలినాటక ప్రదర్శన. విద్యార్థులతో ఒక నాటక సమాజాన్ని నెలకొల్పి దీనిని ప్రదర్శించారు.

నాటక రచన 1860లో మొదలైనా అవి ప్రదర్శనలకు నోచుకోలేదు. ప్రదర్శన కళ కావడం మూలంగా ప్రదర్శన యోగ్యత పొందిన కందుకూరి వారి 'వ్యవహార ధర్మబోధిని'ని తొలి తెలుగు ప్రదర్శిత నాటకంగా నిర్ధరించారు. 'వ్యవహార ధర్మబోధిని' నాటక ప్రదర్శన విజయవంతం కావడంతో నాటక రచన చేయడంతోపాటు నాటక సమాజాన్ని కూడా స్థాపించడానికి కందుకూరి మరింత ముందడుగు వేశారు.

1881లో ధార్వాడ నాటక సమాజము తెలుగునాట ముఖ్య పట్టణాల్లో నాటక ప్రదర్శనలు ఇస్తూ రాజమహేంద్రవరానికి వచ్చి నాటకాలను ప్రదర్శించింది. ఈ నాటక ప్రదర్శనలు ఎంతో విజయవంతమయ్యాయి. 'వ్యవహార ధర్మబోధిని' ప్రదర్శన విజయవంతమైన స్ఫూర్తితో కందుకూరి సంస్కృత 'రత్నావళి' నాటకాన్ని అదే పేరుతో; షేక్స్‌పియర్ 'కామెడీ ఆఫ్ ఎర్రర్స్' నాటకాన్ని 'చమత్కార రత్నావళి' పేరుతో ఆంధ్రీకరించారు. కందుకూరి ఒక నాటక సమాజాన్ని స్థాపించి ధార్వాడ నాటక సమాజము వారు విడిచి వెళ్ళిన పాకలలో 'రత్నావళి', 'చమత్కార రత్నావళి' నాటకాలను 1880లోనే ప్రదర్శించారు.

కందుకూరి 'తిర్యగ్విద్వన్మహాసభ' (1887), 'మహారణ్య పురాధిపత్యము' (1889) అనే ప్రహసనాలను, 'అభిజ్ఞాన శాకుంతలము' (1875-83), 'మాళవికాగ్నిమిత్రము' (1885), 'ప్రబోధ చంద్రోదయము' (1885) అనే సంస్కృతానువాద నాటకాలను, 'వెనీజు వర్తక చరిత్రము' (1880), 'రాజమంజరి' (1886), 'కల్యాణ కల్పవల్లి' (1894) అనే ఆంగ్లానువాదాలను, 'ప్రహ్లాద' (1885), 'దక్షిణ గోగ్రహణం' (1885), 'సత్యహరిశ్చంద్ర' (1886) అనే నాటకాలను రచించారు.



తొలి తెలుగు నాటక ప్రదర్శనయోగ్యమైన రచయిత, ప్రయోక్త కందుకూరి జన్మదినమైన ఏప్రిల్ 16వ తేదీని రాష్ట్ర ప్రభుత్వం తెలుగు రంగస్థల దినోత్సవంగా ప్రకటించి జిల్లా, రాష్ట్రస్థాయిలో కళాకారులకు కందుకూరి పురస్కారాలను ప్రదానం చేస్తోంది. తొలి తెలుగునాటక ప్రదర్శనగా గుర్తింపు పొందిన 'వ్యవహార ధర్మబోధిని' ప్రదర్శన తేదీని నిర్ధరించడానికి పరిశోధనలు సాగుతున్నాయి. ఫలితాలు కోసం ఎదురుచూద్దాం.

అప్పటి వరకు 1860లో కోరాడ రామచంద్రశాస్త్రి రాసిన 'మంజరీ మధుకరీయము' తొలి తెలుగు నాటక రచనగానూ, 1880లో కందుకూరి వీరేశలింగం పంతులు రాసి ప్రదర్శించిన 'వ్యవహార ధర్మబోధిని తొలిసారి ప్రదర్శించిన నాటకంగానూ భావించవచ్చు. ఏది ఏమైనా నాటి నుంచి తెలుగు నాటకం అభివృద్ధి చెందుతూనే ఉంది. 1894లో ప్రదర్శితమైన గురజాడ వారి 'కన్యాశుల్కం'నాటకం వందేళ్ళుగా తెలుగు జీవితాలతో పెనవేసుకుపోయింది. ఇటీవలే దాదాపు ఎనిమిది గంటలు సాగే 'కన్యాశుల్కం' పూర్తినాటకాన్ని విశాఖ, విజయనగరం, హైదరాబాదు ప్రాంతాల్లో ప్రదర్శించారు. అనేక ప్రయోగాత్మక నాటకాలు, (ఎన్.ఆర్.నంది 'మరో మొహంజదారో' వంటివి) ప్రయోజనాత్మక నాటకాలతో తెలుగునాటక రంగం విరాజిల్లుతోంది.

ఓసారి ఈ విషయంలో పక్క రాష్ట్రాల వైపు తొంగిచూస్తే కన్నడంలో వెంకట రమణశాస్త్రి సూరి రాసిన 'ఇగ్గప్ప హెగ్డే వివాహ ప్రహసన' (1887), మరాఠీలో విష్ణుదాస్ భావే రాసిన 'సీతా స్వయంవరం' (1843), హిందీలో హరిశ్చంద్ర రాసిన 'ప్రవాస' (1868), బెంగాలీలో తారాచంద్ సిక్దర్ రాసిన 'భద్రార్జున్', జి.సి. గుప్తా రచించిన 'కీర్తిబిలాస్' (1852) తమిళంలో రామస్వామి రాజు రచించిన 'ప్రతాప చంద్రవిలాసం' (1878) తొలి నాటకాలుగా చరిత్రలో నిలిచాయి.




**డా॥ కందిమళ్ల సాంబశివరావు**
చిలకలూరిపేట,
గుంటూరు. 98483 51517

# సవ్యసాచి సత్యభామ

**మనిషిలోని అజ్ఞానమే రాక్షసత్వం, దానిని మథించి జ్ఞానవృద్ధిని పొందటమే వెలుగు. దీని సారాంశమే దివ్య దీపావళి. అందుకే 'తమసోమా జ్యోతిర్గమయ' అన్నది రుషి వాక్యం. సంస్కృతి, సంప్రదాయం, ఆధ్యాత్మికత, శాస్త్రీయత, చైతన్యం, ఆనందం కలబోతే ఈ పర్వదినం. జాతి, మతం, ప్రాంతం, కలిమి, లేములతో సంబంధం లేకుండా ఆసేతు హిమాచలం సంబరాలు జరుపుకొనే మహాపర్వం. లోకోపకార విషయాలకు పౌరాణిక గాథను జోడించి అక్షరాలకు ఔన్నత్యాన్ని కల్పించడం మన తెలుగు కవులకు పరిపాటి. అలా శ్రీమదాంధ్రమహా భాగవతంలో పోతన రాసిన దివ్య గాథే సత్యకృష్ణ విజయం (నరకాసురవధ).**

ప్రపంచానికి వెలుగుల పండుగను ప్రసాదించిన సత్యభామది మన సాహిత్యంలోని పాత్రల్లో ప్రత్యేక స్థానం. ఇతిహాసమైన భారతంలోనూ, పురాణమైన భాగవతంలోనూ, హరివంశంలోనూ, ప్రబంధమైన పారిజాతాపహరణంలోనూ సత్యభామ దర్శనమిస్తుంది. అనేకమంది కవులు ఈమెను వివిధ రకాలుగా తీర్చిదిద్దారు. శ్రీకృష్ణుని అష్టమహిషుల్లో మూడోదైనప్పటికీ చాలా మంది సత్యభామకు ప్రథమ స్థానం కల్పించారు. వివిధ కోణాల్లో చిత్రించి భిన్నమైన స్వభావాల్ని వర్ణించారు. ఇతిహాసాల నుంచి ప్రబంధాల వరకు సత్యభామకున్న ప్రాచుర్యం సాక్షాత్ లక్ష్మీదేవి అవతారంగా భావించే రుక్మిణికి కూడాలేదు.

వారందరిలోనూ సత్యభామ మూర్తిమత్వాన్ని చక్కగా ఆవిష్కరించిన వాడు భక్తకవి బమ్మెర పోతనామాత్యుడు. భాగవతంలో పోతన సత్యభామను ముగ్ధమనోహరిగా, శృంగార రసాధిదేవతగా, ఈర్ష్యాద్వేషాలు లేనిదానిగా, భర్తపట్ల అవ్యాజానురాగంగల భార్యగా, అసమానధైర్యసాహసాలు ప్రదర్శించిన వీరవనితగా, యుద్ధ విద్యల్లో ఆరితేరిన నిపుణురాలిగా, సమస్త సద్గుణాలు కలబోసిన తెలుగింటి ఆడపడుచుగా తీర్చిదిద్దాడనవచ్చు.

శ్రీమదాంధ్ర మహాభాగవతం రూపంలో అచ్చ తెలుగు అమృత భాండాన్ని ప్రసాదించాడు పోతన. తెలుగు కవుల్లో అంతటి ప్రజాదరణ చూరగొన్న కవి లేడంటే అతిశయోక్తికాదు. పోతన కవిత్రయం తరువాతి వాడు. అయినా కవిత్వపరంగా కవిత్రయం సరసన నిలబడగలవాడు. సాహిత్య పరంగా ముందు వరుసలో నిలబడగల కావ్య రసజ్ఞతగల మహాకవి.

పోతన రచనలో తెలుగు నుడికారపు సొంపులు, వృత్యనుప్రాస, లాటానుప్రాస, ఛేకానుప్రాస వంటి శబ్దాలంకారాలు రసికుల్ని గిలిగింతలు పెడతాయి. ఆయనకు శబ్దాలంకారాలపై మక్కువ ఎక్కువ. అలాగని కేవలం శబ్దాలంకారాలతోనే తృప్తిపడలేదు. సందర్భానుసారంగా అర్థాలంకారాలన్నింటినీ ప్రయోగించాడు. అర్థాలంకారాలు భావప్రధానాలు. వాటిని తరచి చూస్తేగాని రసానుభూతి బోధపడదు. శబ్దాలంకారాలు మాత్రం శబ్దోచ్చారణ తర్వాతనే వాటి మాధుర్యం పఠితను, శ్రోతలను ఆనందపరవశులనుజేస్తాయి. పద్యానికో వింతపోకడనిస్తూ, పఠితల్లో ఉత్సాహాన్ని నింపుతాయి. అందుకేనేమో ఆయనకు వాటిపైన అంత మక్కువ.

భాగవతంలో పద్యధార సరళంగా, హెచ్చు తగ్గుల్లేకుండా సాగుతుంది. పద్యం అర్థంకాక పోయినా రెండు మూడు పర్యాయాలు చదివితే కంఠస్థమౌతుంది. అది ఒక విశిష్ట లక్షణం. భాగవతమంతా భక్తి ప్రధానం. రామభక్తుడైన పోతన సహజంగా భక్తి రసంలో జీవించి తరించాడు.

ఆయన పాత్ర చిత్రణలోని స్త్రీ పాత్రలు రమణీయంగా రూపుదిద్దుకొన్నాయి. కట్టలు తెంచుకొనే ఆగ్రహావేశాల్లో కూడా, స్త్రీ సహజమైన కరుణ, జాలి, మార్దవం, ఓర్పు, సహనం వంటి గుణాలను అంటిపెట్టుకొని ఉండేలా తీర్చిదిద్దాడు. భాగవతంలోని



కుంతి, ద్రౌపది, సత్యభామ వంటి పాత్రల్నీ ఉన్నతంగా మలచాడు. ప్రత్యేకించి సత్యభామపాత్ర చిత్రణం ప్రశంసించదగ్గది.

భాగవతంలో సత్యభామ మనకు నేరుగా నరకాసుర యుద్ధంలోనే దర్శనమిస్తుంది. అంతకు మునుపు శమంతకమణి, వివాహసందర్భంలో ఆమె పాత్రనామమాత్రం. ఇంద్రుడు శ్రీకృష్ణుని దగ్గరికి వచ్చి నరకాసురుని దుర్మార్గాలను వివరించి వెళ్లిపోతాడు. కృష్ణుడు నరకాసురుణ్ని సంహరించడానికి బయలుదేరుతుండగా సత్యభామ కృష్ణుణ్ని సమీపించింది. తాను కూడా యుద్ధభూమికి వస్తానని సున్నితంగా తన కోర్కెను తెలియజేసింది. అడిగిన తీరులో వినయం ఉట్టిపడుతుంది. ఎవరూ నిరాకరించలేని ముందరకాళ్ల బంధమది.



**దేవానీవు నిశాట సంఘముల**
**నుద్దీపించిచెండాడ నీ,**
**ప్రావీణ్యంబులు చూడగోరుదు**
**గదా! ప్రాణేశ మన్నించినన్,**
**నీవెంటన్ గొనిపొమ్ము నేడు**
**కరుణన్నేజూచి యేతెంచి నీ,**
**దేవీ సంహతికెల్లజెప్పుదు**
**భవద్దీప్త ప్రతాపోన్నతుల్**

దేవా! అనే సంబోధనలోనే ఎంతో వినయ విధేయతలు ద్యోతకమయి ఆశ్చర్య చకితుల్ని చేస్తాయి. దేవా! అంటే ఆర్యా! అని. తనకంటె పెద్దవాళ్లయిన మగవాళ్లని గౌరవించే సంప్రదాయమిది. స్త్రీ పురుష భేదంలేకుండా వయసులో పెద్దవాళ్లని గౌరవించటం భారతీయ సంప్రదాయం. అంతేగాని భర్తకేదో కొమ్ములు మొలిచాయని భర్తను ఉన్నతుడుగా చూడమనలేదు శాస్త్రం. సత్యభామ ఆ సంప్రదాయాన్ని పాటించింది.

తరువాత 'నీవు నిశాట సంఘముల నుద్దీపించి చెండాడ నీ ప్రావీణ్యంబులు చూడగోరుదుగదా!' అంటుంది గడుసుగా. కృష్ణునితో వెళ్లాలని కోరుకోవటం తను యుద్ధం చేయటానికి కాదు. కేవలం అతని యుద్ధ నైపుణ్యాన్ని తిలకించి ఆనందించడం కోసమే అనే భావన కలిగించింది. 'ప్రాణేశ నన్నీవెంటన్ గొనిపొమ్ము', అని బతిమాలుతుంది. నా కోరిక మన్నించమన్న వేడికోలుతో కాదనలేని పరిస్థితి కల్పించింది.

'నేజూచి యేతెంచి నీదేవీ సంహతికెల్లజెప్పుదు భవద్దీప్త ప్రతాపోన్నతుల్', తానక్కడికి పోవాలనుకోవడానికి మరో కారణం శ్రీకృష్ణుని బలపరాక్రమాలు మిగతా సపత్నులకు చెప్పి తాను అనుభవించిన ఆనందాన్ని వాళ్లకీ పంచడం ఆవిడ సదాశయంగా ఉదాత్తతను ఆవిష్కరిస్తాడు పోతన.

శ్రీకృష్ణుడు సత్యభామ కోరికను తిరస్కరించలేకపోయాడు. ఆమె అడిగిన విధానమది. అలాగని అంగీకరించనూ లేడు. వెళ్లేది విహార యాత్రలకు కాదుగదా! యుద్ధంలో ఉండే సాధకబాధకాలు కళ్లకు కట్టినట్లు వివరించాడు. రాణివాసానికి, యుద్ధభూమికి తారతమ్యాలను సున్నితంగా వివరించాడు. నీకూ యుద్ధానికీ చాలా దూరమని మృదువుగా వారించాలనుకున్నాడు. అప్పటికే సత్యభామ స్థిరనిర్ణయానికి వచ్చింది. 'క్షణక్షణముల్ జవరాంద్రచిత్తముల్' అనే కోవలోనిది కాదు సత్యభామ. ప్రియునికి దగ్గరగా వెళ్లింది. ఆమె సౌందర్యం, హావభావాలు, విలాసవిభ్రమాలు, మల్లెపూల పరిమళాలు మత్తెక్కిస్తున్నాయి. ఆ పరిస్థితుల్లో ఏ భర్తయినా పరవశిస్తాడు. పైగా ఆమె ప్రవర్తన, మాటలు ఎవరినైనా ఆకట్టుకొనే విధంగా ఉన్నాయి.

సున్నితంగానే ప్రారంభించింది. మూర్తీభవించిన ఆత్మస్థైర్యంతో చెప్పింది... 'దానవులైననేమి మరి దైత్యసమూహములైన నేమి నీ, మానిత బాహుదుర్గములమాటున నేమిశంక', నన్ను రక్షించడానికి బలమైన నీ హస్తాలనే కోటగోడలుండగా, వాటి వెనుకనున్న నాకేమి భయం అంటుంది. అవతలివాళ్లు దానవులైతేనేమి? దైత్యసమూహాలైతే నాకేమి? అని కృష్ణుని రక్షాపరత్వాన్నే ప్రశంసించిందిగాని, తనను తాను రక్షించుకుంటాననిగాని, తనకు యుద్ధవిద్యలు తెలుసనిగాని సూచనప్రాయంగా కూడ చెప్పలేదు. ఎంతో వినయంగా, 'నీతో నరుదెంతునంచు కరతోయజముల్ ముకుళించి మ్రొక్కి నమ్మానిని తన్ను భర్తబహుమాన పురస్సర దృష్టిజూడగన్' అంత వినయంగా ప్రాధేయపడితే ఏ భర్తయినా ఏం చేస్తాడు. కాదనగలడా? కృష్ణుడు కూడా కాదనలేకపోయాడు. స్వహస్తాలతో ఎత్తి గరుడవాహనాన్ని అధిరోహింపచేశాడు.

సత్యాకృష్ణులు గరుడవానంపై నరకాసురుని పట్టణమైన ప్రాగ్జ్యోతిషపురం చేరుకున్నారు. కృష్ణుడు సైన్యంతో యుద్ధం చేస్తున్నాడు. కోటను బీటలు వారజేసి మురాసురాదులను సంహరించాడు. సత్యభామ కృష్ణుని వెనుకనుంచి వినోదిస్తోంది. అప్పుడు సత్యభామ మేఘంపై నిలకడగానున్న మెరుపుతీగలా ఉందట. చిన్నాచితక బలాలు పారిపోగా నరకాసురుడు యుద్ధానికి వచ్చాడు. అప్పుడే కృష్ణుని వెనుకనున్న సత్యభామ ఒక్కసారిగా ముందుకు వచ్చి నిలుచుంది. ఇంతవరకు ప్రేక్షక పాత్ర వహించింది అల్పులతో ఎందుకనేమో. వియ్యానికైనా కయ్యానికైనా సమవుజ్జీలు కావాలనుకుందేమో.

యుద్ధ సన్నద్ధమై కొప్పు గట్టిగా బిగించింది. కోకముడి దృఢంగా వేసింది. పైటచెంగు నడుముకి చుట్టి బిగించింది. యుద్ధ సంరంభమైన రోషంతో ముఖమండలం ఎర్రని కాంతులు వెదజల్లుతుండగా ఉత్సాహవంతురాలైన వీరవనితగా కృష్ణుని ముందు నిలిచింది.



సరదాగా వచ్చిందనుకొని ఆయనా సరదాగానే విల్లందించాడు. అంత యుద్ధంజేస్తుందని ఆయన కూడా ఊహించి ఉండడేమో. విల్లందుకొనగానే జయించాలనే పట్టుదల వచ్చింది. అనూహ్యమైన తేజోవిశేషాలతో పరాక్రమం రూపుదాల్చినట్లు శత్రువులకు తేరిచూడరానిదయింది. వింటినారి శబ్దానికే రాక్షస స్త్రీలందరూ మూర్ఛిల్లారట.

## ఇవీ యక్ష ప్రశ్నలు... 8



81. విషం ఏది? 82. దయ ఏది?
83. తపస్సు ఏది? 84. దమం ఏది?
85. క్షమ ఏది? 86. లజ్జ ఏది?
87. జ్ఞానం ఏది? 88. శమం ఏది?
89. శ్రాద్ధానికి ఏది తగిన కాలం?
90. ఆర్జవం/ రుజుస్వభావం ఏమిటి?

### సమాధానాలు

81. యాచించటం 82. అందరి సుఖాన్ని కోరటం 83. తన ధర్మాన్ని అనుష్ఠించటం 84. మనసును నిగ్రహించటం 85. శీతోష్ణాదులూ ద్వంద్వాలను ఓర్చటం 86. చెడు పని నుంచి మరలటం 87. యదార్థాన్ని తెలుసుకోవటం 88. మనసును ఉపశమింపజేయటం 89. బ్రాహ్మణుడు వచ్చినపుడు 90. అందరిపట్లా సమభావం

పోతనామాత్యుడిక్కడ సత్యభామను అచ్చపు తెలుగు వీరవనితగా చిత్రిస్తాడు. పొలాల్లో కాయకష్టం చేసే ఆడవాళ్లు నేటికీ తెలుగు పల్లెల్లో దర్శనమిస్తారు. పనిచేసేటప్పుడు చీర కొంగుల్ని బిగిస్తారు. పనికి ఆటంకం కలుగకుండా. యుద్ధ ఘటనలను పోతనామాత్యుడు ఎంతో రమ్యంగా వర్ణిస్తాడు. చేతుల గాజుల శబ్దం వింటినారి శబ్దంతో స్నేహం చేస్తోంది, చెవికమ్మల కాంతులు చెక్కిళ్ల కాంతిని కప్పివేశాయి, కనుల కాంతులు ఆయుధ కాంతులనడగించాయి. శరసంధానరవం శత్రుసైన్యాల కలకలాన్ని అణచివేసింది. ఆమె యుద్ధం చేస్తున్నప్పుడు బాణం తొడుగుతోందా? వదులుతోందా? అనేది తెలియలేదట.

**పరుజూచున్ వరుజూచు నొంపనలరింపన్ రోషరాగోదయా**
**విరత భ్రూకుటి మందహాసములతో వీరంబు శృంగారమున్**
**బరగన్ కన్నుల కెంపు సొంపు బరగన్ జండాస్త్ర సందోహమున్**
**సరసాలోక సమూహమున్ నెఱపుచున్ చంద్రాస్య హేలాగతిన్**

అది ఆమెకు పెద్ద యుద్ధంగా అనిపించలేదు. ఆటలా తోచింది. అందుకే ఒక వైపు శత్రువులను చూస్తూనే మరోవైపు భర్తను కూడా చూసుకుంటోంది. శత్రువును జయించటానికి రోషాన్ని, కృష్ణుని సంతోషపెట్టటానికి అనురాగాన్ని కురిపిస్తోంది. కనుబొమలు ముడిచి శత్రువును, మందహాసంతో ప్రియుని చూస్తోంది. కన్నుల్లో ఎర్రజీరలు కలువ కాంతులను తలపిస్తున్నాయి. వాడియైన తీక్ష్ణ బాణాలు శత్రువులపైకి, మదనాస్త్రాలను ప్రియునిపైకి వదులుతూ యుద్ధం చేసిందట. ఏక కాలంలో ఆమెలో వీర, శృంగార, రౌద్ర, భయానక రసాలు కలగలసి ఈమె స్త్రీయేనా అని విస్తుపోయేలా వర్ణిస్తూ పఠితలను ఆనందపారవశ్యంలో ముంచెత్తుతాడు పోతన.

**టీచర్:** రాము తరగతిలో అందరికీ 35 మార్కులు వస్తే నీకు '0' మార్కులు వచ్చాయి కదా! సిగ్గుగా అనిపించడం లేదు.

**రాము:** టీచర్ ప్రతివారిలో ఏదో ఒక ప్రత్యేకత ఉండాలని మీరే కదా చెప్పారు.



**- కె.శ్రీనివాసాచారి,** మెదక్

ఆమె విలువిద్యానైపుణ్యానికి శ్రీకృష్ణుడే ఆశ్చర్యచకితుడయ్యాడు. అంతఃపురంలో ఆమె మసిలే తీరునీ... యుద్ధరంగంలో విజృంభిస్తున్న వైనాన్నీ పోల్చుకున్నాడు. ఎక్కడా లంకెకుదరలేదు. ఆమె చేసే గుణధ్వని మేఘగర్జనలాగా, దేవతలు చాతక పక్షులుగా, ఆమెచేతి విల్లు ఇంద్రధనుస్సుగా, శ్రీకృష్ణుడు మేఘంగా, సత్యభామ మెరపుతీగెగా, రాక్షస దావాగ్నిని ముంచెత్తడానికి బాణాలనే వర్షధారను కురిపించిందంటూ మనోహరంగా వర్ణిస్తాడు.

సత్యభామ కదనరంగంలో శత్రువులకొక విధంగానూ, కృష్ణునికొక విధంగానూ కనిపిస్తున్నదట. ఆమె ముఖం శత్రువులకు మండుతున్న సూర్యబింబంలాగా కృష్ణుడికి పూర్ణచంద్రబింబంలాగా కనిపిస్తోంది. అలాగే పైట చెరగు ధూమకేతువులాగా, మదన కేతువులాగా; ధనుస్సు ప్రళయకాలసూర్యుని చుట్టూ ఉండే వలయంలాగా, మదన ప్రాకారంలాగా; ఆమె దర్శనం అగ్నిగుండంలాగా, అమృతప్రవాహంలాగా; మహాపరాక్రమశాలిగా శత్రువులకు, సంతోష ప్రదాయినిగా కృష్ణుడికి కనపడి శత్రువులకు వీర రసాన్ని, శ్రీకృష్ణుడికి శృంగార రసాన్ని పంచిందట. పిడుగుల్లాంటి బాణాలతో నరకాసురుణ్ని వధించి ధనుస్సు శ్రీకృష్ణునికందించింది సత్యభామ. అంతటి ధైర్యసాహసాలు ప్రదర్శించి యుద్ధం చేసినా, వీరవనితగా శ్రీకృష్ణుడు శ్లాఘించినా, మాటల్లోగాని చేతల్లోగాని పిసరంతకూడా గర్వం కనిపించదు. యుద్ధ సమయంలో మాత్రమే ప్రౌఢగా కనపడింది. తరువాత ఆమె ముగ్ధగా, ధీరోదాత్త కథానాయికగా, ఉత్తమ ఇల్లాలుగానే కనిపిస్తుంది. లౌకిక పరంగా ఆలోచిస్తే భర్త కష్టసుఖాల్లో వెన్నంటి ఉండే భార్యగా సత్యభామ నిలుస్తుంది. వినయంగానే ఉంటూ అవసరమైనప్పుడు మాత్రమే తన ప్రతిభను, ధైర్యాన్ని, సాహసాన్ని ప్రదర్శించే ప్రౌఢగా సాక్షాత్కరించింది. సమాజంలో జరిగే అకృత్యాలకు, అనాగరిక చర్యలకు ఎదురొడ్డి పోరాడాలన్న సందేశాన్నీ చాటింది. భాగవతంలోని సత్యభామ పాత్ర నేటి నారీలోకానికి కూడా ఆదర్శంగా నిలుస్తుందనడంలో సందేహంలేదు.



**ఒంటెద్దు రామలింగారెడ్డి**
అనంతపురం, 96527 44104

# సాహితీ నవతరంగాలు

సమాజంపై ప్రేమ... ఆలోచనల్లో స్వచ్ఛత... రాయాలన్న పట్టుదల... నలుగురికీ నచ్చేలా రాయడానికి సహనంతో చేసే ప్రయత్నం... విజయాన్ని ముద్దాడటానికి ముందుకురికే వారికి ఏ నాలుగు లక్షణాలుండాలని వివేకానందుడు చెప్పాడో సరిగ్గా అవే ఆ యువతీయువకుల్లో ఉన్నాయి. అజంతాక్షరాన్ని ఆరాధిస్తూ, సాహిత్యాన్ని శ్వాసిస్తూ కవనం చెప్పే కుర్రకారు ఒకవైపు, కలం కదిలిస్తూ కథలు రాసే పడుచువాళ్లు మరోవైపు, నిశిత పరిశీలనతో సమాజ, సాహితీ పోకడలపై ఉపన్యసించే కోడెగాళ్లు ఇంకోవైపు... వెరసి తెలుగు ధ్వజాన్ని వినువీధుల్లో రెపరెపలాడించడానికి సిద్ధంగా ఉన్న నవతరం అక్షరయోధుల బలంపై అనుభవజ్ఞులకున్న అనుమానాలు పటాపంచలయ్యాయి.






ఒక అపవాదు... వేరే ఆనందాలు వెతుక్కుంటూ యువత సాహిత్యానందాన్ని కోల్పోతోంది!

బెంగళూరుకు చెందిన 'స్వాతి'ముత్యం చెప్పిన ఈ కవితను చదవండి. చూపు లేకున్నా, మనసును కళ్లుగా మార్చుకుని ఆత్మవిశ్వాసానికి అక్షరాలద్దిన ఆ యువతి... సాహిత్య సమాశ్లేషంలో సేదతీరే యువహృదయాలకు ప్రతిబింబం.

**ఆరాటం ముందు ఆటంకం ఎంత?**<br>
**సంకల్పం ముందు వైకల్యం ఎంత?**<br>
**దృఢచిత్తం ముందు దురదృష్టం ఎంత?**<br>
**ఎదురీత ముందు విధి రాత ఎంత?**<br>
**నమ్మకమే పట్టుదలై నా రెండు చేతులుగా**<br>
**చూసేస్తా సాధించేస్తా ఆశల ఆనందాన్ని!**<br>
**చేజారిన చేతులు చెరిగేను గీతలు**<br>
**బెదిరించే బాధలే వివరించెను బోధలు**<br>
**నా గుండెను గుప్పెటగా**<br>
**నా ఆర్తిని హారతిగా**<br>
**చేసేస్తా, పంచేస్తా ఆనందపు స్వర్ణయుగాన్ని!**

ఒక అభాండం... యువతరం సమాజాన్ని చదవట్లేదు. సమాజ స్థితిగతులపై స్పందించట్లేదు.

దశాబ్దాలు గడుస్తున్నా దశమగ్రహాల దురాశలు తీరనప్పుడు, తరాలు మారుతున్నా ప్రజల తలరాతలు మారనప్పుడు... నవజీవన బృందావన నిర్మాతలు స్పందించకుండా ఉంటారనుకోవడం వట్టిమాట. ముందు యుగపు దూతలుగా వారి పనిని వారు చేస్తూనే ఉంటారు. కావాలంటే పశ్చిమ గోదావరి జిల్లా కుర్రాడు మల్లిపూడి రవిచంద్ర ఎక్కుపెట్టిన పద్య శరాన్ని గమనించండి...

**కాసుల కోసమై జనులు గ్రాసము మేయుట పెచ్చరిల్ల తా**<br>
**మోసము చేయుచున్ పరుల ముంచుట సభ్యతయయ్యె రోజుకో**<br>
**వేషము మార్చు సంస్కృతికి వేదికయయ్యె ధరాతలంబు ఏ**<br>
**ఏసులు ఈశులున్ ఘనులు ఎందరు పూనిన మార్చరీ గతుల్**

ఒక అపనమ్మకం... అమ్మభాషను అభిమానించే కుర్రాళ్లున్నారంటారా!

పెద్దలు చేసిన పాపాలు పిల్లలకు తగులుకున్నట్లు... తల్లిదండ్రులు ఆంగ్లాన్ని నెత్తినపెట్టుకుంటుంటే, వారి ఛాయలో పెరిగే పిల్లలు తెలుగును తలపోస్తారా? అలా అని పరిస్థితేం మరీ దారుణమైపోలేదు. అమ్మభాషను ప్రేమించే యువతరమూ ఉంది. అలాంటి వారికి ప్రతినిధిగా నిలిచిన నెల్లూరు మట్టిబిడ్డ ఎస్.ఆర్. రవికుమార్ పలుకును ఆలకించండి...

**జాబిలమ్మ వన్నె వెన్నెలే నా అమ్మ భాష**<br>
**నిండుపున్నమినాటి ఆహ్లాదమే నా తల్లి భాష**<br>
**మధురసాగరంలో పొంగిపొర్లే అలలే**<br>
**నా అమ్మ భాష**<br>
**అసలు సంధ్యావేళలో చిలికే రంగులే**<br>
**నా తల్లి భాష**<br>
**నాకోసం నవరాగాల వలే నాట్యమాడును**<br>
**కమ్మని నా తెలుగుతల్లి భాష**

ఇంతకూ ఎక్కడ వెలిగాయి ఈ యువ దీపాలు? ఎక్కడ కురిశాయి ఈ నవ భావనలు?

## చిత్తశుద్ధి ఉంటే చాలు

ఈ సమ్మేళనానికి వచ్చిన వారందరూ విద్యార్థులే. చక్కని తెలుగు పదాలని వాడుతూ మంచి మంచి కవితలు చెప్పారు. యువతకు భాషపై పట్టు, అభిమానం ఉందని చెప్పడానికి ఈ సమ్మేళనం నిదర్శనం. యువతకి భాష వస్తే చాలు, ఆవేశం, అనుభూతి, ఆనందం వంటి భావనలు ఏవి కలిగినా అక్షరీకరించి కవిత్వాన్ని రాయగలరు. యువత మాతృభాషను విస్మరిస్తే ఫైతరం వారు ఎంత రాసినా ప్రయోజనం ఉండదు. తర్వాత తరానికి అందించేందుకు చదవాలి.



రాయాలి. రామునికి ఉడత చేసిన సాయం తక్కువే. అయినా చరిత్రలో నిలిచిపోయింది. అలానే మనమంతా చిత్తశుద్ధితో కృషి చేస్తే మన జన్మధన్యమవుతుంది. తల్లిదండ్రులకు, తల్లిభాషకు సేవ చేసిన తర్వాతే ఇంకా ఏదైనా చేయాలి.

**- జొన్నవిత్తుల రామలింగేశ్వరరావు,**
సినీగేయరచయిత

## తపన ముఖ్యం



యువతకు ఏమీ తెలియదని అంటుంటారు. యువత కోసం ప్రభుత్వం ఏం చేస్తోంది? భాషను రక్షించాలి, సాహిత్యాన్ని పోషించాలి అంటారే తప్ప కార్యాచరణ ఎక్కడ? ప్రజలు భాషను మాట్లాడటం మానేస్తే అది కనుమరుగవుతుందని ఐరాస హెచ్చరించింది. అలా వాడకపోతే భాషతో పాటు సంస్కృతీ నాశనం అవుతుంది. ఇంటర్నెట్‌లో చూసినంత మాత్రాన తెలుగు సాహిత్యం తెలిసిపోదు. సాహితీవేత్తల ప్రసంగాలూ వారి వేదనా వినాలి. వారి సూచనలు పొందుతూ కొత్త పుంతలు తొక్కాలి. సాహిత్యాభివృద్ధికి యువత సంస్థలు పెట్టాలి. వాటిని నడిపించాలి. నెలకు రెండుగంటలు సాహిత్యానికి సమయం కేటాయించాలి. సాహిత్యం బజార్లో కొనుక్కునేది కాదు. మనమే తయారు చేసుకోవాలి. ఇదంతా వ్యక్తిగతం అనుకున్నప్పుడే భాష అభివృద్ధి పథంలో నడుస్తుంది.

**- డా॥ వంగూరి చిట్టెన్‌రాజు**
వంగూరి ఫౌండేషన్ ఆఫ్ అమెరికా
వ్యవస్థాపకులు

## ఉత్తేజపరిచే ఆలోచన



యువత నుంచి జాలువారే కవితా పుష్పాల్లో మాధుర్యాన్ని ఆఘ్రాణించి, ఆస్వాదించాలి. వారికి వచ్చే ఆలోచన సమాజాన్ని ఉత్తేజపరుస్తుంది. సినిమా, నెట్ అంటున్న తరుణంలో ఇంతమంది యువత ఒకే వేదికపైకి రావడం అభినందనీయం. భవిష్యత్తుని దృష్టిలో ఉంచుకుంటూ యువతలో భాషాభిలాష కలిగేలా చేయాలి.

**- కొలకలూరి ఇనాక్,** రచయిత

హైదరాబాదులో. త్యాగరాయగాన సభ వేదికగా ఇటీవల వారం రోజుల పాటు సాగిన మొట్టమొదటి జాతీయ యువసాహితీ సమ్మేళనంలో. రాష్ట్రం నలుమూలల నుంచి కదలివచ్చిన యువకలాల నుంచి జాలువారిన సిరాచుక్కలు తెలుగుతల్లి నుదుటిన తిలకాలై మెరిశాయి. నవగళాల పద్యాలు, కవితలు, కథలతో కార్యక్రమ ప్రాంగణం వెలుగురేకై పల్లవించింది. సాంస్కృతిక శాఖ సౌజన్యంతో వంగూరి ఫౌండేషన్ ఆఫ్ అమెరికా ఆధ్వర్యంలో ఈ సమ్మేళనం జరిగింది. దీనికి ఈటీవీ2 మీడియా భాగస్వామి. తెలుగు భాషాభివృద్ధికి యువతీయువకులతో అక్షరాలు పేర్పించడం దీని లక్ష్యం.

**అందరూ అందరే**

స్వీయ పద్యపఠనం, యువకవి సమ్మేళనం, స్వీయ వచన కవితా పఠనం, అనగనగా ఒక కథ (సొంతగా కథ చెప్పడం), ప్రాచీన సాహిత్యం - అవధానం, నవల, నాటకాలు, ఆధునిక కవిత, అనువాద సాహిత్యం, జానపద సాహిత్యం, కళారూపాలు, తెలుగు భాష, సంస్కృతి పరిరక్షణలపై ప్రసంగాలు, చర్చలతో కార్యక్రమాలు ఆసక్తికరంగా సాగాయి. వీటన్నింటిలో యువతరం (18 - 30 ఏళ్ల వయసు) మాత్రమే పాల్గొంది. ప్రతిరోజూ కొందరు సాహితీ పెద్దలు అతిథులుగా వచ్చి మార్గనిర్దేశం చేశారు. 'వందేళ్ల కిందట పద్యం ఎంత పటిష్ఠంగా ఉండేదో! అల్లసాని దగ్గర పద్యాన్నే కూలిగా స్వీకరించిన గువ్వలచెన్నడు మనకి స్ఫూర్తిదాయకం. నేటి యువత కూడా పద్యానికి పట్టం కట్టాల'న్న మద్రాస్ సంగీత కళాశాల కార్యదర్శి డా॥ పప్పు వేణుగోపాల్ మాటలకు స్పందనే పైన చెప్పుకున్న రవిచంద్ర పద్యం. కవితల్లో ఖమ్మానికి చెందిన డి. శ్రీనివాస్ 'అక్షరయాత్ర', ఆదిలాబాద్ వాసి సీహెచ్



## భావ ప్రక్షాళన అవసరం

కొత్త వస్త్రానికి రంగు వేస్తే అది వదలిపోదు. పాతవస్త్రానికి రంగు పట్టదు. యువత కొత్త వస్త్రాల వంటివారు. వారి భావాల్ని విశదీకరించి కలాలకు పదును పెట్టాలి. ఈ వారం రోజుల్లో రచయితలు చెప్పిన భావాలను నెమరు వేసుకుంటే ఉత్తేజం వస్తుంది. సాహిత్యానికి సిద్ధాంతాలు అవసరమే కానీ రాద్ధాంతాలు అవసరం లేదు. అవి కుల, మత, ప్రాంతాలకు, వ్యక్తులకు అతీతంగా ఉండాలి. సాహిత్యంలో పెనుమార్పులు తీసుకొచ్చేవారు, సృజనాత్మకత పెంచేవారు యువతే. ప్రస్తుతం నమ్మాల్సింది మానవ ప్రకృతిని కాదు. **'సౌరభములేల చిమ్ము పుష్ప వ్రజంబు? / చంద్రికలనేల వెదజల్లు చందమామ?/ ఏల సలిలంబు పారు? గాడ్పేల విసురు?/ ఏల నా హృదయంబు ప్రేమించు నిన్ను?** అంటూ కృష్ణశాస్త్రి చెప్పినట్లు మన ప్రకృతిని నమ్మాలి. మనుషులను గౌరవించకపోయినా ప్రకృతిని ప్రేమించాలి. ఇలా చేస్తే మన సంప్రదాయం మీద మనకు మక్కువ కలుగుతుంది. భావ ప్రక్షాళన కలిగితే మంచి రచయితలవుతారు.



**- ఆచార్య ఎల్లూరి శివారెడ్డి**
ఉపకులపతి, తెలుగు విశ్వవిద్యాలయం

## సంకల్పం ఉండాలి

'యువత శిరమెత్తితే నవత గళమెత్తితే లోకమే మారిపోదా? చీకటి మాసిపోదా' అనే నార్ల చిరంజీవి మాటను యువత గుర్తుచేసుకోవాలి. ఆలోచన సత్సంకల్పంతో ఉంటే అది సంకల్పసిద్ధిని కలిగిస్తుంది. సాంస్కృతిక సంస్థలు, ప్రభుత్వం సమన్వయంతో ఇలాంటి కార్యక్రమాలు ఏర్పాటు చేయాలి. రవీంద్రనాథ్ ఠాగూర్, గురజాడ, శ్రీశ్రీ, గిడుగు, ఆత్రేయ, ఆరుద్ర తమ బాధ్యతలను గుర్తించి సమాజాన్ని చైతన్యం పరచడమే లక్ష్యంగా తీసుకున్నారు. వారి స్ఫూర్తి చైతన్యాలను స్మరించుకోవాలి. భాషను పరిరక్షించుకోవడానికి కంకణబద్ధులుగా ఉండాలి.



**- డా॥ కె.వి.రమణాచారి,**
పూర్వసలహాదారు, సాంస్కృతికశాఖ

## సృజనకు ఆస్కారం

అన్ని పోటీ పరీక్షల్లో తెలుగు భాషా సాహిత్యాలను ఒక పేపర్‌గా పెట్టాలి. నేటి యువతకు రచనలు చేసే విధంగా శిక్షణనివ్వాలి. భాషపై అభిమానం ఉన్నా వారిలో భావాల్ని చెప్పలేకపోయేవారెందరో ఉన్నారు. ఇలాంటి కార్యక్రమాల వల్ల యువతలో ఉన్న సృజనను నిరూపించుకోవడానికి ఆస్కారం ఉంటుంది. ప్రతి విద్యార్థికి తల్లిదండ్రులే భాషాభిమానాన్ని పెంచాలి. ప్రస్తుతం తోలుబొమ్మలాట, ఒగ్గు కథలాంటి ఎన్నో జానపద కళారూపాల్ని పుస్తకాల్లో చదవడమే కానీ చూడలేకపోతున్నాం. వాటిని కాపాడుకోవాలి.



**- ఎం.రూప,** శ్రీకాకుళం

తిరుపతి 'ఆడదాని బ్రతుకు', భాగ్యనగర అమ్మాయి మెర్సీ మార్గరెట్ 'ప్రశ్నల గది' వంటివి ఆకట్టుకున్నాయి.

'వృద్ధుడు చేసిన సాయం' శీర్షికతో పాలమూరు యువతి జి.భారతి చెప్పిన కథ ఆలోచనాత్మకంగా సాగింది. చెట్టు ఎక్కిన కుర్రాడికి దిగడం రాక ఇబ్బంది పడుతుంటాడు. అటువైపుగా వెళ్తున్న ఓ వృద్ధుడు దాన్ని గమనిస్తాడు. ఆ పిల్లాడిపైకి రాళ్లు విసురుతాడు. వాటి నుంచి రక్షించుకోవడానికి కుర్రాడు వడివడిగా చెట్టు దిగేస్తాడు. అప్పటి వరకూ కిందకు దిగే దారి కనపడక భయపడిన వాడు ధైర్యం తెచ్చుకుని సమస్య నుంచి బయటపడతాడు. ఒకరోజు అన్నం పెట్టడం కాదు... ఆ అన్నాన్ని సంపాదించుకునే మార్గాన్ని నేర్పించడమే ఉత్తముల లక్షణమన్న విషయాన్ని వివరించే కథ ఇది. 'అనగనగా ఒక కథ'లో భాగంగా కథలు చెప్పిన వారందరూ ఇలాంటి రచనలతోనే సభికులను ఆలోచింపజేశారు

అవధానాల్లో సమకాలీన అంశాల గురించి తూర్పుగోదావరికి చెందిన గరికిపాటి గురజాడ వివరిస్తే, ఒగ్గు కళాకారుల వెతలను నిజామాబాద్ కుర్రాడు ఎం.గంగాప్రసాద్ కళ్లకు కట్టాడు. జానపద సంస్కృతిలోని శాస్త్రీయతను హైదరాబాద్ ఆడబిడ్డ ఎల్.మంగమ్మ విడమరిచారు. భాషానురక్తిని పెంచడానికి ఏడాదికోసారి ప్రతి పాఠశాలలోని విద్యార్థులకు సాహిత్య క్విజ్, నాటికలు, కథలు, కవితల పోటీలు నిర్వహించాలని విశాఖపట్నం యువకుడు కొయిలాడ బాబు ఆచరణాత్మక సూచన చేశారు. యంత్రానువాద సౌకర్యాలను మరింతగా అందుబాటులోకి తేవాలని కృష్ణా జిల్లాకు చెందిన పి.లక్ష్మణరావు ఆకాంక్షించారు. నేటి చలనచిత్ర పాటల్లో సాహిత్య విలువలు కనపడట్లేదని ఆర్.సాయికృష్ణ (మెదక్) ఆవేదన వ్యక్తం చేశారు. ఇలా ఎందరో యువతీ యువకులు తమ ఆలోచనలను ఉద్వేగభరితంగా పంచుకున్నారు.

సమ్మేళనానికి వచ్చిన వారిలో ఉత్సాహం నింపే ప్రకటన చేశారు అధికార భాషా సంఘం అధ్యక్షులు మండలి బుద్ధప్రసాద్. విశ్వవిద్యాలయ స్థాయిలో సాహిత్య పోటీలు నిర్వహించాలనుకుంటున్నామని చెప్పారు. అది వాస్తవ రూపం దాల్చితే యువతలోని ప్రతిభ మరింతగా వెలుగులోకి వస్తుంది. అంతిమంగా అది తెలుగుకే మేలు చేస్తుంది. వారం రోజుల పాటు ఇంత మంది యువతీ యువకులు ఒకే వేదికపైకి వచ్చి తెలుగును స్మరించుకోవడం భాష భవిష్యత్తుకు భరోసానిస్తోంది. ఇలాంటి కార్యక్రమాలు మరిన్ని జరిగితే భావితరంలో అమ్మభాషా స్ఫూర్తి శిఖరాయమానమవుతుంది.



**గణేష్ బెహరా**
తెలుగు వెలుగు, హైదరాబాదు.
80085 51843



# అందులోనే భారతం... అందులోనే రామాయణం

**రాతిని నాతిగా చేసిన రామయ్య గరిమ... హిడింబిని ఏలుకున్న భీమయ్య పెరిమ... కాళీయుని కోరలూడబెరికిన కన్నయ్య కొలవి... ఒకే పద్యంలో దర్శనమిస్తే, ఆ కవన ప్రతిభకు పాదాభిషేకం చేయాలనిపించదూ! అనితర సాధ్యమైన పద విన్యాసాలతో ద్వ్యర్థి, త్ర్యర్థి, చతురర్థి రచనలు చేసి, తెలుగు పద సంపద వైభోగాన్ని ప్రపంచానికి చూపించిన కావ్యకర్తలెందరో.**

భాషపై పట్టు సాధించాలంటే పద సంపద బాగా అవసరం. ఈ సంపదను ఎంత తొందరగా సంపాదిస్తే అంత వేగంగా కవులు, రచయితలుగా ఎదగవచ్చు. అందుకే, పూర్వం పండితులు నానార్థాలను ఇచ్చే పదాలను గురించి తెలుసుకునే వారు. తెలుసుకోవటమే కాదు తమ రచనల్లో రెండు నుంచి వంద అర్థాలనిచ్చే పదాలను వాడుతూ చక్కటి కవిత్వాన్ని చెప్పే వారు. ఆకుచాటుపిందెలా ఒక పదంలో... సందర్భాన్ని బట్టి, పదం విరుపును అనుసరించి మెరుపులా మెరిసే మరో అందమైన అర్థం పాఠకులను మురిపించి మైమరపిస్తుంది. ఈ కారణంతోనే కాబోలు తెలుగులో అనేకార్థ కావ్యాలు ఉదయించాయి.

ఈ కావ్యాలకు శ్లేష మూలస్థానం. ఒక పదానికి సరసంగా ఉండే రెండు అర్థాలు ఉండటమనేది శ్లేషాలంకార ప్రధాన లక్షణం. ఈ శ్లేష మీద ఆధారపడే ద్వ్యర్థి, త్ర్యర్థి, చతురర్థి తదితర కావ్యరచనలు పుట్టుకొచ్చాయి. ఇలాంటి వాటిని రాయాలంటే కవికి శబ్దాధికారంతోపాటు మంచి పాండిత్యం ఉండాలి. అయితే... ఇలాంటి రచనల వల్ల ప్రయోజనమేంటి? ఉత్సాహం, ఉత్కంఠ, వినోదం పెనవేసుకుని పాఠకుడికి అద్భుత రసానుభూతిని అందించడం. అంతేకాదు, పదసంపద, పదాల వాడుకపై అవగాహన పెంచడం. తద్వారా భాష గొప్పతనాన్ని కళ్లకు కట్టడం.

వాస్తవానికి రెండర్థాలిచ్చే పదాలను ఎంచుకోవటమే కష్టం. అలాంటిది పద్యం మొత్తం మీద శ్లేషను చూపిస్తూ, ఆ పద్యానికి రెండర్థాలు వచ్చేలా చేయడమంటే కత్తిమీదసామే. రెండర్థాల కావ్యంలోని ప్రతి పద్యంలోనూ ఒక అర్థంలో ఓ కథాంశం, రెండో అర్థంలో మరో కథాంశం ధ్వనిస్తుంటాయి. ఇవి ద్వ్యర్థి కావ్యాలు. మూడు కథలను వివరించేవి త్ర్యర్థి కావ్యాలు. నాలిగింటిని చెప్పేవి చతురర్థి కావ్యాలు.

చేమకూర వెంకటకవి లాంటి కొందరు తమ కావ్యాల్లో శ్లేషపద్యాలను అక్కడక్కడ వాడారు. పాఠకులకు చమత్కారపు రుచులు చూపించారు. 'ఇలా కావ్యంలో ఏదో ఒకటి రెండు పద్యాల్లో మాత్రమే శ్లేషను చూపిస్తే ఏం గొప్ప? అన్ని పద్యాల్లోనూ రెండర్థాలుగా, రెండు కథలుగా శ్లేషను చెప్పడమే గొప్ప' అన్నాడు పింగళి సూరన. 'రాఘవపాండవీయం' అనే ద్వ్యర్థి కావ్యానికి ఈయన కర్త. ఈ కావ్యమే తెలుగులో వచ్చిన మొదటి ద్వ్యర్థి కావ్యం. ఇందులో రామాయణ భారతార్థాలు రెండూ కనిపిస్తాయి. కావాలంటే చూడండి....

**వినియతనిం దనపైనిడు**
**కొనియేగి నియమికి దగని ఘోరార్తి యొన**
**ర్చినవాడ నీకు దండ్యుడ**
**నని తను దెలుపుచును వారి కప్పనసేసెన్**

కంద పద్యమిది. పైపైకి చూస్తే రామాయణార్థం స్ఫురిస్తుంది. ముని బాలకుణ్ని పొరపాటున ఏనుగుగా భావించిన దశరథుడు బాణం వేస్తాడు. పిల్లాడు మరణిస్తాడు. తప్పు తెలుసుకున్న అయోధ్యాపతి బాలకుణ్ని అతని వృద్ధ తల్లిదండ్రులకు అప్పగించాడు. అయితే, ఇదే పద్యంలో భారతార్థమూ ఉంది. ఒక ముని తన భార్యతో కలిసి అడవిలో సంచరిస్తున్నాడు. ఆ భార్యాభర్తలిద్దరూ సరదాగా లేడి రూపాలను ధరించి ఆడుకోసాగారు. ఆ రూపాల్లో ఉన్న వారిని దూరం నుంచి చూసిన పాండురాజు వేటాడాడు. తర్వాత పశ్చాత్తాపపడి ఆ తప్పంతా తనదేనంటాడు. ఇలా ఏ ఘట్టానికి ఆ ఘట్టం సరిగా సరిపోయేలాగా పింగళి సూరన ద్వ్యర్థి కావ్యాన్ని తీర్చిదిద్దాడు. శ్లేష కావ్య రచనలో సూరన ప్రతిభ ప్రత్యేకమైంది. ఆయన పదాల విరుపులో తెలుగు, సంస్కృత పదాలు విడివిడిగా తెలుగు, సంస్కృత అర్థాలను ఇస్తుంటాయి. సూరన కాకుండా మరో పదహారు మంది కవులు ద్వ్యర్థి కావ్యాలను రచించారు.

త్ర్యర్థి కావ్యాల్లో నెల్లూరి వీరరాఘవ కవి విరచిత 'యాదవరాఘవపాండవీయం' ప్రముఖమైంది. ఇందులో శ్రీకృష్ణుడి కథలు, రామాయణ, మహాభారతాలుంటాయి.

**శ్రీలకిరవు బహుళ సితభాను కులులకు**
**నాటపట్టు సజ్జనాస్పదంబు**
**మహి నయోధ్యకాంతి మధురసాలోజ్జ్వల**
**నాగపురి దనర్చు నవ్యలీల.**

ఈ పద్యంలో యాదవార్థంలో యాదవులకు ముఖ్యపట్టణమైన మధుర, భారతార్థంలో హస్తినాపురం, రామాయణార్థంలో అయోధ్య ప్రస్తావనలు కనిపిస్తాయి. అలాగే, ద్వితీయాశ్వాసంలోని కింది పద్యం కూడా ఎంతో మనోహరంగా ఉంటుంది.

**గత నిజపదకమల పాళి కాళియాహి**
**తగను వరసతి ప్రాప్తిగాఁ దాను బోవ**
**బావని గతిని శ్రీరామ భవ్యకృష్ణ**
**మూర్తి భాస్వత్త నయయుక్తి ముదముఁ జెందె**

కృష్ణుడు కాళిందిలోకి దూకి కాళీయుడి పడగల మీద నృత్యం చేశాడు. కాళీయుడి భార్యల ప్రార్థనలను విని ఆ సర్పాన్ని సంహరించకుండా విడిచిపెట్టాడు. నదిని వదిలి దూరంగా సముద్రంలో ఉన్న ద్వీపానికి వెళ్లమని ఆజ్ఞాపించాడు. (యాదవార్థం)

భీముడు హిడింబిని చేపట్టాడు. కుమారుణ్ని ప్రసాదించి ఆమెను సంతోషపెట్టాడు. (భారతార్థం) రామ పాదస్పర్శతో అహల్య శాప విముక్తి పొందింది. అందుకు శ్రీరాముడు ఆనందించాడు. (రామాయణార్థం)

మూడర్థాల ఈ కావ్యాన్ని రచించిన వీరరాఘవ కవి క్రీ.శ 1717 ప్రాంతానికి చెందినవాడు. తొలిసారిగా ఈ యాదవరాఘవపాండవీయాన్ని 'అముద్రిత గ్రంథ చింతామణి'లో (1886) ముద్రించారు. ఈ కావ్యంలో పెద్ద పెద్ద పదాలు కూడా చక్కని విరుపుతో బహుచక్కని అర్థాలనిస్తూ కనిపిస్తాయి. వీరరాఘవ కవి రచనకు విద్వాన్ సరిపల్లె విశ్వనాథశాస్త్రి 'ఆనందజ్యోత్స్న' పేరున టీక రచించారు. కవి ఎంత గొప్పగా కవిత్వం చెప్పాడో దానికి తగ్గట్టుగానే టీక ఉంటుంది.

త్ర్యర్థి కావ్యాల్లో అయ్యగారి వీరభద్రకవి 'రాఘవపాండవయాదవీయం', ఎలకూచి (భట్టర) బాలసరస్వతి 'రాఘవయాదవపాండవీయం'. పోకూరి కాశీపత్యవధాని 'సారంగధరీయం' ప్రసిద్ధికెక్కాయి. పోకూరి కాశీపత్యవధాని (1892 - 1974) గుంటూరు జిల్లా పల్నాడు ప్రాంతం బోదిలవీడులో జన్మించాడు. ఇరవై ఏళ్లు నిండీనిండక ముందే చతుర్విధ కవితా ప్రావీణ్యం సంపాదించారు. తర్వాత గద్వాల ఆస్థానంలో కవిగా నియమితులయ్యారు. 'కవిసింహ' బిరుదాంకితులైన పోకూరి వారు అరవై వరకూ గ్రంథాలు రచించారు. వాటిలో 'నిరోష్ఠ్యనిర్వచనశుద్ధాంధ్ర హరిశ్చంద్రోపాఖ్యానం, సిద్ధయోగ చరిత్ర, త్రింశదర్థపద్యరత్నం, శౌరిశైశవలీల, సుజ్ఞాన ప్రబోధిని, నరసింహ నిరసన స్తుతి, శ్రీశైల మల్లీశ్వర శతకం' తదితరాలున్నాయి. పోకూరి వివిధ సంస్థానాల్లో తన కవితా పాండిత్యాన్ని ప్రదర్శించారు. కనకాభిషేకం, గజారోహణం, గండపెండేరం లాంటి సత్కారాలను అందుకున్నారు. నాటి రాష్ట్రపతి డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ చేతుల మీదుగా సన్మానాన్ని స్వీకరించిన ఘనత ఆయనది. పోకూరి కవిత్వం శ్లేష యమకాది శబ్దాలంకారవిలసితంగా, ఆశుగర్భచిత్రబంధ ధ్వనివిలసితంగా ఉంటుంది. 'సారంగధరీయము'లో పార్వతీకల్యాణం, తారాశశాంకం, సారంగధర కథలను చెప్పారు. ఈ కావ్యాన్ని గద్వాల సంస్థానాధీశుడు సీతారామభూపాలరావుకు అంకితమిచ్చారు. మహారాణి ఆదిలక్ష్మీదేవమ్మ ఆదేశానుసారం 1933వ సంవత్సరంలో ఇది మొదటిసారి ముద్రితమైంది. తెలుగు విశ్వవిద్యాలయం 1990లో దీన్ని తిరిగి అచ్చొత్తింది.

పోకూరి చేసిన చమత్కారాల్లో 'త్రింశదర్థపద్యరత్నం' తెలుగు సాహితీలోకంలో విశేషంగా వెలుగులు చిమ్ముతోంది. ఒక్క ఆటవెలది పద్యంలో ముప్పై అర్థాలను కనిపింపచేయడమే దీని ప్రత్యేకత.

**భూరి జఠర గురుడు నీరజాంబిక భూతి**
**మహితకరుడ హీనమణికలావు**
**డలఘు సద్గణేశు డగ్రగోపుడు మహో**
**మర్త్య సింహుడేలు మనల నెపుడు**

ఈ పద్యం ముప్పై వేర్వేరు విషయాలను గురించి చక్కగా చెప్పగలిగింది. గణపతి, శివుడు, బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుడు, అగ్ని, యముడు, నిరురుతి, వరుణుడు, వాయువు, కుబేరుడు, అష్టదిక్పాలకులు, నవగ్రహాలు, సూర్యుడు, చంద్రుడు, సముద్రుడు, మేఘుడు, హిమవంతుడు, ఆదిశేషుడు, గరుత్మంతుడు, గజేంద్రుడు, ఆంజనేయుడు, నందీశ్వరుడు, వీరభద్రుడు, కుమారస్వామి , మన్మథుడు, నారదుడు, దత్తాత్రేయుడు, వీరబ్రహ్మం, విశ్వకర్మల ప్రస్తావన ఉంది.

'నలయాదవరాఘవపాండవీయం' పేరిట తాను చతురర్థి కావ్యాన్ని రచించినట్లు శుద్ధాంధ్ర నిరోష్ఠ్యసీతాకల్యాణము కృత్యాది నలభై ఏడో పద్యంలో మరింగంటి సింగరాచార్యులు చెప్పుకున్నాడు. కానీ, ఆ గ్రంథం ఇప్పుడు దొరకట్లేదు. అలాగే ఓరుగంటి రామశేఖరుడు కూడా 'రామకృష్ణార్జున రూపనారాయణీయము' అనే నాలుగర్థాల రచన చేసినట్లు తెలుస్తోంది.

అనేకార్థ కావ్యాల పరంపరను గమనిస్తే మన కవులు ఎంతటి గొప్ప పదసంపన్నులో, కవనయోధులో అర్థమవుతుంది. అరుదైన పాటవంతో అజరామరమైన కావ్యాలకు ప్రాణం పోసి, తెలుగు జాతికి వాటిని వారసత్వ సంపదగా అందించిన ఆ కవులు ధన్యులు. తెలుగుభాషలోని చమత్కారాన్నంతా పోగుచేసి తెలుగు ప్రజానీకం చేతుల్లో పోసిన ఆ సరస్వతీ పుత్రులందరూ తెలుగుతల్లి గళసీమలో శోభిల్లే సుగంధ పారిజాత సుమమాలికలు.

**- చైతన్య**, గుంటూరు



# పండంటి బోధనకు పది లక్ష్యాలు

తెలుగు బోధకుడిగా కొలువు సంపాదించాలంటే కొన్ని అంశాలపై పట్టు సాధించాలి. అలాంటి అంశాల్లో ఒకటి 'లక్ష్యాలు-స్పష్టీకరణలు'. దీనిలోని ముఖ్యమైన విషయాలు, గుర్తుంచుకొనే విధానాలను ఓసారి పరికిద్దాం.

మన మాతృభాష, ప్రాంతీయ భాష, అధికారభాష తెలుగు. మన రాష్ట్రంలో కళాశాల స్థాయి వరకు మాతృభాషలో విద్యాబోధన జరుగుతుంది. పాఠశాల స్థాయిలో తెలుగును ప్రథమ భాషగానూ, కళాశాల స్థాయిలో ద్వితీయ భాషగానూ బోధిస్తున్నారు.

'మాతృభాష తల్లిపాల వంటిది, పరభాష పోతపాల వంటిది. తల్లిపాలు తాగి పెరిగిన వాడికి, దాదిపాలు తాగి, పోతపాలతో పెరిగిన వాడికి, ఎంత తేడా ఉంటుందో మాతృభాషలో విషయం నేర్చుకున్న వాడికి, పరభాషలో నేర్చుకొన్నవాడికి అంతే తేడా ఉంటుందని 'కొమర్రాజు వేంకట లక్ష్మణరావు' అభిప్రాయం.

బోధనా లక్ష్యాలను బెంజమిన్ బ్లూమ్ మొదట 'టాక్సానమీ ఆఫ్ ఎడ్యుకేషనల్ ఆబ్జెక్టివ్స్'లో విశ్లేషించారు. 1973-74 విద్యా సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విద్యా పరిశోధన శిక్షణా సంస్థ (ఎస్‌సీఈఆర్‌టీ) లక్ష్యాల ఆధారంగా బోధన నిర్వహించడానికి, ఉపాధ్యాయులకు శిక్షణ ఇవ్వడానికి తెలుగు భాషా బోధనకు పది లక్ష్యాలు గుర్తించారు.

**1. జ్ఞానం 2. అవగాహన 3. వినియోగం 4. నైపుణ్యాలు 5. భాషాభిరుచి 6. రసానుభూతి 7. సంస్కృతీ సంప్రదాయాలు 8. సృజనాత్మకత 9. భాషాంతరీకరణం 10. సముచిత మనోవైఖరులు**

ఈ లక్ష్యాల ఆవిష్కరణలో భాగంగా ఉద్దేశం- గమ్యం- లక్ష్యం- స్పష్టీకరణం అనే పదాలను పరిశీలిస్తే...

**ఉద్దేశాలు:** పాఠ్య ప్రణాళికల రూపకల్పనకు; పాఠ్యాంశాల ఎంపికకు ఉపకరించి ఆయా పాఠ్యాంశాల ద్వారా విద్యార్థుల్లో సాధించాల్సిన స్థూలమైన ప్రవర్తనా మార్పుల్ని తెలిపేవి ఉద్దేశాలు. ఇవి రెండు రకాలు. 1. సామాన్య ఉద్దేశాలు 2. ప్రత్యేక ఉద్దేశాలు.

**గమ్యాలు, ధ్యేయాలు:** ఆశయాల ఉద్దేశాల విస్తృత వ్యక్తీకరణలే గమ్యాలు. గమ్యాలు విద్యా విధాన ప్రాధాన్యతను నిర్ణయించి విద్యా ప్రణాళికల రూపకల్పనకు ఉపకరిస్తాయి.

**లక్ష్యాలు:** ఉద్దేశాలు, గమ్యాల నుంచి ఆవిర్భవించి తరగతి బోధనకు మార్గదర్శకత్వం నెరపి ఆయా పాఠ్యాంశాల ద్వారా విద్యార్థుల్లో ఆశిస్తున్న ప్రవర్తనా మార్పుల్ని సూచించేవి బోధనా లక్ష్యాలు. లక్ష్యాలు రెండు రకాలు.

1. **సంవృత లక్ష్యం:** విస్తృత వ్యాఖ్యలో ఉంటాయి.
2. **వివృత లక్ష్యం:** ఒకే వ్యాఖ్యలో ఉంటాయి. వాటిని స్వల్పకాలంలో ఒక పాఠ్యాంశం చివర సాధించవచ్చు.

### స్పష్టీకరణలు

- బోధనా లక్ష్యాల సూక్ష్మరూపాలు స్పష్టీకరణలు
- బోధనా లక్ష్యాలను ప్రవర్తనా రూపంలో వివరించేవి స్పష్టీకరణలు
- బోధనా కృత్యానికి ప్రాతిపదికలు స్పష్టీకరణలు
- అభ్యసనానికి సాక్ష్యాలు స్పష్టీకరణలు
- లక్ష్యాల అర్థాలను పరిమితం చేసేవి స్పష్టీకరణలు
- వివిధ లక్ష్యాల్లోని భేదాలను చెప్పడానికి ఉపకరించేవి స్పష్టీకరణలు
- బోధనాభ్యసన సన్నివేశాల్లో అంతర్దృష్టిని సారించేవి స్పష్టీకరణలు
- మూల్యాంకనంలో ప్రశ్నల తయారీకి

| ఉద్దేశం | గమ్యం | లక్ష్యం |
|---|---|---|
| దీర్ఘకాలికం సాధించడానికి ఎక్కువ కాలం అవసరం | దీన్ని సాధించడానికి దీర్ఘకాలమవసరం లేదు | స్వల్పవ్యవధిలో సాధించవచ్చు |
| ఆదర్శవంతమైంది | సాధించడానికి వీలైనా సుదూరమైంది | ఆచరణాత్మకమైంది |
| సముపార్జన దుర్లభం | సముపార్జన అంత దుర్లభమైంది కాదు | సముపార్జన సులభం |
| మూల్యాంకనం వల్ల ఉద్దేశంనెరవేరలేదని బోధన చేయడానికి ఎక్కువ అవకాశం లేదు | మూల్యాంకనం చేసినా సవరణ బోధన దశలో తిరిగి బోధన చేయవచ్చు | వెంటనే మూల్యాంకనం చేసి అవసరమైతే సవరణ బోధన చేయవచ్చు |

తోడ్పడేవి స్పష్టీకరణలు

● ఒక లక్ష్యాన్ని స్పష్టంగా చెప్పడానికి తోడ్పడేవి స్పష్టీకరణలు

● ఒక లక్ష్యాన్ని సముపార్జించడానికి తోడ్పడేవి స్పష్టీకరణలు

జ్ఞానం: జ్ఞానానికి సంబంధించిన స్పష్టీకరణలు రెండు.

**1. జ్ఞప్తికి తెచ్చుకోవడం**

**2. ఆయా సందర్భాల్లో గుర్తించడం.**

జ్ఞానం ప్రధానంగా మూడు రకాలు.

**1. విషయజ్ఞానం**

**2. భాషాజ్ఞానం 3. సాహిత్యజ్ఞానం**

అవగాహన:

● జ్ఞానం ప్రాతిపదికగా కలిగింది అవగాహన

● అవగాహనను 'అవభేదం' అంటారు.

**స్పష్టీకరణలు:**

● పోలికలు, భేదాలు చెప్పడం

● గంభీర భావాలు వివేచించడం

● ఉదాహరణలు సొంతంగా ఇవ్వడం

● దోషాలను గుర్తించి సరిచేయడం

● జరగబోయే కథను ముందుగా ఊహించడం

● వివరించడం ● విశ్లేషించడం

● సంక్షేపించడం ● వివేచించడం

● సన్నిహిత సంబంధాల అంశాల సామ్యభేదాలను కనుగొనడం

● నిగూఢార్థాన్ని కనుగొనడం

● విషయాల మధ్య కార్యాచరణ సంబంధాన్ని గ్రహించడం

● అపరిచిత పద్యభాగాల ప్రధాన భావాలను కనుగొనడం

● శీర్షికలను సూచించడం

● పదాల అర్థాలను సందర్భానుసారంగా సూచించడం

● వివేచన జ్ఞానాన్ని కలిగి ఉండటం;

● తగిన వేగంతో చదవడం

● పద్య గద్యాల్లో అన్వయక్రమాన్ని తెల్పడం

నైపుణ్యం:

**1. వాగ్రూపనైపుణ్యం:** వాచిక శక్తిని అభివృద్ధి చేసే నైపుణ్యం, దీనితో సృజనాత్మకత అలవడుతుంది.

**2. లిఖితరూప నైపుణ్యం:** సృజనాత్మక శక్తితో కూడిన లిఖిత రూప వ్యక్తీకరణ వృద్ధి జరుగుతుంది.

**భాషాభిరుచి:** విద్యార్థికి భాషలో అభిరుచి కలిగి కృషి చేసి అభివృద్ధి సాధించడానికి వీలవుతుంది.

● మనసును ఒకదాని వైపు ఆకర్షింపజేసేది అభిరుచి. - రాస్

● అవధానం కలిగించడానికి మనకు నిరంతరం తోడ్పడే మానసిక ప్రక్రియ అభిరుచి. - బి.ఎన్.ఝా

స్పష్టీకరణలు:

● విస్తారంగా గ్రంథ పఠనం చేయడం

● సాహిత్య రచనల్లో పోలికలను గమనించడం

● సందర్భోచితంగా గ్రంథకర్తల రచనలను ప్రమాణంగా ఉదహరించడం

● ఉత్తమ పద్యాలను ధారణ చేసి పఠించడం

రసం: ఆస్వాదయోగ్యమైనది

**స్పష్టీకరణలు:** పాత్రౌచిత్యాన్ని తెలుసుకోవడం, శైలీ భేదాలను పరికించడం, ధ్వన్యర్థాలను గ్రహించడం

సంస్కృతీ సంప్రదాయాలు:

ప్రతి సమాజానికీ సంస్కృతీ సంప్రదాయాలుంటాయి. విద్యార్థులు మన సంస్కృతీ సంప్రదాయాలను గ్రహిస్తారు.

● రచనల్లోని కాలభేద ప్రభావాన్ని తెల్పడం ● పురాణేతిహాసాల్లోని విశేషాలు వివరించడం ● నీతిని గ్రహించడం

సృజనాత్మకత: విద్యార్థులు భాషణంలో, రాతలో సృజనాత్మకత ప్రదర్శిస్తారు

**స్పష్టీకరణలు:**

● స్వతంత్ర రచనలు చేయడం; ● శైలిలో ప్రత్యేకత చూపడం ● ఒక ప్రక్రియను వేరొక ప్రక్రియలోకి మార్చడం; ● నుడికారపు సొంపు ప్రదర్శించడం

**భాషాంతరీకరణం:**

మన భాషలోని భావాలను ఇతర భాషల్లోకి గాని, ఇతర భాషల్లోని భావాలను మన భాషలోకి అనువదించడాన్ని భాషాంతరీకరణం అంటారు.

**స్పష్టీకరణలు:**

● ఉభయ భాషల్లో వాక్య నిర్మాణ పద్ధతులను తెలుసుకోవడం.

● ఉభయ భాషల్లో సమానార్థక పదాలకు జాతీయాలను ఎన్నుకోవడం.

**సముచితమైన వైఖరులు**

ఒక వస్తువు, ప్రదేశాన్ని లేదా వ్యక్తిని గురించి ఏర్పడే ప్రత్యేక భావమే వైఖరి

**స్పష్టీకరణలు**

● సాహిత్య కృషిని ప్రోత్సహించడం

● ఇతర భాషల పట్ల గౌరవభావం కలిగి ఉండటం. ● సాహితీ వేత్తల పట్ల గౌరవభావం కలిగి ఉండటం.

● విమర్శనాత్మక దృష్టిని కలిగి ఉండటం.

### ఇవీ యక్ష ప్రశ్నలు... 9

91. జయించ శక్యంకాని శత్రువు ఏది?
92. అంతం లేని వ్యాధి ఏది?
93. సజ్జనుడు ఎవరు?
94. దుర్జనుడు ఎవరు?
95. మోహం ఏది?
96. మానం ఏది?
97. ఆలస్యం/ సోమరితనం ఏది?
98. శోకం ఏది?
99. స్థైర్యం అంటే?
100. ధైర్యం ఏది?



### సమాధానాలు

91. కోపం 92. లోభం 93. సమస్త ప్రాణాలకూ హితుడు 94. దయ లేని వాడు 95. ధర్మాలను తెలుసుకోకుండా ఉండటం 96. ఆత్మాభిమానం 97. ధర్మాచరణ లేకపోవటం 98. అజ్ఞానం 99. తన ధర్మంపై సందేహించకుండా ఉండటం 100. ఇంద్రియాల నిగ్రహం

గత డీఎస్సీ, పీజీటీ, టీజీటీ, టెట్ పరీక్షలను బట్టి చూస్తే ఈ విభాగం నుంచి తప్పనిసరిగా ప్రశ్నలు రావచ్చు. బోధనా పద్ధతుల్లో అతికీలకమైన విభాగం లక్ష్యాలు - స్పష్టీకరణలు. ప్రతి పదాన్నీ ప్రశ్నగా అడిగే అవకాశం ఉంది. అనువర్తిత ప్రశ్నలు ఈ విభాగం నుంచే ఎక్కువగా వస్తాయి కాబట్టి నిశితమైన పరిశోధనాత్మక అధ్యయనం చేస్తేనే విజయం సొంతమవుతుంది.

**- హేమ**

# అలంకార శాస్త్రం... అధ్యాపక అస్త్రం

త్వరలో యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్ (విశ్వవిద్యాలయాల నిధుల సంఘం) అధ్యాపక అర్హత పరీక్ష నెట్- జెఆర్ఎఫ్ నిర్వహించనుంది. రాష్ట్ర ప్రభుత్వం జూనియర్, సీనియర్ అధ్యాపకుల ఉద్యోగాల భర్తీ నేపథ్యంలో అలంకార శాస్త్రంలో 'కావ్యం- నాయికా నాయకులు' విశేషాలు తెలుసుకోవాలి.

కావ్యానికి ప్రధాన ప్రయోజనం ఆనందం, సందేశం లేదా ఉపదేశం. కావ్యం ఉపదేశాత్మకమై ఉండాలంటే ఆ కావ్యంలో నాయకుడు ఉత్తమ చరిత్ర కలిగినవాడై ఉండాలి. అందులోని ఇతివృత్తాన్ని నడిపిస్తూ ఆ ఫలాన్ని పొందే వాడవటం వల్ల నాయకుడికి ఆ పేరు, విశిష్టత కలిగాయి.

**విద్యానాథుని అభిమతంలో ఉత్తమ నాయకుని లక్షణాలు:** విద్యానాథుడు ఉత్తమ నాయకుని లక్షణాలుగా ఏడింటిని పేర్కొన్నాడు.

**1. కులీనత:** ఉన్నత కులంలో జన్మించిన వాడవటం
**2. మహిభాగ్యం:** భూమండలాధిపత్యం **3. ఔజ్జ్వల్యం:** చక్కని రూపం కలిగిన దేహం కలిగి ఉండటం. **4. ఔదార్యం:** దాన గుణం కలిగి ఉండటం. **5. తేజస్విత:** లోక ప్రకాశకత్వం కలిగి ఉండటం.
**6. ధార్మికత్వం:** ధర్మపరాయణత్వం కలిగి ఉండటం.
**7. వైదగ్ధ్యం:** కృత్య వస్తు కౌశలత్వం కలిగి ఉండటం. లాక్షణికులు ఈ ఏడు లక్షణాలకి మహామహిమత్వం, పాండిత్యమనే లక్షణాలను కూడా పేర్కొన్నాడు.

**విశ్వనాథుని అభిమతంలో...**

త్యాగి, కృతి, కులీనుడు, రూపయౌవనోత్సాహ సంపన్నుడు, దక్షుడు, అనురక్తి లోలుడు, తేజోవైదగ్ధ్య, శీలవంతుడైన వాడు నాయకుడని 'సాహిత్య దర్పణం'లో చెప్పారు.

**ధనుంజయుని అభిమతంలో...**

వినీతుడు, మధురుడు, త్యాగి, దక్షుడు, ప్రియంవదుడు, రక్తలోకుడు, శుచి, వాగ్మి, స్థిరుడు, రూపవంతుడు, యువకుడు, బుద్ధి, ఉత్సాహ స్మృతి, ప్రజ్ఞా కళామాన సమన్వితుడు, శూరుడు, దృఢుడు, తేజస్వి, శాస్త్ర చక్షువు, ధార్మికుడై నాయకుడు ఉండాలని దశరూపకంలో స్పష్టం చేశాడు.



విద్యానాథుడు 'ప్రతాపరుద్రీయం'లో నాయక గుణాలు చెప్పిన తర్వాత, యశఃప్రతాప సుభగత్వం, ధర్మకార్యార్థ తత్పరత, దురంధరత్వం, గుణాఢ్యత నాయక స్వరూప లక్షణాలని పేర్కొన్నాడు. భట్టుమూర్తి తన 'కావ్యాలంకార సంగ్రహం'లో కార్యావనత్వం, భూభారవహన క్షమబాహుత్వం' అనే వాటిని విద్యానాథుడు చెప్పిన వాటికి అదనంగా చేర్చాడు.

**నాయక భేదాలు:** ఆలంకారికులు పేర్కొన్న కావ్య నాయకులు నలుగురు 1. ధీరోదాత్తుడు 2. ధీరోద్ధతుడు 3. ధీరశాంతుడు 4. ధీరలలితుడు

**ధీరోదాత్తుడు:** ఆత్మశ్లాఘ లేనివాడు, క్షమావంతుడు, గంభీరుడు, బలశాలి, గూఢమైన కోపం కలవాడు, దృఢవ్రతుడు అయినవాడు ధీరోదాత్తుడు. ధీరోదాత్తుడు 'శృంగార', 'వీర' రసకావ్యాల్లో నాయకునిగా ఉంటాడు.

**ధీరోద్ధతుడు:** ధీరత్వంతోపాటు ఉద్ధతత్వం కలవాడు ధీరోద్ధతుడు. మాయాపరత్వం, ప్రచండత్వం, చపలత్వం, అహంకారదర్ప భూయిష్ఠత్వం, ఆత్మస్తుతి పరాయణత్వం లక్షణాలు కలిగిన నాయకుడు. వీర, రౌద్ర రస కావ్యాల్లో నాయకునిగా ఉంటాడు.

**ధీరశాంతుడు:** ధీరత్వం, శాంతత్వం, ప్రసన్నత్వం కలిగిన ద్విజాదికుడు ధీరశాంతుడని, ధీరప్రశాంతుడని కొందరంటారు. కులీనత్వాది నాయక సామాన్య గుణాలు కల ద్విజుడు ధీరశాంతుడని సాహిత్య దర్పణంలో పేర్కొన్నారు.

**ధీరలలితుడు:** నిశ్చింతుడు, మృదుస్వభావుడు, నిత్య కళానిరతుడు, రాజ్యకార్యాలను దక్షులైన మంత్రులకు వదిలి నిశ్చింతగా భోగలాలసుడైన రాజన్యుడు ధీరలలితుడు. కళానిరతుడు అంటే నృత్యగాన, చిత్రలేఖన, కవితాదులైన లలిత కళల్లో ఆసక్తుడని అర్థం. ధీరలలితుడు నాటికలలో నాయకునిగా ఉంటాడు.

**శృంగార నాయక భేదాలు:** శృంగార నాయకులు నలుగురు
1. దక్షిణుడు 2. అనుకూలుడు 3. ధృష్టుడు 4. శఠుడు

**దక్షిణుడు:** అనేక నాయికలందు సమానమైన అనురాగం కలిగి సంతుష్టులుగా ఏలుకొనేవాడు దక్షిణ నాయకుడు. శ్రీకృష్ణుడు దక్షిణ నాయకునిగా ప్రసిద్ధుడు.

**అనుకూలుడు:** ఒకే నాయికపైనే అనురాగం కలిగినవాడు అనుకూలుడు. శ్రీరాముణ్ని 'అనుకూలుడు'గా భావించవచ్చు.

**ధృష్టుడు:** అపరాధ మొనరించి శంకలేనివాడు, తర్జితుడయి లజ్జింపనివాడు, దోషం వ్యక్తమైనా అసత్యం చెప్పేవాడు ధృష్టుడు.

**శఠుడు:** నాయికకు మాత్రమే తెలిసేటట్లు అప్రియమాచరించే వాడు శఠుడు. శఠుడు ఆచరించే అప్రియం ప్రియురాలికే కాని ఇతరులకు తెలియదు. ధీరోదాత్తులు మొదలైన నాయకాదులు నలుగురు ఒక్కొక్కరు దక్షిణాది భేదాలచే నలుగురై మొత్తం పదహారుగురు అవుతారు. ఈ పదహారుగురు ఉత్తమ, మధ్యమ, అధమ భేదాల వల్ల 48 మంది అవుతారు.

**నాయికా భేదాలు**

నాయికా భేదాలు స్వీయ, అన్య, సామాన్య అని మూడు రకాలు.

**స్వీయ:** లజ్జ, ఆర్జవం, పాతివ్రత్యం, కోమలత్వం, సౌందర్యం కలిగి అగ్నిసాక్షిగా పెళ్లి చేసుకొన్న ఉత్తమురాలు స్వీయ.

**అన్య:** అన్య మరలా కన్య, అన్యోఢ అని రెండు విధాలు కన్య అనగా అవివాహిత. 'అన్యోఢ' అనగా ఇతరుని భార్య. ఏదోమిషతో అటుఇటు తిరుగుతున్నది, కులట, సిగ్గు విడిచింది 'అన్యోఢ' అని సాహిత్య దర్పణంలో స్పష్టం చేశారు.

**సామాన్య:** సామాన్య అంటే వేశ్య. ఈమె సర్వసాధారణ స్త్రీ. ధీరురాలు, కళాకుశల అయిన ఈమె సామాన్య అని 'సాహిత్య దర్పణం'లో పేర్కొన్నారు. 'ప్రహసనం'లో తప్ప మిగతా నాటక భేదాల్లో 'సామాన్య' అనురాగవతిగానే ఉంటుంది. 'మృచ్ఛకటికం'లో వసంతసేన 'సామాన్య'కు ఉదాహరణ.

**స్వీయ:** స్వీయ యౌవన సంబంధాన్ని బట్టి ముగ్ధ, మధ్య, ప్రౌఢ అని మూడు రకాలు.

**ముగ్ధ:** అప్పుడే అంకురించిన యౌవనం, మన్మథ వికారం కలిగి రతిలో ప్రతికూలత, మృదువైన ప్రణయకోపం కలది, అధిక లజ్జాసమన్విత కలది ముగ్ధ.

**మధ్య:** ప్రరూఢమైన యౌవనం, మదనవికారం కలది. ఇంచుక ప్రగల్భ వాక్కులు కలది. సామాన్యమైన లజ్జ కల నాయిక మధ్య.

**ప్రౌఢ:** సంపూర్ణ యౌవన, సమస్త రతికోవిద, ఉన్నత శృంగారభావ, అల్పలజ్జ, అక్రాంతనాయక అయినది ప్రౌఢ.

అనంతామాత్యుడు 'ప్రౌఢ' అన్నది ప్రౌఢ, ప్రగల్భ అని రెండు రకాలని పేర్కొన్నాడు.

**అష్టవిధ శృంగార నాయికలు:**

అవస్థాభేదాన్ని బట్టి నాయికలు స్వాధీన భర్తృక, వాసకసజ్జ లేదా వాసక సజ్జిక, విరహోత్క లేక విరహోత్కంఠిత, విప్రలబ్ధ, ఖండిత, కలహాంతరిత, ప్రోషితభర్తృక, అభిసారిక అని ఎనిమిది రకాలుగా ఉంటారు.

**స్వాధీన భర్తృక:** తనయందే అనురాగం కలిగి తనకు అధీనుడై ఉండే భర్త గలది. 'సత్యభామను' స్వాధీన భర్తృకగా భావించవచ్చు.

**వాసక సజ్జిక:** ప్రియుడు వచ్చే వేళకు తన గృహాన్ని అలంకరించుకొని సిద్ధంగా ఉండే వనిత.

**విరహోత్కంఠిత:** ప్రియుడు చెప్పిన వేళకు రాక ఆలస్యం అయితే ఉత్కంఠ దాల్చే వనిత.

**విప్రలబ్ధ:** సంకేత స్థలానికి వెళ్లగా అక్కడ ప్రియుడు కనపడక ఆర్తి చెందే నాయిక.

**ఖండిత:** ప్రియుడు అన్యకాంతతో రాత్రంతా క్రీడించి వేకువనే ఇంటికిరాగా సంభోగ చిహ్నాలు చూసి కుందేది.

**కలహాంతరిత:** ప్రియుని నిందించి వెళ్లగొట్టి తర్వాత పశ్చాత్తాపం పొందేది.

**ప్రోషితభర్తృక:** ప్రియుడు పరదేశ గతుడైనప్పుడు విరహంతో కృశించిపోయే నాయిక.

**అభిసారిక:** మదనార్తయై ప్రియుని వద్దకు తానే స్వయంగా పోవు నాయిక. ఈ అభిసారిక మూడు రకాలు.

1. జ్యోత్స్నాభిసారిక 2. తమోభిసారిక 3. దివసాభిసారిక

ఈ విధంగా శృంగార నాయికలు ఎనిమిది మందిగా ఆలంకారికులు గుర్తించారు. కావ్యశాస్త్రంలో భాగంగా పోటీ పరీక్షల్లో ఎక్కువగా అడుగుతున్న విశేషాలివి...

**చక్రవాళం:** చక్రవాళంలో మొదట ఒక పద్యం తరువాత 8 దళాలు గల కళిక ఉంటుంది. ఈ రెండు ముక్తపదగ్రస్తాలు, సంబోధనాంతాలై ఉంటాయి.

**మంజరి:** స్త్రీ శృంగారం, విరహం, వసంత మన్మథ విజృంభణం, వన జలక్రీడలు మొదలైనవి గల కావ్యం మంజరీకావ్యం.

**తారావళి:** ఒక్కొక్క పద్యంలో ఒక్కొక్క నక్షత్రం పేరు వచ్చేట్లు 27 పద్యాలుగా రాస్తే అది 'తారావళి' అవుతుంది. తొమ్మిది పద్యాలు గల కావ్యానికి రత్నావళి అని, అయిదు పద్యాలు గల కావ్యానికి పంచాననావళి' అని పేర్లు. క్రమంగా వీటిని నవరత్నాలు, పంచరత్నాలుగా పిలుస్తున్నారు.

**ఖండకావ్యం:** మహాకావ్య లక్షణాల్లో ఏకాదేశాన్ని మాత్రం గ్రహించి రచించిన కావ్యం ఖండకావ్యం. ఉదా: మేఘసందేశం.

**కోశం:** అన్యోన్యాపేక్షకాలైన శ్లోకాల సమూహాన్ని కోశం అంటారు.

**వాకోవాక్యం:** ఉక్తి ప్రత్యుక్తి రూపాలైన వాక్యోపవాక్యాలతో కూడి ఉండేది.

| పద్యాల సంఖ్యను బట్టి అప్పకవి పేర్కొన్న విశేషాలు | |
|---|---|
| ముక్తకం | ఒక పద్యం |
| ద్వికం | 2 పద్యాలు గల కావ్యం |
| త్రికం | 3 " " |
| వారణమాల | 8 " " |
| భాస్కరమాల | 12 " " |
| శశికళ | 16 " " |
| త్రింశత్తు | 30 " " |
| పంచాశత్తు | 50 " " |
| శతకం | 100 " " |
| అష్టోత్తరశతి | 108 " " |
| పంచశతి | 500 " " |
| సప్తశతి | 700 " " |

**గాథ:** జననీ జనకులు, పితృదేవతలు, భూదేవి మొదలగు వారిని గురించి చేసే స్తోత్రానికి 'గాథ' అని పేరు.

**దండకం:** ఇది స్తోత్ర రూపమైన కావ్యం. దండకం సాధారణంగా భక్తిరసమయమై ఉంటుంది. ఇందులో త, న, స, హ గణాలలో మొదట ఏదో ఒక గణం ఉండి తరువాత ఎక్కువ త గణాలు ఉంచి చివర ఒక గురువు ఉంచాలి. దండకంలో యతి, ప్రాసల నియమం లేదు.

**గద్యకావ్యాలు:** గద్యకావ్యాలు నాలుగు రకాలు

1. ముక్తకం: సమాసాలు లేని గద్యం
2. వృత్తగంధి: వృత్త భాగవంతమైన గద్యం
3. ఉత్కళికాప్రాయం: దీర్ఘ సమాసాలతో కూడిన గద్య రచన
4. చూర్ణిక: అల్ప సమాసాలతో కూడిన గద్య రచన.

**ఆఖ్యాయిక:** ఉచ్ఛ్వాసాది విభాగాలు, మధ్యమధ్య ఇతరుల పద్యాలుంటే అఖ్యాయిక అంటారు.

**ఖండ కథ:** ఏకదేశ వర్ణన గల గద్య ప్రబంధం.

**- సాయి మనస్విని**

# బామ్మ గారి దీపావళి

ప్రతి ఏడాదీ వచ్చి కాంతులు విరజిమ్మి, ఆనందం పండించి వెళ్లిపోయే పర్వదినం-
బామ్మగారు ఒక్కరే ఆ చిన్న ఇంట్లో ఉంటున్నారు. తను వచ్చిన కొత్తలో అక్కడ అంతగా ఇళ్లు లేకపోయినా, తరువాత తరువాత బోలెడన్ని వచ్చేశాయి.
హడావుడి పెరిగింది. పొద్దున్నే పాలబ్బాయి, పేపరబ్బాయిల కేకలు, పాఠశాలలకు పరుగులెత్తే పిల్లల కేరింతలు... ఒకటా? రెండా?



'ఈ రోజు దీపావళి'. బామ్మగారి కళ్లు చెమ్మగిల్లాయి. ఇంత పెద్ద విజయవాడ నగరంలో ఓ ఇంట్లో ఒంటరిగా.

బామ్మగారు ఈ ఇంటికొచ్చి పదేళ్లు దాటిపోయింది. అంతకుముందు పక్కనే చిన్న పల్లెటూరులో, పెద్దమేడలో ఉండేవాళ్లు. భర్త, నలుగురు పిల్లలు, ముసలి అత్తగారు, పెళ్లయి భర్తకు దూరంగా ఉంటున్న ఆడపడుచు, మరిది సంసారం. వచ్చిపోయే బంధువర్గం. ఉదయం లేచిన దగ్గర్నుంచీ రాత్రి పొద్దుపోయే వరకూ ఏదో ఒక పని. తన కోసమంటూ పెద్దగా సమయం చిక్కేది కాదు. ఆ రోజుల్లో దీపావళి అంటే- అబ్బో, ఇంటినిండా జనం. పసిపిల్లలతో సహ బంధువులు దిగిపోయేవారు ముందే. పిల్లల కేరింతలు ఏడుపులు, తగాదాలు, పితూరీలు... సర్దిచెప్పడాలు... పురుష జనాభా గ్లాసులకొద్దీ కాఫీలు, టీలు సేవించడాలు, చేగోడీలు, జంతికల్లాంటివి ఏవో ఒకటి నోట్లో పడేస్తూ కబుర్లు చెప్పుకోవడాలు... ఆడపిల్లలు చక్కగా తలంట్లు పోసుకుని పట్టుపరికిణీలు కట్టుకుని దీపాలు వెలిగించడం, బాణసంచాను అందరికీ పంపకాలు చేయడం... సందడే... సందడి.

ఇప్పుడు-

పిల్లలకు పెద్ద పెద్ద ఉద్యోగాలు... ఉద్యోగాలు చిన్నవైనా పెద్దపెద్ద ఊర్లు... పెళ్లిళ్లయి ఎక్కడెక్కడో... ఫోన్లు ఎక్కువవడం చేత పలకరింపులైనా మిగిలున్నాయి. అందరూ వెళ్లిపోతే ఆ లంకంత కొంప ఎందుకని, బంధువులంతా విజయవాడలో ఉన్నప్పుడు అక్కడెందుకని, విజయవాడలోనే ఓ చిన్న ఇల్లు తీసుకున్నారు. కాలం ఎగిరి వెళ్లిపోతోంది. దాని రెక్కలు కత్తిరించి ఎగరకుండా చేయాలనిపిస్తుంది అప్పుడప్పుడు.

పిల్లలు దూరంగా వెళ్లాల్సి వచ్చింది తనంటే ప్రేమలేక కాదు. తమతో ఉండమంటూ ఉంటారు.- 'ఒక్కదానివీ అక్కడెందుకు మాతో ఉండొచ్చు కదా అని'. అయితే అందరివీ బదిలీలుండే ఉద్యోగాలు. వాళ్లతోపాటు ప్రతి ప్రదేశానికీ వెళ్లడం, అక్కడి వాతావరణానికి సర్దుబాటు చేసుకోవడం కష్టమనిపించింది. ఆ మార్పులు నచ్చలేదు. వయసు పెద్దది కావడం చేతనేమో ఆ జీవన విధానం, ఉరుకులూ పరుగులూ నచ్చలేదు. తనుండే ఈ గూడే బావుందనిపించింది. ఒంటరిపక్షిగా ఉండటమే నయమనిపించింది.

'నువ్వు ఒక్కదానివీ ఉండలేవు' బతిమాలారు కొడుకులూ, కోడళ్లు... ఎందుకో తనే ఒప్పుకోలేదు.

అంతా ఎక్కడెక్కడో ఉంటున్నా తమ పనిమనిషి మనవరాలు రాజీ మాత్రం తనని వదల్లేదు. తనతోబాటే ఉండకపోయినా ఉదయమే వచ్చి వంట చేయడం, పాత్రలు శుభ్రం చేయడం... ఏమైనా శ్రమ తెలీకుండా చేస్తోంది. దాని మొగుడు దగ్గర్లో ఏదో మిల్లులో పని చేస్తాడు.

'ఎలా ఉన్నావు' అని పిల్లలు ఫోన్లో తరచూ అడిగినప్పుడు, 'నాకేం సొంత ఇంట్లో బానే ఉన్నాను. రాజీ ఉండనే ఉంది. మీరేం కంగారు పడొద్దు' అనడం అలవాటైపోయింది.

ఒక్క కూతురు కూతవేటు దూరంలోనే ఉంటుంది. వాళ్లు తరచూ వస్తూపోతూ ఉంటారు. వచ్చినప్పుడల్లా పండ్లు, కూరగాయలు ఏదో ఒకటి పట్టుకొస్తుంటారు.

మొన్నీ మధ్యే-

అల్లుడు గారికి బెంగళూరు బదిలీ అయింది. చుట్టుపక్కల వాళ్లు పలకరిస్తుంటారు. కానీ ఎవరి హడావుడి వారిది. ఉద్యోగాలు, పిల్లల చదువులు, ఆరోగ్యాలు... ఎన్ని చూసుకోవాలి.

బామ్మగారికి డబ్బు ఇబ్బంది ఏమీ లేదు. నెల తిరిగేసరికి నలుగురు కొడుకులూ తన బ్యాంకు ఖాతాలో డబ్బులు జమ చేసేస్తారు. కొడుకులు, కోడళ్లూ ఉద్యోగస్థులే కావడంతో, దేవుడి దయవల్ల ఎవరికీ డబ్బు ఇబ్బందులు లేవు. ఎవరెంతిస్తున్నారన్న ఆరాలూ లేవు.

'... అన్ని రకాలుగా బానే సాగిపోతోంది జీవితం. హాయిగా వెళుతున్నట్లే లెక్క' అనుకుంటూంది బామ్మ. నెమ్మదిగా మంచం మీద నుంచి లేచింది. కాస్త నడుం నొప్పి అలాగే మోకాళ్లనూ. సహజమే డెబ్బైఏళ్ల వయసులో... ఏదీ తీవ్రంగా అనిపించట్లేదు. ఆరోగ్యం బావున్నట్లే అనుకోవాలి.

పనమ్మాయి రాజీ తలుపుకొట్టిన శబ్దం.

కథ

బామ్మ బద్ధకంగా వెళ్లి తలుపు తీసింది.

వంట గదిలో పాత్రల చప్పుళ్లు... కుళాయి నుంచి నీళ్ల శబ్దం. చకచకా పనులు కానిస్తోంది రాజీ.

రోజూ రాజీ రాకకోసం ఎదురు చూస్తుంటుంది బామ్మ. విజయవాడ దగ్గర పల్లెటూరిలో ఉన్న రోజుల్లో రాజీ వాళ్ల అమ్మ బామ్మ గారింట్లో పనిచేసేది. అప్పుడు రాజీ పసిపిల్ల. ఇప్పుడో- తన మనవరాలు సునీతతో సమానంగా ఎదిగింది అది. రాజీ నవ్వు బామ్మకు ఎంతిష్టమో చాలా ముచ్చటగా అనిపిస్తుంది.

"... ఈ గిన్నెలూ అవీ కడిగేసి వెళ్లిపోతాను. రెండు రోజులు రాలేను. ఊరికెళుతున్నాను అమ్మ దగ్గరికి. నువ్వు ఒక్క దానివే ఉంటావు పండుగ రోజున అని మానలేక వచ్చాను ఈ పూట"

"అలాగేలే... ఊరు వెళ్లడం లేదన్నావు."

"అన్నాను... కానీ"

"అమ్మను చూడాలనిపించింది కదూ..."

రాజీ నవ్వింది.

"నాకు తెలుసు... ఇదిగో ఫ్రిజ్‌లో పండ్లు అవీ ఉన్నాయి. అమ్మకు తీసికెళ్లు. ఇదిగో ఈ డబ్బుంచు. ఖర్చులకుంటాయి." అని ఓ రెండొందలు చేతిలో పెట్టింది.

రాజీ కూడా ఊరెళ్లిపోతోందని తెలిసి ఒంటరితనం బాగా తెలిసింది బామ్మకు.

పండుగ రోజు. అందులోనూ దీపావళి. రాజీ ఉంటే అదో సందడి. దీపాలు వెలిగించడం. దాని పిల్లలు వచ్చి బాణసంచా కాల్చడం...

పాపం దానికీ వాళ్లమ్మ దగ్గరికి వెళ్లాలని ఉంటుంది కదా, తనే సమాధానపరుచుకుంది.

రాజీ వెళ్లాక తలుపు వేసి వచ్చిన కాసేపటికి మళ్లీ తలుపు కొట్టిన శబ్దం.

'ఎవరై ఉంటారు' అనుకుంటూ వచ్చి తలుపు తీసింది.

అంతే.

ఆ... శ్చ... ర్యం...

తన మనవరాలు సునీత... చేతిలో బ్యాగు కింద పడేసింది.

బామ్మను గట్టిగా కౌగిలించుకుని ముద్దు పెట్టుకుంది. ప్రేమతో ఉక్కిరి బిక్కిరి చేసేసింది.



'మా బామ్మ' అంటూ కూడా వచ్చిన ముగ్గురు స్నేహితురాళ్లకు పరిచయం చేసింది.

వాళ్లు నమస్కారం చేసి బామ్మ దగ్గరగా వచ్చి ఆప్యాయంగా, "మీ గురించి సునీత చాలాసార్లు చెబుతూ ఉంటుంది" అన్నారు.

బామ్మ కళ్లల్లో నీటిబొట్టు. ఎంత సంతోషమో. ఈ దీపావళి ఒంటరిగా గడపాల్సి వస్తుందేమోనని అనుకుంది. అనుకోవడం కాదు అదో బెంగ.

"బామ్మా... దీపావళికి వారం రోజులు సెలవులిచ్చారు. కాలేజీ హాస్టల్లో ఉండటం ఇష్టం లేక ఇంటికెళ్లడం కంటే నీతో గడపాలనిపించి ఇటొచ్చేశాం" ఉత్సాహంగా కళ్లు చక్రాల్లా తిప్పుతూ మరీ చెప్పింది.

బామ్మ మనవరాలి చలాకీతనానికి మురిసిపోతుంటే, "నిన్నేం ఇబ్బంది పెట్టడం లేదు కదా ఇలా దండయాత్ర చేసి" అనేసింది.

"అదేమిటే అలాగంటావు", అని మురిపెంగా కొట్టబోయింది బామ్మ.

"ఏం పర్లేదు. నీకు నీరసం అనిపిస్తే విశ్రాంతి తీసుకో. మేం వంటలో మా నైపుణ్యం చూపించేస్తాం... అలాగేనా"

"బెంగపోయింది" అంది బామ్మ

"దేనికీ బెంగ"

"దీపావళికి రాజీ కూడా లేదు... ఒకర్తినే ఉండాల్సి వస్తోందని"

అమ్మాయిలు గలగలా కబుర్లు చెబుతూ బామ్మకు సంతోషం కలిగిస్తున్నారు.

పాతరోజుల్లో వయసులో ఉన్న పిల్లల్ని దగ్గరకు తీసుకోవడం, ముద్దు పెట్టుకోవడం లాంటివి ఉండేవే కాదు. కాళ్లను ముట్టుకుని నమస్కారం చేయడం తప్ప.

ఈ రోజుల్లో యువత 'ఆధునికం' అని, 'ఇదే అవసరం' అనీ అంటోంది. బామ్మ ఈ విషయంలో వాళ్లతో ఏకీభవిస్తుంది. నేటి తరానికి అనుకూలంగానే మారింది.

దినచర్యల్లో పెద్దగా మార్పులు లేకపోయినా, అంతోఇంతో ఆంగ్లం నేర్చుకుంది. కానీ తెలుగును తెలుగు సంస్కృతినీ నెమరు వేసుకుంటూనే ఉంటుంది. తెలుగు భాష మీద ప్రేమతో ఆ పుస్తకాలనూ వదల్లేదు. అది తన నుంచి తన పిల్లలకు, వాళ్ల నుంచి వాళ్ల పిల్లలకు... పెంపకాల్లోనూ కనిపిస్తుంది. అందులో సునీతలో బాగా కనిపిస్తుంది. చదువులు ఆంగ్ల మాధ్యమంలోనైనా తెలుగు ఎంత బాగా వచ్చో. అక్షరాలు ముత్యాల్లా ఉంటాయి.

బామ్మతో సర్దుబాట్ల విషయంలో ఎలాంటి ఇబ్బందులూ ఉండవు కనుకే సునీత తన స్నేహితురాళ్లను కూడా తీసుకురాగలిగింది. ఆధునిక దుస్తుల్లో వచ్చినా పట్టుపరికిణీలు, ఓణీలు తెచ్చుకున్నారు. ఒకరిద్దరి దగ్గర లేకపోతే సునీతే వాళ్లకి తనవిచ్చింది.

బొబ్బట్లు, పులిహోర, అన్నం,

పాయసం... జాబితా చదవడం ప్రారంభించింది సునీత... 'నువ్వేది కావాలంటే అది' అంది.

"మీరు చేయడమేమిటి... నేను చేస్తానులే" అంది బామ్మ.

"అదేం కుదరదు. నీకు విశ్రాంతి. వంటగదిలో కుర్చీ వేస్తాను. అందులో కూర్చుని మేం ఎలా చేస్తామో చూడు, 'మా ఇంటి వంట' కార్యక్రమం అన్నమాట. రుచి చూసి బహుమతి ప్రకటించు. ఏం..."

బామ్మ మనవరాలి హడావుడికి ముగ్ధురాలైంది.

"గుత్తొంకాయ కూర, ముక్కల పులుసు, కొబ్బరికాయ పచ్చడి, మెంతి మజ్జిగ... ఇష్టమేనా"

"పోనీ ఆ కూరలైనా నాకొదిలి పెట్టవే" అంది బామ్మ.

"కుదరదు...కుదరదు"

"స్నేహ, రవళి, గాయత్రీ ఇలా రండి... మనం వస్తుంటే దార్లో కనబడలేదూ, ఆ కొట్టుకెళ్లి ఓ కొబ్బరికాయ, లేత వంకాయలు ఓ కిలో పట్రండి... త్వరగా" అని ఆదేశాలు జారీ చేసింది సునీత.

"నువ్వేం చేస్తావు... రా మాతోకూడా"

"మీరొచ్చే సరికి స్నానం చేసి సిద్ధంగా ఉండొద్దూ" అంటూ తువ్వాలందుకుని స్నానాల గదిలోకి వెళ్లింది. స్నేహితురాళ్లు బుట్ట పట్టుకుని బయటకు నడిచారు.

బామ్మగారి ముఖంలో కళ గోదావరి నీటిమట్టంలా పెరిగిపోతోంది. వాళ్ల నవ్వులు, వాళ్ల మాటలు... చాలా నచ్చాయి. 'మంచి పిల్లలు... మంచి మొగుళ్లొచ్చి, పిల్లాపాపలతో సుఖంగా వర్ధిల్లాలి' మనసులోనే నిండుగా దీవించింది.

* * *

"బామ్మా... నీకు తెలుసా. రవళి బాగా పాడుతుంది. స్నేహ మంచి కవయిత్రి, గాయత్రి గిటార్ బాగా వాయిస్తుంది. నీకు కచేరి ఉంది సాయంత్రం..." నవ్వుతూ చెప్పింది సునీత.

"అలాగా... బావుంటే" అంటూ 'ఏమైనా ఈ కాలం పిల్లలు తెలివైన వాళ్లు. అన్నింట్లోనూ ప్రావీణ్యం ఉంటోంది' అనుకుంది మనసులో.

"మా బామ్మ దారే వేరు. మా కాలంలో... మా కాలంలో అంటూ నసపెడుతూ, గొప్పలు చెబుతూ మనల్ని బాధించదు. మనతో హాయిగా కలిసిపోతుంది. ఆధునిక బామ్మ సునీత నవ్వుతూ అంది.

"ఈ దీపావళి శుభ సందర్భంగా మనం తెచ్చిన చీర ఇప్పుడు బామ్మ కట్టుకుంటుంది" అంటూ బయటకు తీసింది.

"ఏమిటే సునీతా... ఇదేం బాగాలేదు"

"లేదు... ఈ చీర చాలా బావుందని నువ్వే అంటావు"

"నేను నీ తీరు బావులేదంటున్నాను"

"నువ్వు వెంటనే కట్టుకోకపోతే, నీ తీరు బావుండలేదేమిటని మేమనుకుంటాం... మా కోసం...", బతిమాలింది.

స్నేహితురాళ్లూ పట్టుబట్టారు.

బామ్మ ఒప్పుకోక తప్పలేదు.

పిల్లలు వచ్చినప్పట్నుంచీ గంటలు క్షణాలైపోతున్నాయి.

అంతా దీపాల కాంతులు...

నిజమే-

**"ఒకరోజు మితిమీరిన ఆనందం... మరో రోజు దిగులు... ప్చ్... అదే జీవితం కాబోలు... దీపావళి నాడు దీపాలు వెలిగించకపోతే, ఒకవేళ వెలిగించినా చూడ్డానికి నా అన్నవాళ్లు చుట్టూ లేకపోతే, అది పండుగవుతుందా..."**

'ఆ కాంతులు తమ ఇంట్లో తీసుకొచ్చింది పిల్లలే. పెద్దల కళ్లల్లో కాంతులీన్నీ, గుండెల్లో సంతోషాన్ని నింపేది పిల్లలే. వారి సంతోషాలతో, సరదాలతో, ఆటపాటలతో మన వయసును వెనక్కి తీసికెళతారు... ఒంట్లో కొత్త శక్తిని నింపుతారు' అనుకుంది బామ్మ.

'మరో రెండు రోజులే వాళ్లుండేది' అన్న వాస్తవం గుర్తుకు రాగానే ఏదో దిగులు. ప్రతిరోజూ ఒకేలా గడవదు.

'ఒకరోజు మితిమీరిన ఆనందం... మరో రోజు దిగులు... ప్చ్... అదే జీవితం కాబోలు... దీపావళి నాడు దీపాలు వెలిగించకపోతే, ఒకవేళ వెలిగించినా చూడ్డానికి నా అన్నవాళ్లు చుట్టూ లేకపోతే, అది పండుగవుతుందా...'

ఏదో ఆలోచన... ఇల్లు బోసిపోతుంది. ఎంత మార్పు?

దీపావళి ఎంతో గొప్పగా గడిచిపోయింది... బామ్మ ముఖంలో వెయ్యి మతాబుల కాంతి.

మర్నాడు-

బామ్మ వరండాలో కూర్చుని ఉంది. అయితే నిరుత్సాహం ముఖంలో కనిపిస్తూనే ఉంది- గుండెనెంత దిటవు చేసుకోవాలని ప్రయత్నించినప్పటికీ.

సునీత బామ్మ మనసు కనిపెట్టక పోలేదు.

"నీకో శుభవార్త" అంటూ మెడ మీద నుంచి రెండు చేతులూ వేసింది వెనగ్గా వచ్చి.

ఏమిటన్నట్లు చూసింది.

"నీకూ రైలు టిక్కెట్లున్నాయి... రేపు మాతో ప్రయాణానికి"

"ఎక్కడికీ" ఆశ్చర్యపోయింది.

"ఢిల్లీకి. అమ్మనాన్నల దగ్గరికి"

"నువ్వెళ్లేది చెన్నైకి కదా"

"మా బామ్మను తీసికెళ్లి బంగారంలా చూసుకోమని ఇంట్లో జాగ్రత్తలు చెప్పి, నాలుగు రోజులుండి ఆ తరువాత చెన్నైకి. నా స్నేహితురాళ్లు మాత్రం నేరుగా చెన్నై వెళ్లిపోతారు."

"నేనిప్పుడు..."

"ఆఁ... ఏం పనులు చేసేయాలో ఇక్కడ"

"అని కాదు..."

"పప్పులేం ఉడకవు నా దగ్గర... ప్రయాణానికి సర్దుకోవాలి పద... పద", అంటూ బామ్మను లోపలికి తీసుకెళ్లింది.

దీపావళి అయిపోయినా ఆ రోజు కురిసిన ఆ వెలుగులు బామ్మ ముఖంలో ఇంకా కనబడుతున్నాయి. అవి సంతోషం వల్ల కలిగినవి, మనవరాలి ప్రేమ వల్ల వెలిగినవి... నాకు నా వాళ్లంతా ఉన్నారనే ఆలోచనల చమురు వల్ల నిలిచిపోయినవి. ఎప్పుడు రమ్మని అన్నా 'ఎందుకులే నేను... ఇక్కడ బానే ఉంది' అని సర్దుకుపోయే మనస్తత్వం వదిలేసినందు వల్ల బామ్మ ముఖంలో ఆ కాంతి... కొత్త కాంతి.



**మంత్రవాది మహేశ్వర్**
హైదరాబాద్. 94414 20962




ముద్దులొలికే చిన్నారి కనిపిస్తే బుగ్గలు చిదిమి, నీ పేరేంటీ అని అడుగుతాం. ఆ పేరు కొత్తగా ఉంటే భలే ఉందే అనుకుంటాం. ఇక మన ఇంట్లోనో, తెలిసిన వాళ్ల బుజ్జాయిలకో చక్కటి పేరు పెట్టడం కోసం ఎంతో ఆలోచిస్తాం. ఎందరినో సంప్రదిస్తాం. కొంత మందికైతే కొత్త పేర్లు తయారు చేయడమో సరదా! ఇలా మీరు పెట్టిన లేదా సేకరించిన కొత్త తరహా పేర్లను మాకు పంపండి. వాటికి అర్థవివరణ కూడా రాయండి. తేట తెలుగులో, కొత్తగా, సృజనాత్మకంగా ఉండాలి. తేటతెలుగులో సృజనాత్మకంగా ఉన్న ఎంపిక చేసి, మీ పేరుతో 'తెలుగు వెలుగు'లో ప్రచురిస్తాం. మీరు పెట్టే పేర్లు వేలాది తెలుగిళ్లలో మార్మోగే అవకాశం ఇది...

ఇష్మ = ఆకాంక్ష;
ఈహాత్రయి = పరిశుద్ధురాలు
ఉత్కళిక = మొగ్గ;
ప్రహర్షిణి = సంతోషకరమైనది;
శైలూష = ప్రత్యూషం
శైవల్య = ప్రవహించేది, స్రవంతి

**- బి.కళాగోపాల్,** నిజామాబాదు

చైత్రిక = ఒక తెలుగు నెల
పల్లవిత = లేలేత చిగురు
ప్రణీతి = అగ్ని
లోహిత = కెంపు
వినమ్ర = వినయవతి
హవణిక = అలంకారం

**- వేల్ముల రాంరెడ్డి,** పూడూరు, కరీంనగర్

# తెలుగు పతాకాన్ని ఎగరేద్దాం



పెనంలోంచి పొయ్యిలోకి పడింది తెలుగు. ఆంగ్ల ప్రభువుల రాజ్యంలో రాజాశ్రయానికి దూరమై... ప్రాణాలుగ్గబట్టుకుని బతికింది మన భాష. ఎర్రకోటపై త్రివర్ణ పతాకం రెపరెపలాడిన క్షణాన... ఇక నుంచి తెలుగు నేలపై తెలుగే కనిపిస్తుందని, వినిపిస్తుందని ఆశించారు ఆనాటి భాషాభిమానులు. కానీ, వారి ఆశలు గొంతెమ్మ కోర్కెలే (కొందరి దృష్టిలో) అయ్యాయి. తెలుగు గడ్డను తెలుగు వారే ఏలుతున్న ఈ కాలంలో పరిస్థితి ఎంతదాకా వచ్చిందంటే... అందమైన అజంత భాష జనాశ్రయానికీ దూరమవుతోంది.

**నీటిలో చెడుగు నానాట నెరింగియు**
**వదలవీల్పడని చేపల విధాన!**
**అంతకుండని నరునెంతయు దెలియుచు**
**జతనుండు పెంపుడు జంతుసరణి!**
**ఉష్ణాంశు వెండించుటూహకు దోచియు**
**వెల్గుగోరెడి వృక్షవితతి పోల్కి!**
**చంద్రహాసము మృతి సాధనంబనుచును**
**తొలగింపలేని రాజుల తెరంగు!**

**ఆంగ్లభాష మృషాకాలయాపనంబు**
**దండుగంచును సభలనెంతయు వచించి**
**ఆచరణమందు భీరువులలసులైరి**
**మాతృభాషాభివృద్ధికి మార్గమేమొ?**

గద్వాల రాజాస్థాన కవిగా ఉంటూ 1930 - 40 ప్రాంతాల్లో తన అవధానాలతో ప్రజల ఆదరాభిమానాలను పొందిన గాడేపల్లి వీరరాఘవశాస్త్రి చెప్పిన పద్యమిది. ఆనాడు... తెల్లదొరల పాలనలో నిరాదరణకు గురవుతున్న తెలుగును చూసిన వేదనలోంచి పుట్టుకొచ్చిన అక్షరాలివి. ఏడు దశాబ్దాలు గడిచిపోయాయి. పాలనాపగ్గాలు మన చేతికొచ్చాయి. అయినా... పరిస్థితిలో మార్పు వచ్చిందా? ఎవరిదీ పాపం?

తెలుగుతల్లి చేసుకున్న పుణ్యమో ఏమో కానీ ఆ రోజుల్లో కొందరు మాన్యులు పుట్టారు. ఊరూరా తిరుగుతూ అవధానాలు చేస్తూ సామాన్యుల్లో భాషపై అనురక్తి పెంచారు. తిరుపతి వేంకటకవులు, కొప్పరపు కవులు, వేంకట రామకృష్ణ కవులు, కాశీ కృష్ణాచార్య, గాడేపల్లి వీరరాఘవశాస్త్రి, వేలూరి శివరామశాస్త్రి, గడియారం వేంకటశేష శాస్త్రి, దుర్భాక రాజశేఖర శతావధాని, తిరుమల బుక్కపట్టణం శ్రీనివాసాచార్యులు వంటి వారందరూ చేసిన కృషి... కానికాలంలో కూడా తెలుగును వెలిగించింది. మరి నేడు ఇంకా చీకటియుగంలోకి వెళ్లిపోయాం! ఇప్పుడెవరు భాషకు కాపుగాస్తారు? ఆనాటి మహానుభావుల వారసత్వాన్ని పుణికిపుచ్చుకున్న కొందరు ప్రతిభావంతులు ఇప్పటికీ భాషకు సేవ చేస్తున్నారు. కానీ, తెలుగుకు జవసత్వాలద్దడానికి అది సరిపోదు. చుక్కా చుక్కా కలిసి మహాప్రవాహం అయినట్లు భాషాభిమానులందరూ కలిసి మహోద్యమాన్ని నిర్మించాలి. ఊరూరా తెలుగు పతాకాన్ని ఎగురవేయాలి.

**- జి.సుబ్రహ్మణ్యశాస్త్రి**
నంద్యాల

# నవ్వండి బాబూ నవ్వండి!

ఎవరైనా దిగాలుగా ఉంటే కొంచెం నవ్వరా బాబూ... ఏదో ఉపద్రవం ముంచుకొస్తున్నట్లు నువ్వూ, నీ మొహమూనూ? అంటాం. అంటే ఓ వ్యక్తి నవ్వుతూ, సంతోషంగా ఉన్నాడంటే అతను కులాసాగా ఉన్నట్లే. ఎవరినైనా వర్ణించేటప్పుడు ఫలానా వాళ్లది నవ్వుమొహం అని ముఖవిలువను కూడా ప్రకటిస్తాం. ఎవరినైనా చూసి ఒక నవ్వు విసరండి. వాళ్లూ చిరునవ్వు చిందిస్తారు. నవ్వు కూడా ఒకరి నుంచి ఒకరికి వ్యాపిస్తుంది. ఎంత కోపంగా ఉన్నవారినైనా ఒక్కటంటే ఒక్క చిరునవ్వుతో శాంతపరచవచ్చు. నవ్వు మహత్తే అంత.

చరాచర ప్రాణికోటిలో మనసారా నవ్వగలిగేది కేవలం మానవుడే. అందుకే మధుర శ్రీనాథ జాషువా "నవ్వవు జంతువుల్ నరుడు నవ్వును, నవ్వులు చిత్తవృత్తికి దివ్వెలు..." అనే పద్యంలో "జంతువులు నవ్వవు, కేవలం మానవుడే నవ్వుతాడు. నవ్వులు మనుషుల మనస్తత్వానికి నిదర్శనాలు. అన్ని నవ్వులూ ఒకేలా ఉండవు. కొన్ని నవ్వులు ఎటూ తేలవు, కొన్ని విషంతో నిండి ఉంటాయి. నాకు మాత్రం పువ్వుల్లా ప్రేమరసాన్ని చిందించే స్వచ్ఛమైన నవ్వులే కావాలి, ఆ నవ్వు వల్లే నాకెన్నడూ వ్యాధులు సోకవని" నవ్వు గొప్పదనాన్ని అందంగా వెలయించారు.



అయితే కొన్ని రకాల జంతువులూ నవ్వుతాయని శాస్త్రజ్ఞుల ఉవాచ. నవ్వగలగడం మనిషికి వరం. ఛలోక్తులు, కితకితలు, వ్యంగ్యం, హాస్య సన్నివేశాల వల్ల సాధారణంగా నవ్వు పుట్టినా, కొన్నిసార్లు ఎదుటి వ్యక్తి అపహాస్యం పాలైనపుడు కూడా హాస్యం పుడుతుంది. బోసినోటి పాపాయి నుంచి బోడిగుండు తాతయ్య వరకూ అందరూ నవ్వు ముఖాలను చూసి ఆనందించేవారే. కడకు 'నీ నగు మోము గనలేని...' అంటూ భగవంతుడినీ నవ్వు ముఖంతో దర్శనం ఇమ్మంటాడు భక్తుడు.

నవ్వును చాలా ఆత్మీయంగా ఆస్వాదించారు మనవాళ్లు. మరెంతో ప్రేమతో ఆహ్వానించారు కవులు. అందుకే కావ్య నాయికలను 'చంద్రాస్య హేలా గతిన్' అన్నారు. నవ్వితే నవరత్నాలు దొర్లుతాయి, నవ్వితే నోటి ముత్యాలు రాలుతాయి, నీ నవ్వు లేత వెన్నెల తేట... ఇలా ఎన్నో ఉపమానాలు సృష్టించారు. మన కవులు ఎన్నో పద్యాల్లో హాస్యరసాన్ని మేళవించి రచించారు. శ్రీనాథుడు ఓ వీధిగుండా వెళ్తున్నాడు. ఓ యువతి నీళ్ల బిందెతో వస్తోంది. రాయో, మరేదో తట్టుకోవడంతో బిందెతో సహా జారిపడింది. అంతే కవిగారి నోటి నుంచి

**పూజారివారి కోడలు**
**తాజాఋగ బిందె జాఱి దబ్బున బడియెన్**
**మైజారు కొంగు దడిసిన**
**బాజారే తిరిగి జూచి ఫక్కున నవ్వెన్**

అంటూ పద్యం జాలువారింది. ఇలా ఎన్నో చాటువులు మనల్ని నవ్విస్తాయి. తెనాలి రామకృష్ణుడి పేరు చెప్పగానే ముఖంపై నవ్వు విరబూస్తుంది. ఈయనవిగా చెప్పే ఎన్నో చాటువులు తెలుగువారి నోట నానుతున్నాయి.

ఓ కవి భార్య కవిగారితో ఇలా అంటుంది. మీరందరి మీదా కవిత్వం చెబుతున్నారు. మన అబ్బాయి గురించి మాత్రం చెప్పడం లేదు అని అంది. అబ్బాయి యోగ్యుడు కాడు. అయినా భార్య అహం తృప్తి పరచేందుకు మన కవిగారు

**బాచాబూచుల లోపల**
**బాచన్నే పెద్దబూచి పళ్లున్ తానున్**
**బూచంటే రాత్రి వెఱతురు**
**బాచన్నను చూచి పట్టపగలే వెఱతుర్**

అంటూ తన కొడుకు బాచన్నను బూచితో పోలుస్తూ, బాచన్న, బూచి ఇద్దరిలో బాచన్నే పెద్దబూచి, వాడూ వాడి పళ్లూనూ, బూచి అంటే రాత్రి వేళే భయపడతారు. కానీ బాచన్నను చూస్తే పట్టపగలే భయపడతారు అన్నాట్ట. ఇలా ప్రాచీన కవులు తమ కావ్యాల్లో హాస్యాన్ని పండించారు.

కొన్ని సందర్భాల్లో ఎవరో ఒకరు అపహాస్యం పాలైనప్పుడు హాస్యం పుడుతుంది. అందుకే నండూరి రామకృష్ణమాచార్య...

**కత్తివోలె గాక- కవచమ్ము రీతిగా**
**వాడవలెను హాస్యవాక్కులెపుడు**
**తాను దెబ్బ నుండి తప్పించుకోవలెగాని**
**పరుల మనసు గాయపరుపరాదు**

అని కత్తి మాదిరిగా కాకుండా, కవచంలా రక్షణకు మాత్రమే హాస్యపు మాటలు వాడాలి. తన్ను తాను దెబ్బనుంచి తప్పించుకోవాలి. అంతేగాని ఇతరుల మనసు గాయపరచొద్దు అన్నారు.

నవ్వు నాలుగు విధాల చేటు అన్నారు కొందరు పెద్దలు. అయితే ఇది సుమతీ శతకకారుడు చెప్పిన "కారణము లేని నగవు..." గురించి కావచ్చు. డాక్టర్లు మాత్రం నవ్వు నాలుగు విధాల చేటు



కాదు నూరు విధాలా గ్రేటు అంటున్నారు. నవ్వటం వల్ల నరాలు ఉత్తేజం పొంది ఎండార్ఫిన్లనే హార్మోన్లను విడుదల చేస్తాయి. ఇవి ఆరోగ్యంగా ఉండేందుకు దోహదపడతాయి. అందుకే నవ్వగలిగిన వాడు భోగి-నవ్వలేని వాడు రోగి. శరీరంపై నవ్వు ప్రభావాన్ని తెలిపే ఓ శాస్త్రం కూడా ఉందండోయ్... దాని పేరు 'జెలోటాలజీ'.

ఈ నడుమ ఆరోగ్యం కోసం హాస్యసంఘాలు స్థాపించి కృత్రిమంగా నవ్వుకుంటున్నారు. కొన్నిచోట్ల నవ్వుల పోటీలు కూడా జరుగుతున్నాయి. కామెడీ




క్లబ్బు మెంబర్ని ఒక మిత్రుడు అడిగాడు.

"నెలనెలా చందా కట్టి ఎక్కడికో వెళ్లి నవ్వాలా? ఆ నవ్వేదో ఇంట్లోనే నవ్వుకోవచ్చుకదా!"

దానికి ఆ మిత్రుడు "ఇంట్లోనా ? అమ్మో ప్రమాదం"

"నవ్వితే ప్రమాదం ఏంటిరా?"

"ఆరోగ్యం కోసం నవ్వుతున్నాను అంటే నమ్మేటంత వెర్రిబాగుల్ది కాదు మా ఆవిడ. నవ్వుకి కారణం చెప్పమని సంసార సాగరంలో సునామీలు సృష్టిస్తుంది" అని వాపోయాడు.

చిరునవ్వు, విరగబడి నవ్వు, లేతనవ్వు, పకపక నవ్వు, ముసిముసి నవ్వు, బోసినవ్వు, దొరనవ్వు, దొంగనవ్వు... ఇలా నవ్వులు నానా రకాలు. కవులు, నటులు ఇంకా ఎన్నిరకాల నవ్వులనైనా సృష్టించగలరు. ఇక నాయకుల సంగతైతే చెప్పనే అక్కర్లేదు.

నవ్వుల అంతరార్థాలనీ ఆంతర్యాలనీ కనిపెట్టడం చాలా కష్టం. మన మనసు ముఖంలో ప్రతిబింబిస్తుంది అని ఎప్పుడో అన్నా, ప్రస్తుతం అలా అనలేరు. తమ మనసులో ఉన్న భావం ఏమాత్రం బయటపడకుండా ముఖం మార్చేస్తున్నారు. మన మనసు మీద తమ నవ్వుల ముసుగు వేస్తున్నారు ఈ జనం. ఒకే నవ్వు ఒకరికి పండు వెన్నెల్లాగ- వేరొకరికి మండుటెండలాగ కనబడుతుంది. ప్రియురాలి అరనవ్వును చూసిన ప్రియుడు 'అమ్మాయే సన్నగా అరనవ్వే నవ్వగా, మతితప్పి కుర్రాళ్లే మంచానపడ్డారే' అని పాడుకున్నాడు. అధికార పక్షం వారి చిరునవ్వులు ప్రతిపక్షం వారికి నిప్పురవ్వలవుతాయి. మాటలు లేకుండా విరిసే మందహాసం మరీ ప్రమాదం. అది నరకాసురునితో యుద్ధం చేస్తున్న సత్యభామ లాంటిది.

కొందరు ఏడిస్తే నవ్వినట్టుంటుంది. కొందరు నవ్వినా ఏడ్చినట్టుంటుంది. నవ్వు నమ్మించనూగలదు- మోసగించనూ కలదన్నది గత కొన్నేళ్లల్లో తెలుగు వాళ్లకి బాగా అనుభవంలోకి వచ్చిందే!

నవరసాల్లో శృంగారం తర్వాత హాస్యమే ప్రసిద్ధం. గడుసు వాళ్ల మాటల్లో చమత్కారం మెరుస్తూ ఉంటుంది. అది వ్యంగ్యమైతే మనసు నిండే హాస్యం పండుతుంది. నవ్వులు నవపారిజాతాలై పరిమళిస్తాయి. ఒక చిలిపి మరదలు తన బావను "కడలి దాటిన వాడి తమ్ముడవా" అంటుంది. కడలి దాటిన వాడు అంటే హనుమంతుడు. హనుమంతుడి తమ్ముడు అంటే కోతివా! అంటుంది. అందుకా కొంటె బావ "అవును! నీ పేరు హిడింబి అయితే" అంటాడు. హిడింబి భీముని భార్య. భీముడు హనుమంతుడి తమ్ముడు. ఇటువంటివి ఎన్నో ఉన్నాయి. పౌరాణిక గాథల్ని హాస్యంతో మేళవించి చెబితే పిల్లలు సరదాగా ఆలకిస్తారు.

కొందరు నవ్వులు రువ్వుతారు. కొందరు నవ్వులు విసురుతారు. మరికొందరు నవ్వులు కురిపిస్తారు. మరికొందరు నోటితో నవ్వుతూ నొసటితో వెక్కిరిస్తారు.

కొందరు నవ్వితే ప్రమాదం. మరికొందరు ఆగ్రహిస్తే ప్రమాదం. ద్రుపద పురోహితుని రాయబారం మెచ్చక కౌరవులు సంజయునితో పాండవులకు రాయబారం పంపారు. పాండవులకు అరణ్యవాసమే ఆరోగ్యమని, ఆమాటే చెప్పి తిరిగి వచ్చాడు సంజయుడు. ధృతరాష్ట్రుడు సంజయునితో

"ధర్మరాజు ఆగ్రహించాడా" అని అడగ్గా, దానికి సంజయుడు

"లేదు చిన్నగా నవ్వాడు" అన్నాడు.

"ఆఁ! అయితే ప్రమాదమే"

అనుకున్నాడు అంధరాజు. ధర్మజుని నవ్వులోని ఆంతర్యం అతనికి తెలుసు.

కొన్ని సందర్భాల్లో అందరికీ తెలిసిందే అయినా ఆ సమాధానం బహిరంగంగా చెప్పలేక ఇరుకునపడిపోతాం.

సుభద్ర తన ఐదేళ్ల కొడుకు బాబీకి హోంవర్కు చేయడం నేర్పుతోంది. అంతలో మరో నలుగురు నారీమణులు వచ్చి కబుర్లు ప్రారంభించారు. రాజకీయాల నుంచి సినిమాల మీదకు అక్కడి నుంచి టి.వి. ధారావాహికల మీదకూ మళ్లింది వాళ్ల

సంభాషణ.

"అదేం కథ బాబూ నాలుగేళ్ల నుంచి జీడిపాకం లాగ సాగుతోంది" అంది ఒకామె.

"నాలుగేంటి అయిదేళ్లు దాటిపోయింది. మా బాబిగాడు కడుపులో ఉండగా ప్రారంభమైంది" అంది సుభద్ర. వెంటనే అడిగాడు బాబిగాడు "అమ్మా అసలు నీ కడుపులోకి నేనెలా వచ్చాను"

ఆడవాళ్లందరూ ఫక్కున నవ్వారు. సుభద్రా నవ్వకుండా ఉండలేకపోయింది. బాబిగాడు బిక్కమొహం వేశాడు. అది నవ్వాపవలసిన విషయం కాదు కాబట్టి అందరూ నవ్వుతూనే ఉన్నారు.

ఓ పదేళ్ల గడుగ్గాయి వాళ్ల తాతయ్యను "తాతయ్యా, మీరెప్పుడైనా భవసాగరం ఈదారా?" అని అడిగాడు. దానికి ఆ పెద్దాయన మొదలు అవాక్కయినా తరువాత తేరుకుని "నాయనా ఈది ఈది నా గతి ఇంతకు వచ్చింది" అన్నాడు. అంటే ఈ పిల్లాడు హుస్సేను సాగర్, నాగార్జున సాగర్...లాంటిదే భవసాగరం అనుకుని ఉంటాడు. ఇంకేముంది... నవ్వడం చుట్టూ ఉన్నవారి వంతైంది. ఈ విషయం గుర్తొచ్చినప్పుడల్లా పెదవులపై ముసిముసి నవ్వు దోబూచులాడుతుంది. ఇలాంటి సన్నివేశాలు ప్రతి ఒక్కరి జీవితంలోనూ ఉంటాయి. అవి గుర్తు చేసుకుంటే క్షణ



**టీచర్:** రాము 'డైరెక్ట్‌స్పీచ్, ఇన్‌డైరెక్ట్ స్పీచ్'కు తేడా ఏంటో చెప్పరా?

**స్టూడెంట్:** మొన్న ప్రిన్సిపల్ మా మీద కోపంతో డైరెక్ట్‌గా తిట్టారు కదా టీచర్ అది 'డైరెక్ట్ స్పీచ్'. నిన్న మీ మీద కోపం వచ్చి మమ్మల్ని తిట్టారు కదా అది 'ఇన్‌డైరెక్ట్ స్పీచ్' టీచర్.

**- గడ్డం సతీష్,** హైదరాబాద్

## ఇవీ యక్ష ప్రశ్నలు... 10

101. స్నానం ఏది? 102. దానం ఏమిటి? 103. పండితుడెవరు? 104. మూర్ఖుడెవడు? 105. నాస్తికుడెవడు? 106. కామం ఏది? 107. మాత్సర్యం ఏది? 108. అహంకారం ఏది? 109. దంభం ఏది? 110. దైవం ఏది?

## సమాధానాలు

101. చెడు తలపు లేకుండా ఉండటం 102. ప్రాణులన్నిటినీ కాపాడటం 103. ధర్మాలను తెలుసుకున్నవాడు 104. నాస్తికుడు 105. మూర్ఖుడే 106. సంసారానికి హేతువైనది 107. మనస్తాపం 108. అవధుల్లేని అజ్ఞానం 109. ధర్మ స్వరూపునిగా తనను ప్రకటించుకోవటం 110. దానఫలం

కాలమైనా మన ఒత్తిడి దూరమై మనసు ఆనందలోకంలో సంచరిస్తుంది. మీరూ గుర్తు తెచ్చుకోండి. అసలు పసిపిల్లలున్న ఇల్లే ఆనంద నిలయం. వారి బోసి నవ్వుల్లో మైమరచని వారుండరు. పసిపిల్లలు ఇంట్లో ఉంటే మనకు ఏ లాఫింగ్ క్లబ్బూ అవసరం ఉండదు.

నవ్వకూడని వేళ నవ్వితే పెద్దలు "ఏంటా ఇకఇకలు పకపకలు" అని నిందించేవారు. మందలింపులో కూడా అందమైన యతి ప్రాసలు. ప్రాసయతులు తెలుగు భాషకు తేనెల సోనలు.

పసిపిల్లలు రోజుకు నాలుగు వందలసార్లు నవ్వుతారు. పెద్దలు మాత్రం నవ్వే సందర్భాలు అరుదుగా ఉంటాయి. నవ్వు మనలో కల్మషాన్ని తొలగిస్తుంది. పిల్లలు అందుకే నిర్మలంగా ఉంటారు. మనలో చాలా మంది తనివితీరా నవ్వి చాలా రోజులయ్యుంటుంది. ఇప్పటికైనా కాస్త నవ్వండి బాబూ.

నవ్వకపోవడం రోగం. అయితే నవ్వించడం ఒక యోగం. అందుకే మహారాష్ట్రకు చెందిన మదన్ కటారియా అనే వైద్యుడు 'లాఫ్టర్ యోగా'ను ప్రారంభించాడు. అంతేనా మే 5వ తేదీని ప్రపంచ నవ్వుల దినోత్సవంగా గుర్తించేలా చేశాడు. అంటే మనకు ప్రస్తుతం తీరుబడిగా నవ్వడానికీ ఓ దినముందన్నమాట! నవ్వుతో కలిగే లాభాలు అన్నీ ఇన్నీ కావు. ఓ చిరునవ్వు నిరాశను తరుముతుంది. ఓ గలగల నవ్వు ఆరోగ్యంగా ఉంచుతుంది. ఓ సుందరి దరహాసం ప్రియుడి గుండెల్లో వలపుల పూలు పూయిస్తుంది. ఓ నవ్వు మనుషుల మధ్య సంబంధాల్లో, సంభాషణల్లో ఉత్తేజాన్ని నింపుతుంది. ఓ ముసిముసి నవ్వు మన ఆయుష్షును ఓ ఏడేళ్లు పెంచుతుంది. అందుకే తనివి తీరా నవ్వండి.






**జి.నారాయణరావు**
అమలాపురం, తూ.గో.జిల్లా
81255 83223




## అక్షరాలతో అనుకరిస్తారా! రండి ఈ వేదిక మీదే...

మనిషి పుట్టిన దగ్గర నుంచీ అనుకరణతోనే జీవితాన్ని ప్రారంభిస్తాడు. కళాకారుల నుంచి కవిత్వం దాకా సమాజంలో అనేక విషయాలకు అనుకరణ ఉంటుంది. శ్రీశ్రీ, కృష్ణశాస్త్రి కవిత్వానికి జరుక్ శాస్త్రి, దీపాల పిచ్చయ్య శాస్త్రి పేరడీలు రాశారు. ఆదరణ పొందిన సినిమా పాటలకు పేరడీలు రాయటమూ పరిపాటే. మీరూ అలారాసి మాకు పంపించవచ్చు. కాకపోతే అవి తేట తెలుగులో ఉండాలి. ఎవర్నీ కించపరచకూడదు. మీ సొంత రచనేనని, అది గతంలో ఏ మాధ్యమంలోనూ ప్రచురితం కాలేదని, మరెక్కడా పరిశీలనలో లేదనీ హామీపత్రం తప్పక జతచేయాలి. పేరడీకి స్ఫూర్తి కలిగించిన మూల రచననూ జోడించాలి. దాని రచయిత ఎవరు, అదెక్కడ ప్రచురితం / ప్రసారం అయ్యింది, లేదా ఏ చిత్రంలోది అన్న వివరాలూ ఉండాలి. ప్రసిద్ధ రచన అయితే మంచిది. ఎంపికైన వాటిని తెలుగు వెలుగు పత్రికలో ప్రచురిస్తాం. రూ.150 పారితోషికమూ ఉంటుంది.

## పేరడీ పాట

నా గుండెలలో నిదురించిన చెలీ,
కలలనైన కనిపించకు సఖీ,
వగలాడివి వయ్యారివై నీవే
ప్రేమ రొంపిలోకి, నన్ను దింపినావే! ॥నా గుండెలలో॥

నా కన్నులలోనా,
కురిసెనులే నిప్పుల వానా,
అదేపనిగ నిను వరించి అప్పులు చేశానే, బిచ్చమడిగినానే
॥నా గుండెలలో॥

నా ప్రాణములూ నీవే
ఒకటొకటీ తోడేసినావే
ఇకనైనా విడిచిపెట్టరావే
నీవెచ్చని నీడా
అమ్మితి నా పచ్చని మేడా
సొమ్ములన్నిపోయి నేను సొమ్మసిల్లినానే
సోకులు మిగిలేనే! ॥నా గుండెలలో॥

(ఆరాధన చిత్రంలో శ్రీశ్రీ రచించిన "నా హృదయంలో నిదురించే చెలీ" పాటకు పేరడీ)

**- కనగాల జయకుమార్,** గుంటూరు.

## కర్షక పాదాలు

రాయిని అహల్యగా మార్చిన
రామపాదుకలు కావు
రాతి దెబ్బలకి రాటుదేలి
ముళ్లపోట్లకి కాయలు కట్టి
నడిచీ... నడిచీ...
తారు రోడ్ల మీద పొక్కిన పాదాలు
పంట రక్షణ తప్ప
పాదరక్షలు ఎరుగని కర్షక పాదాలు
పొలాల్లో నెర్రెలను
కాళ్లకి పూసుకుని
సన్నని దారుల వెంట
చేలగట్ల వెంబడి
చకచకా నడయాడే పాదాలు
ఈత వనాలు, తుమ్మ డొంకలు
చిత్తడి నేలలు
ముళ్లదారుల్లో
అలవోకగా నడిచి
వాడితేరిన అడుగులు
కమ్మని మట్టిని స్పర్శిస్తూ
అరికాళ్లు చెప్పిన మూగభాషకు
మడులు మాణిక్యాలైనాయ్
మోడు గుచ్చుకున్నా
మొక్కై చిగురిస్తుందన్నాశ
ఆ పాదానిది
భూమి బీడైనా
వాన చినుకుతో
వనమౌతుందన్న నమ్మకం
ఆ పాదానిది
చేలో అణువణువూ
పాదచుంబనంతో పవిత్రమైంది
ఇప్పుడు సెజ్‌ల భూతానికి
భూములు బలైనాయ్
పాదాలు కొయ్యబారి
కాళ్లతో కదపనంటున్నాయ్
బతుకు సాగేదెట్టానో?!

**- చిలుకూరి శ్రీనివాసరావు,** కడియం, తూర్పుగోదావరి జిల్లా



## అంతా సముద్రమే!

| మ | | రా | | | ము |
|---|---|---|---|---|---|
| | అం | | శి | | |
| రా | | తో | | | |
| | | | ని | | ణా |
| | ధి | | జ | | |
| ము | | ణా | | | ల |

**నిబంధనలు**

1. సముద్రానికి పర్యాయ పదాలే ఈ గడినుడి.
2. ఇందులో గళ్లతో కూడిన మూడు చతురస్రాలున్నాయి.
3. ప్రతి చతురస్రంలోనూ బాణం గుర్తు ఉన్న దిశగా పదాన్ని రాయాలి.
4. ఆ దిశలో సముద్రానికి ఎన్ని పర్యాయ పదాలు రాయగలరో ప్రయత్నించండి!

సమాధానం 97లో...

తులాభారం



## ఆకట్టుకునే 'నవలా హృదయం'

పాఠకులకు నవలలు చదివేంత తీరిక, ఓపిక తగ్గాయని అనుకుంటున్న నేపథ్యంలో, తెలుగులో వెలువడిన ప్రముఖ నవలలను క్లుప్తంగా పరిచయం చేసే పద్ధతికి ఆదరణ లభిస్తోంది. యద్దనపూడి సులోచనా రాణి 'సెక్రటరీ' వంటి పాప్యులర్ నవలలతోపాటు పిలకా గణపతిశాస్త్రి 'విశాల నేత్రాలు', వేంకట పార్వతీశ్వర కవుల్లో ఒకరైన బాలాంత్రపు వేంకటరావు రాసిన 'మాతృమందిరం' వంటి సరళ గ్రాంథిక నవలలను అయిదు పేజీల్లో పరిచయం చెయ్యటం కష్టసాధ్యమైన పని. అటువంటి 27 నవలల పరిచయ సమాహారం ఈ 'నవలా హృదయం' పుస్తకం. పరిచయకర్త వి.రాజారామమోహనరావు స్వతహాగా కథకుడు, నవలా రచయిత. అందువల్ల నవలల్లోని ముఖ్య విషయాన్ని, కేంద్రబిందువుని పట్టుకుని పాఠకులకు నవల అందించి తృప్తిని కలుగజేయడంలో కృతకృత్యులయ్యారు. మధురాంతకం మహేంద్ర రాసిన 'స్వర్ణసీమకు స్వాగతం' కేవలం 60 పేజీల నవలను, పరిచయం చెయ్యడం కాస్త తేలిక అనిపించవచ్చు. కానీ దాదాపు 500 పేజీల నిడివి ఉన్న రావూరి భరద్వాజ 'పాకుడురాళ్లు' నవలను పరిచయం చేయడంలోనే పరిచయకర్త నేర్పు అర్థమవుతుంది. సెక్రటరీ, చిలకమర్తి వారి 'గణపతి', లత 'మోహనవంశి' వంటి బాగా ప్రాచుర్యం పొందిన నవలలతోపాటు, అంగర వేంకట కృష్ణారావు 'విరామం', అరవింద 'ఆవలిగట్టు', ఒకప్పటి కొవ్వలి వారి 'సిపాయి కూతురు' వంటి మరుగున పడ్డ మాణిక్యాలను బయటకు తీసి పరిచయం చేయడం వల్ల నవలా సాహిత్యం పట్ల ఆసక్తి ఉన్న వారికి ఎంతో ఉపయుక్తం. నవలా వస్తువుతో పాటు రచయిత వివరాలు, ఆయన ఇతర రచనల గురించి కూడా ప్రస్తావించడం పాఠకులకు నవల పట్ల, అది రాసిన రచయిత పట్ల మంచి అవగాహన కలిగిస్తుంది.

గతంలో 'సహవాసి' దాదాపు 50 నవలలను ఇలాగే పరిచయం చేశారు. ఇప్పుడు రాజా రామమోహనరావు ఈ పనికి పూనుకున్నారు. వీరిద్దరూ అమెరికా నుంచి మాసపత్రికగా వెలువడిన 'తెలుగు నాడి' కోసం ఈ పరిచయాలు చేయడం యాదృచ్ఛికం. ఏదైనా సాహిత్యాభిమానుల్ని అలరించే మంచిపుస్తకమిది.

**రచయిత: వి.రాజారామమోహనరావు; పుటలు: 156; వెల: రూ.75; ప్రతులకు: విశాలాంధ్ర, నవోదయ బుక్‌హౌస్; 093947 38805**

**- వాన**

## సిల్కురూటు సాహసం



మనుషులు, భాష, సంస్కృతీ ఏదీ మనవి కావు. విపరీత వాతావరణం, తిండి దొరకడం అనుమానమే. అంతవరకూ దేశ ఎల్లలు దాటి వెళ్లింది లేదు. పెట్టుకొన్నది 15వేల కిలోమీటర్ల మహాయాత్ర. ధైర్యం, సాహసం, తెగింపు కావాలి. ఈ లక్షణాలు మూర్తీభవించగా మధ్య ఆసియాలోని సిల్క్‌రూట్లో అడుగుపెట్టి ఒంటరిగా యాత్రను జయప్రదంగా ముగించిన వాళ్లున్నారు. నేను ఫాహియాన్, హుయాన్‌సాంగ్, మార్కోపోలో, రాహుల్ సాంకృత్యాయన్‌ల గురించి చెప్పడం లేదు. పరవస్తు లోకేశ్వర్ గురించి మాట్లాడుతున్నాను. 'భయం ఎందుకు వెయ్యడం లేదూ! అయినా దాన్ని జయించాలి గదా!' అంటూ 2012లో 55రోజుల పాటు సిల్క్‌రూట్‌ను స్మరిస్తూ, పలవరిస్తూ, అనుభవిస్తూ ఉజ్బెకిస్థాన్, కిర్గిజ్‌స్థాన్, చైనా వంటి దేశాల్లో ఒంటరిగా భూతలాన యాత్ర చేశారు. ఆ అనుభవాలే 'సిల్క్‌రూట్‌లో సాహసయాత్ర'. యాత్ర అంటే మనుషులు: పరిచితులు, అపరిచితులు, ఉపకారాలు, స్నేహాలు, దౌష్ట్యాలు, మోసాలు- ఈ పుస్తకం నిండా మనుషులే. యాత్ర అంటే ప్రదేశాలు, పల్లెలు, పట్నాలు: తాష్కెంట్, బుఖారా, సమర్‌ఖండ్, (టెర్రాకోట సైనికుల) షియాన్, చైనాగోడ... ఇవన్నీ పుస్తకం ముగించేసరికి పరిచయమైపోతాయి. యాత్రాగాథ అంటే ఆయా ప్రదేశాలూ ప్రాంతాల వివరణ, వర్ణన తీన్‌షాన్ 'మాంత్రికలోయ, తూర్ఫాన్ ప్రాంతంలో మండే ఎడారి, సమర్‌ఖండ్ బుఖారాల్లోని వాస్తుశిల్పం- ఇవన్నీ రచయిత హృదయంతో చేసిన వర్ణనల పుణ్యమా అని సూటిగా మన మనసుల్లోకి ఎక్కిపోతాయి. యాత్ర అంటే యాత్రికునిలో మానసిక వికాసం, హృదయం విశాలమవడం, చదువరుల్లోనూ అలాంటి మంచి పరిణామం కలిగించడం. 'మనకు నరరూప రాక్షసులని పించే తైమూర్, చంఘీజ్‌ఖాన్, గజనీ, ఘోరీలు అక్కడివారికి మహోన్నత వ్యక్తులు. విశ్వ విజేతలు. మరి సత్యం సాపేక్షం కదా' అంటారు రచయిత. 'అవును గదూ' అనిపిస్తుంది మనకు. ఈ యాత్ర, పుస్తకం శీర్షిక చెప్పినట్టుగా - సిల్క్ రూట్లోనో, పట్టుకుచ్చులోనో సాగిపోలేదు. చైనా నిబంధనల వల్ల, ప్రకృతి పరిణామాల వల్ల, వ్యక్తిగత కారణాల వల్ల యాత్రకుడి ఎడమలుగానూ, పైకీ కిందకీ సాగింది. అవన్నీ అర్థమవడానికి విపులమైన మ్యాపుంటే బాగుండేది. ఇలాంటి యాత్ర చేసిన తొలి తెలుగు మనిషి లోకేశ్వరేనేమో. 'అరవైఏళ్లు పైబడ్డాక ఎందుకీ ప్రయాసా?' అని ఎవరైనా అడిగితే, 'భలేవారే, ఒక్క సిల్క్‌రూటే ఏవిటీ!' కాలం కలిసొస్తే సైబీరియా మంచు ఎడారులూ, ఈజిప్టు పిరమిడ్లూ, నయాగరా జలపాతాలూ, ఆఫ్రికా కీకారణ్యాలు తిరిగి రాకుండా ఉంటానా?' అంటారు. ఆయన అలా తిరిగి రావాలనీ, అవి పుస్తకాలుగా మనకు మిగలాలనీ కోరుకుందాం!!

**రచన: పరవస్తు లోకేశ్వర్; పుటలు: 250; వెల: రూ.250, ప్రతులకు: రచయిత (9160680847), నవోదయ, విశాలాంధ్ర.**

**- దాసరి అమరేంద్ర**

## అమ్మకు అక్షరాభిషేకం




నిజానికి నేల మీద పడకముందే శిశువుకు తెలిసిన అమృతధ్వని అమ్మ గొంతు. ఏ రాగమూ, తాళమూ తెలియక పోయినా అమ్మపాడే పాట శ్రీవారిని నిద్రపుచ్చే అన్నమాచార్యుల కీర్తనలానే వినిపిస్తుంది. అది వింటూ విశ్వమే తన ఊయలగా మారిందన్నంత హాయిగా నిద్రపోతాడు శిశువు. చిన్నారులను నిద్రపుచ్చేందుకు నిరంతరం అమ్మ గొంతు నుంచి జాలువారే సంగీత ప్రవాహం, ఆమె రూపం సాక్షాత్తూ ఈశ్వర స్వరూపమే. ఎన్ని పోలికలు చెప్పినా, ఇంకెన్ని వర్ణనలు చేసినా అమ్మపాట అజరామరం... అమృత తుల్యం. అలాంటి అమ్మ పాటలను పదికాలాల పాటు పదిలంగా ఉంచాలనీ... పదిమందికీ పంచాలనే తలంపుతో 'అమ్మ పాటలు' సంకలనంగా తీసుకొచ్చారు నాగలక్ష్మి.

ఇందులో దేవులపల్లి, గురజాడ, న్యాయపతి రాఘవరావు (రేడియో అన్నయ్య), కొనకళ్ల వేంకటరత్నం, రాయప్రోలు, లక్ష్మిందేవమ్మ, ధరణి కొండ వరదదాసు, పిచ్చయదాసు, భక్త సింగరదాసు, తూము నరసింహదాసు, అల్లూరి వెంకటాద్రి స్వామి లాంటి ఎందరో రాసిన పాటలున్నాయి. అంతేకాదు మేటి కవులు రాసిన తేటతెలుగు గీతాలూ మనకు కనిపిస్తాయి. నిజానికి ఇందులోని పాటలన్నీ చాలామంది అమ్మలు పాడిన పాటలే. కానీ వాటన్నింటినీ ఓ చోట కూర్చాలన్న ప్రయత్నం గొప్పది. మొత్తం 106 పాటలున్న ఈ పుస్తకంలో ఒక్కోపాటా ఒక్కో ఆణిముత్యం. 'నారాయణ... నారాయణ... అల్లా అల్లా...', 'చిట్టీ చిట్టీ రేగిపళ్లు... చిట్టీ తలపై భోగి పళ్లు...' లాంటి పిల్లల పాటలు అల్లరిలా వినిపిస్తాయి. చక్కటి దేశభక్తి గీతాలు, హారతి పాటలు గుర్తుచేసుకోవచ్చు. అవే ముందు తరానికి బదిలీ అవుతుంటాయి. అలాంటి పాటల్లో 'హారతీ మీరేల ఇవ్వరే... అంబకూ మంగళా హారతీ మీరేల ఇవ్వారే...' లాంటి పాటలు కనిపిస్తాయి. పెళ్లిళ్లలో వరసైన వాళ్లు పాడుకునే బువ్వంబంతి పాటనూ వదలకుండా చేర్చారు. ఒక్క అమ్మవారేమిటి రాముడు, కృష్ణుడు, శివుడు వంటి దేవుళ్లందరి పాటలనూ తల్లి జయలక్ష్మితో చెప్పించుకొని సంకలనం చేశారు. ఇది తెలుగు భాషకు ఒంపు సొంపులనద్దే సాహిత్యం, సంగీతంపై ఆమె మక్కువను తెలుపుతోంది. దీన్ని బట్టి చూస్తే ఆమెకు పాటంటే ఎంత మమకారమో అర్థమవుతుంది. అలాంటి అమ్మ గొంతు నుంచి నిత్యం వినిపించే పాటలను అక్షరీకరించి నాగలక్ష్మి అమ్మకు, అమ్మభాషకు గీతాక్షరాభిషేకం చేశారు.

**సంకలనం: సింగరాజు నాగలక్ష్మి; పుటలు: 146; వెల: రూ.100; ప్రతులకు: ప్రముఖ పుస్తకకేంద్రాల్లో; 98480 42967**

**- ఇంద్రగంటి శ్రీనివాసశర్మ**

## ఆశ్చర్యం... ఆలోచన... సమాజం




ఆలోచనలు ఎంత గొప్పవైనా కావచ్చు అవి ప్రకటించినప్పుడే వాటి గొప్పతనం తెలుస్తుందంటారు కూర చిదంబరం. వివిధ పత్రికల్లో వచ్చిన వార్తా కథనాలపై, సమాజంలో కళ్లముందు కనిపిస్తున్న భిన్న సంఘటనలపై రచయిత అభిప్రాయాల వ్యాసమాలికే ఈ 'ఆలోచనా సులోచనాలు'. వీటిలో కొన్ని ఓ త్రైమాసిక పత్రికలో ప్రచురితమయ్యాయి. ఇందులో 59 వ్యాసాలున్నాయి. ఇవి కొన్ని ఆహ్లాదాన్ని కలిగిస్తే మరికొన్ని ఆశ్చర్యం, ఆవేదనతోపాటు మారుతున్న ఈ సమాజం గురించి ఆలోచన రేకెత్తింపజేస్తాయి. ఇంకొన్ని నవ్వు తెప్పిస్తాయి. తొలి అయిదు వ్యాసాల్లో రచయిత తన బాల్యస్మృతులను నెమరు వేసుకున్నారు. చదువుతున్నంత సేపు నాటి విషయాలన్నీ కళ్లముందర కదలాడుతున్నట్లుంటాయి. కొన్ని వ్యాసాల్లో సామాజికాంశాలనూ స్పృశించారు. సామాన్యుడి జీవితంలో జరిగే పలు సంఘటనలనూ ఆలోచింపజేసే రీతిలో చెప్పారు. పాశ్చాత్య సంస్కృతిపై మోజు, వినిమయ వస్తు ప్రపంచం సామాన్యుడిపై దాని ప్రభావం, ఆధ్యాత్మిక అంశాలపై కూడా వ్యాసాలున్నాయి. 'బతుకంతా ప్రశ్నలమయం'లో ఏ వ్యక్తికైనా ఎందుకు? ఏమిటి? ఎలా? అని తనలో తను ప్రశ్నించుకునే తత్వం ఉండాలంటారు. జిజ్ఞాసలేని జీవితం పనికిరాదంటారు. 'నేటికాలం పిల్లలు'లో... నేటి తరం ప్రజ్ఞ, ఆలోచనా విధానం ఎలా ఉందో చెప్పారు. పుట్టిన రోజు వేడుకలు అప్పుడూ ఇప్పుడూ జరపడంలో తారతమ్యాన్ని వివరించారు. 'దోసె తినాలంటే' వ్యాసంలో... ప్రపంచీకరణ వల్ల ధరలు ఎలా పెరిగాయో వ్యంగ్యంగా చెప్పారు. 'వావి వరసలు - ఆర్థికావసరాలు'లో... పంజాబ్‌లో కొన్ని గ్రామాల్లో కన్యాశుల్కం ఇచ్చి పిల్లలకు అమ్మాయిల్ని కొనే స్థోమత లేని తల్లిదండ్రులు ఒకే అమ్మాయిని ఇద్దరు, ముగ్గురు కుమారులకు పంచటం వంటి దుర్భర పరిస్థితిని తెలుపుతుంది. ఎంతోమందికి తెలియని ఈ విషయం విస్తుగొలుపుతుంది. అమెరికాలో ఉద్యోగానికి సొంత అన్ననే భర్తగా చెప్పి వీసా పొంది వెళ్తున్న సంఘటనలూ ప్రస్తావించారు. రచయిత వృత్తిరీత్యా చార్టెడ్ అకౌంటెంట్ కావడం వల్ల కాబోలు ఆర్థిక అంశాలపై వివరంగా రాసిన వ్యాసాలు ఆకట్టుకున్నాయి. కొన్ని వ్యాసాల్లో తెలంగాణ మాండలికం వాడినా పక్కనే వాటి అర్థాలు చెప్పడం వల్ల ఎక్కడా ఇబ్బంది అనిపించదు. రచయిత ఎంచుకున్న అంశాల్లో వైవిధ్యం, చెప్పే శైలి, ఎంత పెద్ద విషయాన్నైనా క్లుప్తంగా వివరించిన తీరు చదివింపజేస్తాయి.

**రచయిత: కూర చిదంబరం; పుటలు: 136; వెల: రూ.60; ప్రతులకు: పాలపిట్ట బుక్స్, హైదరాబాద్, 98487 87284**

**- బిల్లాడి భాస్కర్‌రెడ్డి**

# కొండ అద్దమందు...



## త్రివాణీ సంగమం

భర్తృహరి సంస్కృతంలో రాసిన నీతి, శృంగార, వైరాగ్య శతకాలను ఏనుగు లక్ష్మణకవి తెనిగించారు. వీటి భావాన్ని సామాన్య పాఠకులకు అందుబాటులోకి తీసుకురావాలనే ఉద్దేశంతో వాటిని సరళ వచనంలో రాశారు ఆముదాల మురళి. ఇది ఓ మాసపత్రికలో ధారావాహికగా ప్రచురితమైంది. గ్రంథానికి తొలి భాగంలో భర్తృహరి జీవితకథ పాఠకులకు ఆసక్తి కలిగిస్తుంది. భావాన్ని ముందుగా తెలిపి ఆ తరువాత మూల గ్రంథంలో సంస్కృత శ్లోకాల్ని అందించారు. చివరిలో ఏనుగు లక్ష్మణకవి తెనిగించిన పద్యాల్నీ చేర్చిన విధానం పాఠకులకు ఉపయోగకరం. మేలు మాటలు తెలిపే గ్రంథాలు సంస్కృతాంధ్ర భాషల్లో అనేకం ఉన్నప్పటికీ ఒకే గ్రంథంలో మూడు విషయాలు తెలపటం త్రివాణీ సంగమంగా తోస్తుంది.

**- మారాజో శర్మ**

**అనువాదం: ఆముదాల మురళి; పుటలు: 184; వెల: రూ.90; ప్రతులకు: రచయిత; ఎ.కె.పల్లి, తిరుపతి; 94404 32683**



## జీవితం కవిత్వమైన వేళ

కవిత్వం చదువుతుంటే గోదావరి నది మీద పడవ ప్రయాణం సాగుతున్నట్లు, ఆ పక్కన హంసల నడకలు, జింకల నడతలు దృశ్యాదృశ్యమైతే కచ్చితంగా అది కోటం చంద్రశేఖర్ సమ్మోహన కవిత్వమే. సమాజం కవి మీద పెట్టిన బాధ్యతను ఆయన భుజాలకెత్తుకున్నారు. ప్రతి కవితలో విస్మరించనితనం కన్పిస్తుంది. 'కవల టవర్ల కింద కలల బూడిద'లో విధ్వంస విద్రోహ ఉగ్రవాదానికి పునాదియా అంటూ ఉగ్రవాదాన్నే కాదు వెర్రితలల విర్రవీగే అగ్రవాదానికి సమాధి కట్టాల్సిన అవసరాన్ని ఎత్తి చూపిన మంచి కవిత ఇది. - ఇలా ప్రతి కవితలోనూ స్వీయానుభూతిని అందరి అనుభూతిగా మార్చి రాసినా... లేదా కవి అనుభూతిని పాఠకుడే స్వీయానుభూతి చెందేలా రాసిన కవిత్వం ఇందులో మనకు కన్పిస్తుంది.

**- మున్నీ**

**రచయిత: కోటం చంద్రశేఖర్; పుటలు: 173; వెల: రూ.50; ప్రతులకు: రచయిత, 94920 43348**



## అభిజ్ఞానం

ఈ రచనతో డా॥ అయాచితం నటేశ్వరశర్మ అర్ధశతకావ్యావిష్కరణను పూర్తి చేశారు. రచనానుభవంతో పాటు లోకానుభవం గల ఆయన కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలాన్ని సరళంగా తన శైలిలో అనుసృజించారు. అక్కడక్కడ పోతన వీరినావేశించారా... అనిపిస్తుంది- ఈ గ్రంథంలో సప్తమాశ్వాసంలో 119, 137 పద్యాలు చదివినప్పుడు. నేటి కాలంలో ముందుమాటే లేకుండా కావ్య ప్రచురణ సాహసమే. 'విప్రియాదుఃఖ', 'రమ్యమృగయా', 'చిరుసేపు' వంటి ప్రయోగాల్లో ఈయన సాహసం ఇంకా మెచ్చుకోదగింది. 'ష్య' ప్రాసస్థానంలో వాడటం ఎంత సాహసం; 'భవదాదర వాక్యమమైక సేవలో...' అని కవి అన్నట్లు ఈ గ్రంథ పఠనంలో పద్యకవులు సేదతీరటం ఖాయం.

**- చింతలపూడి వెంకటేశ్వర్లు**

**రచయిత: డా॥ అయాచితం నటేశ్వరశర్మ, పుటలు: 152, వెల: రూ.200, ప్రతులకు: రచయిత, నిజామాబాద్, 94404 68557**

### కొత్త పొత్తాలు



**ప్రేమలో మనం**
**ర:** బి.గీతిక; **పు:** 102; **వె:** రూ.80; **ప్ర:** విశాలాంధ్ర పుస్తక కేంద్రాలు, 99080 63266



**సృష్టి జనజీవన దర్పణం; ర:** కేకలతూరి క్రిష్ణయ్య; **పు:** 288; **వె:** రూ.200; **ప్ర:** విశాలాంధ్ర పుస్తక కేంద్రాలు 9394033678



**తెలంగాణ రుబాయిలు; ర:** శివ రామకృష్ణ; **పు:** 40; **వె:** రూ.30; **ప్ర:** ప్రముఖ పుస్తక కేంద్రాల్లో, 94404 37200



**అక్షరంలో ప్రళయాగ్నులు:**
**ర:** మరో చలం; **పు:** 56; **వె:** రూ.40; **ప్ర:** సి.హెచ్. కృష్ణప్రియ; విద్యాధరపురం, విజయవాడ 81257 52234



**అరువది నాలుగు కళలు**
**ర:** మువ్వల సుబ్బరామయ్య; **పు:** 48; **వె:** రూ.30; **ప్ర:** జయంతి పబ్లికేషన్స్, విజయవాడ, 89782 61496

ర: రచయిత, పు: పుటలు, ప్ర: ప్రతులకు

## ఒకే కలం... ఒకే గళం



నిత్యం ఎదురయ్యే వ్యక్తులూ, కదిలించే సంఘటనలూ కవిత్వీకరించిన రచయిత్రి కవితాసుమాల్ని గుదిగుచ్చిన సంకలనమే "గాజునది". స్త్రీ పురుష సమానత్వం, సర్వమానవ సౌభ్రాతృత్వం లక్ష్యాలు ఎన్నుకున్న కవయిత్రి ప్రతీ అడ్డంకినీ పదునైన కవిత్వంతో ఎదిరించారు. స్త్రీలపై దురాగతాలు, పనిమనుషులు అనుభవించే దుస్థితి, జీవితంలోని ఎన్నో పార్శ్వాల్లో వర్ణించారు. 'నాకూ ప్రపంచానికీ ఈ గాజు బంధమేమిటి?' కళ్లజోడు మరచిపోయి బయలుదేరిన రోజునీ, 'పగిలిన శబ్దం మధ్యన/ పడిలేచిన అవయవ క్షణాన్ని' కవిత్వీకరించిందీ ఒకే కలం. తస్లీమా మీద దాడిపై, హరిప్రసాద్ చౌరాసియా వేణుగానంపై కవితలు చెప్పిందీ ఒకే గళం. ఆవేదన కలిగినా, ఆనందం కలిగినా కవితను సాంత్వన కోసం, చైతన్యం కోసం ఆశ్రయించిన రచయిత్రి ఆ భావాల్ని పాఠకులకూ పంచుతారు.

**- పవన్**

రచయిత్రి: శిలాలోలిత; పుటలు: 140; వెల: 80;
ప్రతులకు: ప్రముఖ పుస్తకకేంద్రాల్లో; 93913 38676

## ఆనంద వీధిలో



తన మొదటి పుస్తకానికే ఉత్తమబాల సాహిత్య పురస్కారాన్ని అందుకున్న దాసరి వెంకటరమణ రాసిన మరో పుస్తకం ఆనందం. ధర్మవర్తన, నిజాయతీ, ఆత్మ సంతృప్తి అనేవి మనిషి జీవితంలో ఎలా ఆనందాన్ని కలగజేస్తాయి అనే అంశాన్ని పిల్లల మనసును కట్టిపడేసేలా చిన్న చిన్న కథల ద్వారా చక్కగా తెలియజేశారు. స్పష్టత, సరళత కలిగిన కథాకథనం పాఠకుల్ని ఆనంద వీధిలో విహరింపజేస్తుంది. మొత్తం 22 కథలున్న ఈ పుస్తకంలోని ఏడు కథలు విజయవాడలోని వికాస విద్యావనం హైస్కూలులో ఆరో తరగతి విద్యార్థులకు పాఠ్యాంశంగా ఎంపిక కావడం అభినందనీయం. సుప్రతీకుడి ప్రశ్నలు, ఆనందం, రూపాయి సమస్య, మేలు కుట్టిన దొంగలాంటి కథలు ఆలోచనని రేకెత్తించేవిగా ఉన్నాయి. మొత్తానికి చిన్నారులకు పసందైన ఆనందాల విందు ఈ ఆనందం పుస్తకం.

**- సునీతా సత్యనారాయణ**

రచయిత: దాసరి వెంకటరమణ; పుటలు: 120, వెల: రూ.100, ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాల్లో; 90005 72573

## కావ్య కదంబమే...



రచయిత్రి: డా॥ ఎ.శ్రీదేవి ; పుటలు: 232; వెల: రూ. 150; ప్రతులకు: రచయిత్రి; నంద్యాల, కర్నూలు, 08514 247887

ఆధ్యాత్మిక భావాలను అక్షరీకరించి మనసులను ఆనందింపజేసే పద్యాలు, కవితల కదంబమే ఈ 'కావ్యకాదంబిని'. సామాజికం నుంచి ధార్మికం వరకూ ప్రతీది స్పృశించారు రచయిత్రి డా॥ ఏ.శ్రీదేవి. దేవి దరహాసమాలలో '**వ్యాసాలు నీ లేఖినీ విన్యాసాలు/ పద్యాలు శారదా పద మంజీరాలు/ గద్యాలు గనులుగావనులుగా...**' అంటూ తన అక్షర విన్యాసాలతో లలితాదేవిని స్తుతించారు. అలానే '**పలికెడిది అమ్మ చరితము/ పలికించెడిది ముగ్గురమ్మల మూలపుటమ్మ/ పలికిన మనసులు కుదురును/ పలికెద వేరొండు గాథ పలుకగనేలా!**' అని భాగవతంలో పోతన పద్యానికి ప్రతిబింబంగా రాశారు. మహాసంకల్పం లో '**మనమంతా మానవులం/ మమకారానికి వారసులం/ శ్రీకారానికి చెరగని సిరులం...**' అని మన జీవన విధానంలో సుందర రహస్యాన్ని చెప్పారు. ఏనాటిదో ఆకాశంలో కవితా వస్తువులన్నీ 'మలయ సమీరాలు, మమకారాల విరిసోనలు, నరాల నక్షత్రాలు' వంటి వినూత్న పదాల్ని సులభంగా అర్థమై, హృదయాన్ని హత్తుకునేలా ప్రయోగించారు.

**- శ్రీవ్యాస్**

## ఉదాహరణ వాణి



రచయిత: సన్నిధానం నరసింహశర్మ; పుటలు: 43; వెల: 40; ప్రతులకు: సన్నిధానం శతకీర్తి, రాజమండ్రి, 92920 55331

ఇది తెలుగులో మాత్రమే మొలకలెత్తి మారాకు తొడిగిన ప్రత్యేక సాహిత్య ప్రక్రియ. వాక్యం పదాల కూర్పు. వాటి నడుమ హృద్యమైన పొంతన కుదర్చటానికి నిరంతరం శ్రమించే స్నేహానురక్తులు విభక్తులు. అలాంటి వాటికి ఒక విశేష గౌరవాన్ని ఇవ్వాలనే తలంపుతో సంస్కృత కావ్యాంతరాలలో ప్రయత్నం జరిగింది. అవి తెలుగులో ఉదాహరణ కావ్యాలుగా విశిష్ట స్థానాన్ని సంపాదించుకున్నాయి. వాసిలో స్వల్పమే అయినా రాశిలో మిన్నగా నిలిచాయి. వాటికి జత కలిసేదే ఈ బ్రౌను ఉదాహరణం. తెలుగు మెదళ్లను పచ్చికబయళ్లకు మళ్లించిన సాహితీ గోపాలుడు బ్రౌను. మాతృరుణంలాగే సారస్వత రుణం ఎంత తీర్చినా తీరదు. సాంప్రదాయికంగా దైవాన్ని ఉద్దేశించి ఉదాహరణ కావ్యాలు వచ్చాయి. ఇప్పుడు ఉదారుడైన బ్రౌనుపరంగా దీన్ని రచించి సన్నిధానం వారు ధన్యులయ్యారు. ఇది తెలుగు వాణికి ఒక వినూత్నాభరణం.

**- లవలి**

# కొత్తతరానికి తెలుగు అమ్మభాషకు వెలుగు



**అమ్మభాషలో పిలుచుకునే వరుసలు మాయమవుతున్నాయి. అన్యభాషల పదాలు అందలమెక్కుతున్నాయి. వాడిపోతున్న తెలుగు సంస్కృతిని ఇంటి నుంచే ప్రోది చేయాలి. తెలుగు మాధ్యమ బడులకు ఆదరణ మెరుగవ్వాలి. మాతృభాషను నమ్ముకున్న ఉపాధ్యాయులకు ఊతమివ్వాలి. అప్పుడే తెలుగు పరిపుష్టమవుతుంది.**

మమతలొలికించే మాతృభాషలో 'మాటలు' ఈ రోజుల్లో మృగ్యమవుతున్నాయి. తరాలు మారుతున్న కొద్దీ తెలుగు పలుకులు పెళుసుబారి పోతున్నాయి. 'నరవర నీచే నాచే వరమడిగిన కుంతి చేత వాసవుచేతన్, ధరచే, భార్గవు చేతన్ అరయంగా కర్ణుడీల్గె నార్గురిచేతన్' అన్నట్లు సవాలక్ష కారణాలు తెలుగుకు తెగులంటిస్తున్నాయి. ఆ చీడను వదిలించాలంటే ఏం చేయాలి? జాతికి సాంస్కృతిక సిరులనందించే భాషను బతికించుకోవాలంటే ఎవరు, ఎలాంటి కృషి చేయాలి?

కుటుంబం, సమాజం, సాంస్కృతిక, విద్య, వ్యవహారాలు, ప్రభుత్వమనే ఆరు కోణాల నుంచి నిర్మాణాత్మక కృషి జరిగితేనే తెలుగు భాషా పరిరక్షణ సాధ్యమవుతుంది. పిల్లలు ఏ మాధ్యమంలో చదువుతున్నా ఇంట్లో మాత్రం తెలుగు భాషనే వినియోగించాలి. అమ్మానాన్నలు ఆమేరకు జాగ్రత్తలు తీసుకోవాలి. మన భాషా సంస్కృతుల గొప్పదనం గురించి తమ మాటల్లో యథాలాపంగా తెలియజేయాలి. పిల్లలకు అర్థమయ్యే స్థాయిలో నిరంతరం చెప్పాలి. పిల్లల తెలుగు మాటల్లో తప్పులు దొర్లితే సరిచేయాలి. తెలుగు సంవత్సరాలు, నెలలు, తిథులు, వారాలు, బాంధవ్యాల (బాబాయి, పిన్నీ, మావయ్య, అత్తయ్య...)ను పరిచయం చేయాలి. ఇంట్లో ప్రతి కార్యక్రమ నిర్వహణలో పిల్లలను భాగస్వాములను చేస్తూ అన్ని వస్తువుల పట్ల వారికి తెలుగులో అవగాహన పెంపొందించాలి. బాలగేయాలు, కథలు, సామెతలను సందర్భానుసారంగా చెబుతూ ఆసక్తి పెంచాలి.

తెలుగు పరిరక్షణలో ప్రధాన పాత్ర పోషించేది సమాజం. ప్రదేశాలకు, కొత్త నిర్మాణాలకు మనవైన పేర్లు పెట్టాలి. కుల, మత సామరస్యంతో భాషా సంస్కృతులను సమన్వయం చేసి సమ్మేళనం చేయాలి. ఇతర భాషీయులతో వ్యవహరించేటప్పుడు మన భాషను మనం తక్కువ చేసుకోకూడదు. తెలుగులో మాట్లాడే వారిని అవమానించొద్దు. అన్ని మాండలికాలు, యాసలకు సమ గౌరవమివ్వాలి. ప్రాథమిక స్థాయి నుంచే పిల్లలు వివిధ సామాజిక, సామూహిక కార్యక్రమాల్లో పాల్గొనే విధంగా జానపద కళారూపాల ప్రదర్శనలు, భాషా పోటీలు నిర్వహించాలి. ఎన్నికల వేళ ఓట్ల కోసం వచ్చే నేతలను 'భాషకు మీరేం చేస్తార'ని ప్రశ్నించాలి. ఆమేరకు హామీలు రాబట్టాలి. వాటి అమలుకు పట్టుబట్టాలి. వ్యక్తిగత సంస్కారాలు, వివాహాలు, అక్షరాభ్యాసాలు వంటి కార్యక్రమాలన్నింటికీ పిల్లల్ని సమూహాలుగా ఆహ్వానించాలి. వారికే కొన్ని బాధ్యతలు అప్పగించాలి. ఈ క్రమంలో వారు మన సంస్కృతిని తెలుసుకుంటారు. ప్రేమిస్తారు.

సమాజంలో తెలుగు అంతర్లీనంగా విస్తరించడానికి సంస్కృతీ సంప్రదాయాల పరిరక్షణ దోహదం చేస్తుంది. కుల, మత, లింగ, వయోభేదం లేకుండా ఎదుటివారిని తెలుగులో పలకరించాలి. సంభాషణలను తెలుగులోనే సాగించాలి. మనదైన కట్టు బొట్టులను కొనసాగించాలి. ముఖ్యంగా వాటి విశిష్టతను చిన్నారులకు విడమరచి చెప్పాలి. ఇతర భాషా సంస్కృతుల ప్రభావం పిల్లలపై పడకుండా చూడాలి. సమాజంలో తప్పుడు పోకడలను గుర్తించి, నియంత్రించడంలో మేధావులు మార్గదర్శులు కావాలి. దీని వల్ల పరోక్షంగా భాషకు మేలు కలుగుతుంది. అంతరాత్మ నుంచి ఆవిర్భవించిన శబ్దరాశి, అసంకల్పిత భాష మన తెలుగు అని గుర్తుంచుకుంటే చాలు 'పలుకు'కు అదే పదివేలు.

అన్ని వర్గాలను భాగస్వాముల్ని చేసేది, ప్రభావితం చేసేది విద్య. ప్రతిఒక్కరూ మాతృభాషలో చదువుకునే స్వేచ్ఛ, వనరులు కల్పించాలి. ఇతర మాధ్యమాల్లో

విద్యాభ్యాసం చేసే వారికి ఒక అంశంగా తెలుగును నిర్బంధంగా నేర్పించాలి. ఇంట్లో మాట్లాడుకునే యాస, నుడికారంలోనే పూర్వ ప్రాథమిక స్థాయి విద్యనందించాలి. ఆ స్థాయి వరకు పఠనాంశాల(సిలబస్)ను స్థానిక జిల్లా అధికారులు, భాషావేత్తలు రూపొందించి, ముద్రించేలా మార్గదర్శకాలు రూపొందించాలి. దీనివల్ల మాండలిక అసమానతలు, భేదాలు, మానావమానాల ప్రసక్తి రాదు. తాను ఇంట్లో మాట్లాడే తెలుగు భాషనే బళ్లో చదువుకుంటున్నానన్న విశ్వాసం, తృప్తి విద్యార్థికి కలుగుతుంది. ఈ స్పృహ భాషపై ధనాత్మక భావనలకు పునాదవుతుంది. పుస్తకాల్లో వ్యవహారిక భాషే నిలవాలన్న గిడుగు రామ్మూర్తి ఆశయం నెరవేరుతుంది. దాంతోపాటు తెలుగు వాచకాల్లో భాషా సంస్కృతీ సంప్రదాయ పౌరాణిక, నీతి, జ్ఞాన అంశాలే ఉండాలి. శాస్త్ర సాంకేతిక, చరిత్రలకు సంబంధించిన పాఠాలు పెట్టకూడదు.

ప్రాంతీయ భాషా పరీక్షల్లో ఉత్తీర్ణులైతే తప్ప పదోన్నతి పొందలేరన్న నిబంధన అఖిల భారత సర్వీసుల్లోని అధికారులకు ఉంది. కానీ, ప్రజలతో నిత్య సంబంధ బాంధవ్యాలు కలిగి ఉండే వైద్యులు న్యాయవాదులు, ఇంజనీర్లకు లేదు. ఫలితంగా వారు ప్రజలను ఆత్మీయంగా పలకరించి, కష్టనష్టాలు తెలుసుకోవడంలో తిప్పలు పడుతున్నారు. కచ్చాపచ్చా మాట్లాడుతూ వృత్తుల్లో కొనసాగుతున్నారు. ఉన్నత విద్యా కోర్సులన్నింట్లో తెలుగును తప్పనిసరి పాఠ్యాంశం చేస్తే తప్ప ఈ పరిస్థితి మారదు.

బడుగు బలహీన వర్గాల వారు మాత్రమే ఎక్కువ సంఖ్యలో ప్రభుత్వ పాఠశాలల్లో తెలుగు మాధ్యమంలో చదువుతున్నారు. కాబట్టి వారి తల్లిదండ్రులకు ఆత్మస్థైర్యం కల్పించాలి. తెలుగు మాధ్యమంలో చదివిన వారిని ఉద్యోగ, ఉపాధి ప్రాప్తిలో తగిన విధంగా ప్రోత్సహించాలి. ప్రభుత్వ పాఠశాలల్లో చేరికలను పెంచాలి. ప్రభుత్వ విభాగాలకు తెలుగు పేర్లు పెట్టాలి. విద్యా సంబంధిత కోర్సులనూ తెలుగులోనే పిలవాలి.

ప్రతి రంగంలో వ్యావహారిక పదకోశాలు, సాంకేతిక పదకోశాలు, నిఘంటువులు, తులనాత్మక పదకోశాలు రూపొందించాలి. అధికార భాషా సంఘం, రాష్ట్ర సాంస్కృతిక శాఖలు క్రియాశీలమవ్వాలి. తెలుగులో ఉత్తర్వులు, తీర్మానాలు, నిర్ణయాలు వెలువడేలా శాసించగలగాలి. అధికార భాషా సంఘానికి తగినన్ని నిధులు కేటాయించి విధులు, బాధ్యతలు నిర్ణయించి అమలు చేసేందుకు ఒత్తిడి తేవాలి. ఆంధ్ర సారస్వత పరిషత్తు, ప్రాచ్య కళాశాలలను ప్రోత్సహించాలి. మండల స్థాయిలో భాషా సంస్కృతుల పరిరక్షణ సమితులను నెలకొల్పాలి.

'తెలుగు' పేరిట ప్రారంభమైన పొట్టిశ్రీరాములు విశ్వవిద్యాలయంలో కేవలం భాషా సంస్కృతీ సంప్రదాయాలు, సంగీత, నృత్య, నాటక, చిత్ర, దృశ్య, శ్రవణ, ప్రసార ప్రచార విభాగాలను మాత్రమే నిర్వహించాలి. చలనచిత్రాలు, టీవీల్లో వినియోగించే భాషను పరిశీలించి, తప్పొప్పులను సరిచేయడానికి ఓ విభాగాన్ని నెలకొల్పాలి. సంస్కృతీ సంప్రదాయాల ప్రచారానికి సంచార విభాగం ఏర్పాటు చేయాలి.

తెలుగు భాషనే నమ్ముకుని జీవితాలు వెళ్లదీస్తున్న భాషా పండితులకు చేయూతనివ్వాలి. ప్రాథమిక స్థాయిలో ప్రతి విద్యార్థికి అక్షరమాల, గుణింతాలు నేర్పేందుకు తెలుగు పండితులను నియమించాలి. ద్వితీయశ్రేణి ఉపాధ్యాయుల (ఎస్‌జీటీ)తో మాత్రమే సమానంగా వేతనాలు పొందుతున్న తెలుగు పండితులను ప్రాథమిక స్థాయిలో నియమించకుండా ప్రాథమికోన్నత ఉన్నత పాఠశాలల్లో నియమిస్తున్నారు. దీనివల్ల 'నేల విడిచి సాము' చేసిన చందంగా భాషాశిక్షణ కొనసాగుతుంది. దీంతో అచ్చుల్లోని హ్రస్వాలు, దీర్ఘాలు బేధాలు, హల్లుల్లోని అల్ప, మహా ప్రాణాల బేధాలు, సంయుక్త, ద్విత్వాక్షరాల వినియోగాలను సైతం గుర్తించలేక విద్యార్థులు ఇబ్బంది పడుతున్నారు.

స్నాతకోత్తర పట్టాలు, పండిత ఉపాధ్యాయ శిక్షణలు పొందిన పండితులు పదోన్నతులు లేక నలిగిపోతున్నారు. ఇంటర్మీడియట్, డీఎడ్ చేసి ఉద్యోగంలో చేరిన ద్వితీయ శ్రేణి ఉపాధ్యాయులు దూరవిద్య ద్వారా విద్యార్హతలు పెంచుకున్న కొద్దీ, అనుభవం పెరిగిన కొద్దీ మూడేసి పదోన్నతులు పొందుతున్నారు. గెజిటెడ్ ప్రధానోపాధ్యాయులు మండల విద్యాధికారులు అవుతున్నారు. పండితులపై అధికారం చలాయిస్తున్నారు. అంతకంటే ఎక్కువ విద్యార్హతలతో నియమితులైనా తెలుగు పండితులు మాత్రం ఎక్కడి వారక్కడే 'ఎక్కడ వేసిన గొంగళి అక్కడే' అన్నట్లు మిగిలిపోతున్నారు. అందుకే... పండితులు కావడానికి యువతరం ఆసక్తి చూపట్లేదు. కావాలంటే... ఏ ఉన్నత పాఠశాలకైనా వెళ్లి చూడండి, గణితం, ఆంగ్లం, సాంఘిక, సామాన్య శాస్త్రాలను బోధించే వారిలో నవయువకులు ఎక్కువగా కనిపిస్తారు. తెలుగు పండితులుగా మాత్రం వయసు పైబడిన వారే ఉంటారు. ఈ పరిస్థితిలో మార్పు వస్తేనే నవతరానికి తెలుగు చేరువవుతుంది.

భాషోద్యమాలు గ్రామస్థాయికి వెళ్లాలి. సదస్సులు, గోష్ఠుల్లో పల్లె ప్రజలకు ప్రాధాన్యతనివ్వాలి. వారి అభిప్రాయాలను తెలుసుకోవాలి. తెలుగులో ఉన్న గొప్పదనమేంటి, ఎందుకు చదువుకోవాలనే ప్రశ్నలకు సమర్థనీయంగా వివరణ ఇవ్వగల ఆత్మస్థైర్యం భాషా వినియోగదారుల్లో పెంచేలా ఉద్యమాలు సాగాలి. స్వచ్ఛంద సంస్థలు, ప్రభుత్వ యంత్రాంగాలు, పత్రికలు, ప్రసారమాధ్యమాలు, వ్యక్తుల సమన్వయంతో ప్రణాళికాబద్ధంగా తెలుగుకోసం కృషి జరిగే వాతావరణాన్ని సృష్టించాలి. ఈ దిశగా ప్రతి భాషాభిమాని వడివడిగా అడుగులేయాలి.



**మాడుగుల నారాయణమూర్తి**
ఆసిఫాబాద్, ఆదిలాబాదు,
94411 39106

# ఊరు కన్నీరెట్టింది

సుబ్బమ్మ చచ్చిపోయింది. సుబ్బమ్మ చచ్చిపోయింది. సుబ్బమ్మ చచ్చిపోయింది.

ఊళ్లో ఎక్కడ విన్నా ఇదే మాట. బజారులో గుంపులు గుంపులుగా చెప్పుకోసాగేరు.

"వొశమ్మ కూతురా ఎట్ట చచ్చిపోయిందే! మణిసి బాగా రివటలాగా తిరుగుతుంది గదే! అగనాతకంగా పోయింది గదే. అయ్యయ్యో" తులసమ్మ కంట్లో చెమ్మ తొంగి చూసింది.

"మెల్లె సవకమెల్లెలాగా ఉండేది. పనిలో వొంగిందంటే చకచకా చేసుకుపోయేది. మునుం బట్టిందంటే అందరి కంటే ఒకడుగు ముందుండేదే కానీ ఎప్పుడూ యెనుక పడిందేలేదు. పదండెహే పదండి చూసొద్దాం అంటూ పాలకేంద్రం దగ్గర పాలు పోసినోళ్లందరూ కదిలారు.

"అత్తా కోడళ్లంటే అట్టుండాల అంటారు శానామంది. ఇద్దరి కిద్దరూ బలే సక్కెంగా ఉండేవాళ్లంట గదా మా లక్ష్మమ్మత్తా" కొత్త కోడలు నాగరత్నం అడిగింది.

అత్తా కోడళ్లంటే అట్టానే ఉండాలమ్మా. సుబ్బమ్మకి పదిహేనేళ్లకే పెళ్లయ్యింది. పెళ్లయినప్పుడు నుంచీ అత్తతో కలిసి ఇంటెడు



చాకిరీ చెయ్యడం, పొలంలో పని చేసుకోవడం రొండూ రొండు చేతుల్తోటి నెట్టుకొచ్చారు. ఒకేళ సొంత పని లేకపోతే ఎవురివద్దకైనా కూలికైనా పోయేవాళ్లుగానీ, రొండు కాళ్లూ ఒక చోట పెట్టిన పాపాన పోయినోళ్లుకాదు.

పసుపుతాడు మెళ్లో పడ్డప్పటి నుంచీ ఇది నా ఇల్లు. ఇది నా సంసారం అనుకుంది సుబ్బమ్మ. అత్త ఆరళ్లు పెట్టిందీ లేదు, కోడలు ఇరసాల మిట్ట ఎక్కిందీలేదు. ఇద్దరూ ఎవురికి వాళ్లు అత్తా కోడళ్లయినా, తల్లీకూతుళ్లలాగా కలిసి మెలిసిపోయేరు.

మామ లేకపోయినా అత్త అగనాతకంగా పనులు చేసెయ్యడం కంటితో చూసిన సుబ్బమ్మ ఏనాడూ వొళ్లు దాచుకోలేదు. మొగుడు కాస్త వొంటూపిరోడైనా, కుశాలుగానే ఉండేవాడు. దున్నపోతులను పొడుచుకుంటూ ఉండ రొండు కయ్యాల్లో ఎగసాయం చేసేవోడు. ఇంటికొస్తే కాళ్లు బార్లా చాపేవోడు. కాబట్టే అత్తాకోడళ్లకి ఆయన్తో వొచ్చిన చిక్కులే లేవు. ఇంటి పనుల్లో ఆయన ఏలు పెట్టినా పెట్టక పోయినా చెరొక పని చేసేవాళ్లు ఇరుగుపొరుగు వాళ్ల పనులు కూడా అందుకొని అత్తకు తగ్గ కోడలు, కోడలికి తగ్గ అత్త అనిపిచ్చుకున్నారు.

ఏందమ్మా తల్లే అత్తాకోడళ్లు తియ్యాబెట్టకుండారు. ఎటొచ్చిపోయి తిప్పిచ్చి మల్లిచ్చి పనులు చేసుకుంటా వుండారుకానీ, ఒకర్నొకమాట అన్న పాపానగానీ, వొకరా జోలికి వొచ్చినట్టుగానీ, వొకర్నొక సలహా అడిగినట్టుగానీ అగుపించరు. ఎప్పుడూ రివటల్లానే పనులు చేసుకుంటూనే పోతా వుంటారు అంటా బుగ్గలు నొక్కుకునే వోళ్లు అందరూ.

కోడికూతకి ముందే లేసేవోళ్లు. ఒకరు కసవు చిమ్మితే ఇంకొకరు కళ్లాపి చల్లేవోళ్లు. ఒకరు పాలు పిండితే ఇంకొకరు చల్ల జేసేవాళ్లు. ఒకరు పొయ్యి ముట్టిస్తే ఇంకొకరు అంట్లు తోమేవాళ్లు. సద్దికూటేలకి ముందే పొలమెల్లి పన్లోకి వొంగేవోళ్లు. యెనకమాల వొచ్చినోళ్లు తల్లో ఈ అత్తాకోడళ్లు కాళ్లకి చక్రాలు తగిలించుకోని తిరుగుతుండారే. మరీ ఏందమ్మా పొద్దుపొడవనియ్యరు, పొలాల్లోకి రావడానికి. పొద్దుగూకే దాకా చేస్తానే వుంటారు గదమ్మా. ఒకరికొకరు బాగా సరిపోయేర్లే అని నవ్వుకునేవోళ్లు.

ఎనకటి జల్మలో తల్లీకూతుళ్లయి పుట్టుంటారే. లేకపోతే ఇట్టాంటి కోడలు ఎక్కడ దొరుకుతుందే. నాకూ ఉండారు కోడళ్లు కోసక తింటానికా అని ఎంతో మంది అనుకునేవోళ్లు.

అందరికీ అత్తాకోడళ్లు తల్లో నాలుకలై మెసులుకుంటా అరమరికల్లేకుండా ఉంటున్నప్పటికీ, సుబ్బమ్మకి ఒక నలుసు పుడితే బాగుండును. అన్నీ ఇచ్చి ఆ బగమంతుడు అదొక్కటీ ఇయ్యలేదే అని

బాధపడేది అత్త. నారు పోసినోడు నీరు పొయ్యకపోతాడా. మనుషుల్ని కలిపినోడు బిడ్డనియ్యకపోతాడా. ఇయ్యాల కాకుంటే రేపు, రేపు కాకుంటే ఎల్లుండి. ఇప్పుడంత తొందరేమొచ్చింది నాకేమన్నా వొయిసైపోయిందా అంటూ అత్తనే వూరడిచ్చేది కోడలు.

కొన్నాళ్లకి ఆ లోటు కూడా తీర్చేశాడా బగమంతుడు. సుబ్బమ్మకి కడుపులో కాయ కాసిందని తెలిసినప్పటి నుంచీ అత్తకి యాడలేని సంబరమంతా వొచ్చి కూర్చుంది. కోడల్ని అరిచేతుల మీదగా నడిపిచ్చేదా అన్నట్టుండేది అత్త. అటు పుల్లదీసి ఇటు పెట్టినా ఊరుకోడంలేదు. డాక్టర్ల దగ్గరికి తిప్పింది తిప్పినట్టే ఉంది. వాళ్లిచ్చిన మందుల్ని దగ్గరుండి మింగిచ్చేది. ఏ పని దగ్గరికీ రానిచ్చేదికాదు.



కోడలికేమో ఆ పనీ ఈ పనీ అందుకొని చేసీ చేసీ అలవాటైపోయి, పని లేకుండా గోళ్లు గిల్లుకుంటా కూర్చోని తినడం చాలా బాధగానూ ఇబ్బందిగానూ అనిపించసాగింది.

తొలి కాన్పు కదా పుట్టింటికి తీసుకెళ్దామని అమ్మొచ్చింది. నేను రానుపోమ్మా నీ దగ్గరికి వొచ్చినప్పట్నుంచీ ఒకటే నసుగుతుంటావు అంది సుబ్బమ్మ. అత్త ముసిముసి నవ్వులు నవ్వుకుంది.

యాణ్ణో సావండమ్మా మీకెవురు సెప్పినా ఇనే రకాలుగాదులే. ఇద్దరూ ఒకరికొకరు తోడయ్యేరు. ఇంక మీ గడప తొక్కితే వొట్టు అంటూ కోపంగా వెళ్లిపోతుంటే, నువ్వు తొక్కేదేంది గడప నా మనవడే తొక్కిస్తాడు అంటూ సరసమాడింది వియ్యపురాలు.

ఇంక పిల్లాడికి కావలసిన సరంజామా అంతా కొనడం, వాడిని ఆడించడంలోనే పొద్దుపోవడం తెల్లారడం అయింది నాయనమ్మకు.

పిల్లోడు పెద్దోడు అయ్యేకొద్దీ అత్తకి వొయిసు మీద పడసాగింది. పొలమెళ్లే వోపిగ్గూడా లేక ఇంటిదగ్గిరే ఉండసాగింది. ఇంటి పనులు చెయ్యడానిక్కూడా ఓపికలేక కూర్చునే జరిగి జరిగి చేసుకుంటంది.

నీకెందుకత్తా ఈ పన్లన్నీ నేను చేసుకుంటానుగా అంటా విసుక్కునేది కోడలు. ఇయ్యేమి నేను జెయ్యలేని పన్లు గాదులే అంటూ ఒకదాంతర్వాత ఇంకోపని లంకిచ్చుకోని చేస్తా ఉండేది.

అట్నే పనులు చేస్తా చేస్తా ఒక రోజు కూర్చున్నది కూర్చున్నట్టే ఎల్లకిలా పడిపోయింది. మరింక లేవనేలేదు. అబ్బబ్బా ఎట్టాంటి చావు చచ్చిందిరా. కోడల్ని ఒంటిదాన్ని జేసి యెల్లిపోయింది గదరా ముసిల్ది అనుకున్నారందరూ.

సుబ్బమ్మ నెత్తీనోరూ బాదుకుంది. అత్తలేని బతుకూ ఒక బతుకేనా అనుకుంది. కూడూ నీళ్లూ ముట్టింది లేదు. పెద్ద దినం నాటికి లంకణాలు జేసినట్టు అయిపోయింది. ఇదేందమ్మా యాడన్నా ఉందా అత్తకి ఆయుస్సు మూడింది ఎల్లిపోయింది. ఇంత మంచి సావు ఎంత మందికొచ్చిద్ది. ఇట్టాంటి సావు రావాలంటే ఎంత పున్నెం జేసుకోని ఉండాల. దీనికే ఇంత ఉబ్బిద్రం అయితే ఎట్టమ్మా సోద్దెం గాకపోతే సోద్దెం అన్నారందరూ.

అయినా సుబ్బమ్మ మణిసిగావడానికి చాలా కాలం బట్టింది. జరిగే పనులు పెనిమిటికి అంతగా పట్టలేదు. ఆ మణిసి రాత్రి సీకట్లో వేడి తగ్గించుకోడానికి మాత్రమే సుబ్బమ్మ పక్కకి వొచ్చేవోడు. పగలు కూడు తినేటప్పుడు మాట్లాడేవోడు. ఇంక ఆయనేందో ఆయన పనేందో. ఒక మంచీ చెడూ లేదు. ఒక మాటా మంతీ లేదు.

అత్త ఉన్నంత కాలం ఆయన్నో పిల్లోడి మాదిరిగానే చూసింది. అత్త పోయిన తరువాత సుబ్బమ్మకి ఇద్దరు పిల్లలయ్యారు. కట్టుకున్నోడి సేవలూ తనపైనే పడేసరికి సుబ్బమ్మ కొంతకాలం ఉక్కిరి బిక్కిరయ్యింది. అయినాగానీ అన్నీ సముదాయిచ్చుకోవడానికి కొంత కాలం పట్టింది సుబ్బమ్మకి.

కొడుకు పెరిగి పెద్దోడయ్యాడే గానీ పనీ పనీ అని పనుల మీద బడి కొడుకుని సుబ్బమ్మ పెద్దగా పట్టించుకోక పోవడం వల్ల చదువంతగా అబ్బలేదు. ఊళ్లో బళ్లో అయితే అల్లరి చిల్లరిగా తిరుగుతుండాడని ఎక్కడో దూరంగా ప్రాసంగులపాడులో బడి బాగా సెబుతారని అక్కడికి తీసుకెళ్లి యేసింది. అక్కడా కుదురుకోకపోగా తగాదాలు తెస్తుండాడని బడోళ్లు సెబితే అక్కణ్నుంచి తీసుకొచ్చి కొత్తపట్నం బళ్లో యేసింది. అక్కడ ఉండి సదువుకున్నప్పటికీ తెలివిమంతుడు కాకపోవడంతో లాభం లేకపోయింది. అత్తెసురు మార్కులతో పదో తరగతి గట్టెక్కేడు.

ఊళ్లో ఉంటే సెడిపోతాడని, దూరబ్బంధు వొకాయన హైదరాబాద్‌లో ఉంటే ఆయన దగ్గరికి పంపిచ్చింది. పొలం పనీ, ఇంటి పనులన్నీ ఒకతే చూసుకోవడం వల్ల మణిసి మరీ ఎండు కట్టెలాగా తయారయిందని అందరూ తలో మాటా అనసాగారు. ఒక్క కొడుకే గదా తినీ తినకా అంతా ఆయనకే పెట్టి పంపిచ్చాలనుండాదా ఏందని యెగతాళి పట్టియ్య సాగేరు కూడా.

ఏ మాటకైనా నవ్వే సమాధానంగా సాగిపోయేది సుబ్బమ్మ. యేందమ్మా తల్లీ మేం మాట్లాడతానే ఉంటాము నీ పాటికి నువ్వు నవ్వుకుంటా యెల్లిపోతే సరిపోయిద్దా అన్నా ఆగేది కాదు.

అత్త పోయినప్పటి నుంచి కొడుక్కీ, కొడుకుతో పాటు కోడలికీ నోరు పడిపోయింది అనేవాళ్లు. అత్త పోయినాక దానధర్మాలు చెయ్యడం కోడలి వొంతయ్యింది. ఇంటి ముందుకొచ్చిన ఎవుర్నయినా ఉత్త చేతుల్తో పంపేది కాదు. ఊళ్లో ఎవురికి ఏ ఆపదొచ్చినా వొచ్చి ముందుడేది సుబ్బమ్మ. అత్తని మించిన కోడలు అనిపిచ్చుకుంటున్నావుగా. దానాలు జేసింది ధర్మాలు జేసింది. మారాజులా యెల్లిపోయింది. పోతాపోతా ఆ గుణం నీకిచ్చిపోయింది అనేవాళ్లు అందరూ.

కొడుక్కి సదువబ్బకపోయినా, తల్లి మాట్టాడి ఇడిసి పెట్టిన దగ్గర మంచి పనోడని గుర్తింపు తెచ్చుకున్నాడు. అట్టెదిగి అట్టెదిగి ఆయన చేతికింద ఉండే ఒక షాపుకి మేనేజరయ్యాడు.

ఒక శుభ ముహూర్తాన కొడుక్కి పెళ్లి జేసింది. అబ్బో మంచి ఎర్రపిల్లని తెచ్చి చేశావుగా కొడుక్కి. కోడల్ని నీ దగ్గిరే ఉంచుకుంటావా ఏంది అనేవాళ్లు ఇరుగుపొరుగు. కోడల్ని నేనుంచుకోటానికంటే కొడుక్కి పెళ్లి జేసింది. మీ అందరూ మీ కోడళ్లని కూడా మీ దగ్గిరే ఉంచుకుంటున్నారా మాటకి మాట అంటిచ్చింది.

పెళ్లయినప్పటి నుంచీ కొడుక్కి సంపాయించ్చాలనే తపన ఇంకా పెరిగింది. రాత్రింబవళ్లూ కష్టపడినా లాభముండటం లేదు. ఒక అయ్యకాడ ఎంత కాలం పనిజేసినా గొర్రె తోక బెత్తెడే కదా. అదే పని సొంతంగా జేసుకుంటే అంతకంతా సంపాయించొచ్చుగదా అనుకుని వూళ్లో పొలం అమ్ముదామమ్మా అంటూ వొచ్చాడు కొడుకు.

సుబ్బమ్మ గుండెల్లో రాయిపడింది. అయ్యా పొలమమ్మినోడూ, వల్లకాటికి పోయినోడూ ఒకటేనయ్యా. రైతు పుటక పుట్టినోడెవుడూ పొలం సంపాయిచ్చుకోవాలనుకుంటాడే కానీ, అమ్ముకోవాలని చూడడయ్యా అని చాలా దూరం చెప్పింది. అయినాగానీ కొడుకు చెవికెక్కలేదు. అప్పటి నుంచీ అలిగి మాట్లాడడం మానేశాడు.

తాను పట్టిన కుందేలుకి మూడే కాళ్లన్నట్టుంది ఈడి వరస. సరే కానియ్యి ఉండది ఒక్కగానొక్క కొడుకు. వాడే అంటీ ముట్టనట్టు, పలికీ పలకనట్టు ఉంటే పొలం అమ్మి పార్నూకుదామయ్యా అని పెనిమిటితో చెప్పింది. ఆయన అగ్గిమీద గుగ్గిలమే అయ్యాడు. పొలం అమ్మడానికి ఈల్లేదన్నాడు. రొండు కయ్యలుండ పొలాన్ని ఇన్ని ఎకరాలు జెయ్యడానికి కిందామీదా పడ్డాం. ఇప్పుడిదేంది రైతు సట్టంలో ఉండొడెవుడన్నా పొలం అమ్మాలని సూస్తాడా అంటా మాట్లాడటమే మానేశాడు. 'అడకత్తెరలో పోకచెక్క'లా అయ్యిందామె పరిస్థితి. అమ్మమంటే అబ్బుక్కోపం వద్దంటే కొడుక్కి కష్టం. కష్టనష్టాలెలా ఉండా సుబ్బమ్మ కొడుకు పక్కనే మొగ్గు చూయించింది. మొగుడూ పెళ్లాలకి ఒక ఎకరం ఉంచుకొని మిగిలింది అమ్మి వొచ్చిన డబ్బంతా ముద్దర సుద్దిగా కొడుక్కిచ్చింది.



అనంతపురం జిల్లాలోని ఓ బస్సులో ప్రయాణిస్తున్న ఓ కవిని, 'యాడికి సార్, టిక్కెట్.. టికెట్?' అంటూ ప్రశ్నించాడు కండక్టర్.

'యాడికి'! బదులిచ్చాడు... తాపీగా కవి, డబ్బులిస్తూ.



“డాక్టర్! డాక్టర్... మీరిచ్చిన కళ్లద్దాలు వాడుతుంటే 'చీమలు' కూడా స్పష్టంగా కనబడుతున్నాయ్” అన్నాడో పేషెంట్, కంటి ఆసుపత్రిలో ఉత్సాహంగా...

“అవి చీమలు కాదు! బొద్దింకలు బాబూ!! నువ్వు చూస్తున్నవి తెల్సా” అన్నాడు డాక్టర్.

**- ఎగ్గోని శ్యామసుందర్,** హైదరాబాద్

అప్పట్నుంచి పెనిమిటి మంచం బట్టేడు. అంతే మంచాన పడ్డోడు తీసుకోని తీసుకోని పోయాడు. అయ్యో చేజేతులా మణిసిని కాజేసుకున్నానే అంటా లబోదిబోమంది.

అయితే కొడుకు జాగర్తపరుడు కావడంతో ఎత్తుకెళ్లిన డబ్బు జాగర్తగా యాపారంలో పెట్టాడు. బాగా కలిసొచ్చింది. రూపాయికి రూపాయి లాబం దీసేడు. యాపారం ఎక్కొచ్చింది. హైదరాబాదులోనే మూడంతస్తుల మేడ కట్టేడు. తనకొకటి ఇంట్లో కొకటి రొండు కార్లు కొన్నాడు.

**ఎనకటి జల్మలో తల్లీకూతుళ్లయి పుట్టుంటారే. లేకపోతే ఇట్టాంటి కోడలు ఎక్కడ దొరుకుతుందే**

ఒకే కాన్పులో ఇద్దరు ఆడపిల్లల్ని కనింది కోడలు. మాలచ్చిమిలు నడిసొచ్చారు సుబ్బమ్మకి. ఇంక ఈడెందుకు నిలుసుద్ది. మనుమరాళ్లని సూసుకోని మురుసుకుంటదిలే అన్నారందరూ.

పురిటి మంచమప్పుడు పోయి చూసి రావడమే ఆ తరువాత కొడుకుకాడికి యెల్లిందే తక్కువ. అయితే అప్పటిదాకా ఒక్క డిల్లీ బర్రెని మేపుతా వచ్చింది. అప్పట్నుంచీ ఇంకా రొండు డిల్లీ బర్రెల్ని కొని మేపసాగింది. ఎకరాలో యేసిన పచ్చిమేత సాలక రొండెకరాలు అదనంగా కౌలుకు తీసుకుంది.

ఇంత మందికి ఇన్ని రకాలుగా సాయం చేస్తున్నా అప్పుడప్పుడూ కొడుక్కు పదేలు పదేలు డబ్బు పంపిచ్చేది. ఊళ్లో పండిన అన్ని రకాల గింజల్నీ కొని పంపిచ్చేది. ఏంది సుబ్బమ్మ కొడుకు అవతల ఓపినంత సంపాయిచ్చి పడేస్తుంటే, నువ్వు ఈణ్నించి పంపిచ్చేదేంది. హాయిగా కాలుమీద కాలేసుకోని కూచ్చోని తినక అనే వాళ్లికి ఒక్కటే సమాధానం చెప్పేది.

కూచ్చోని తినే వాళ్లు ఎట్టుండారో చూస్తున్నారుగా వొంటి నిండా జబ్బులు. కంటితో సూళ్లేరు, పంటితో ఒక్క రవ్వ కొరకలేరు, కడుపు నిండా తినలేరు. కష్టపడతన్నాం గాబట్టే ఒక రోగమూ లేదు రొష్టూ లేదు. పని జేస్తేనే గదంటయ్యా వాళ్లలిసేది. వాళ్లలిస్తేనే గదా తిన్నది వొంటబట్టేది. వో అంత లావు నుండంగానే సరిపోయిందా. ఆరోగ్గింగా ఉండొద్దంటా మణిసి అనేది.

పెట్టి పుట్టింది గానీ, మణిసి తిన బుట్టలేదు. ఎల్లకాలం చెయ్యాలని రాసి పెట్టుంటే ఎవురు మాత్రమేం జేస్తారు. ఈ వొయిసులో గూడా కొడుక్కి ఎదురు బెట్టొస్తంది. తినబుట్టే ప్రాప్తమండాల్లేయే అని ఎదురుగానే అంటుండే వాళ్లు.

ఇంత బక్క ముండ. ఎనికలు కనిపిస్తా ఉంటయ్యి. మణిసేందే ఈ వొయిసులో గూడా మెల్లెలా పని జేస్తుంది. ఎంత ఇసిత్రం గాకపోతే ఈమె కంటే చిన్నోళ్లు ఎంతో మంది సచ్చిపోయేరు. ఇంకొంత మంది కాలూ జెయ్యాడక మంచానబడి తీసుకుంటా తీసుకుంటా ఉండారు. ముసిల్దానిది మొండి పేణంరా నాయనా అనుకునేవాళ్లు.

ఆ రోజెందుకో మణిసి బలే కలవరంగా అనిపిచ్చింది. చూసినోళ్లందరికీ పిల్లల్ని జూడాలనిపిస్తుందిరా కొడుక్కి

కబురుజెయ్యండి అని చెప్పింది. ఇదేంది ఉండఫళాన ఎప్పుడూ ఇట్ట ఇబ్బంది పెట్టిందిగాదే అమ్మ. సమయానికి ఊళ్లో గూడా లేకుండా పోయేను. పిల్లల్ని తీసుకుని నువ్వెళ్లని భార్యకి జెప్పిదూరాభారం నుండోడు కాస్తా పనులన్నీ ఆపేసుకోని బయలుదేరాడు కొడుకు.

వొంటో కొద్దిగా నలతగా ఉందని పొద్దుట నుంచీ లేవలేదమ్మా ఎప్పుడూ పడుకున్న మణిసి గాదు. అందుకే ఎవురిమీ పట్టిచ్చుకోలేదు. ఎంత పొద్దెక్కినా బైటకి రాలేదేందని ఇంటోకి పోయి చూస్తే మూసిన కన్ను తెరవలేదు. నోట మాటే రావడంలేదు. వొచ్చిన కోడలికి చెప్పేరు ఇరుగుపొరుగు వాళ్లు ఇదుగో సుబ్బమ్మా ఎవురొచ్చారో చూడు అంటూ కదిలించారు. లాబంలేదమ్మా! ఊళ్లో వైద్యుడు వొచ్చి చూసెల్లాడు.

అత్తమ్మా అత్తమ్మా అంటా చెవిలో అరిచింది కోడలు యాడో కొట్టుకుంటున్న పేణంతో బలవంతంగా కళ్లు తెరిసింది. ఏమైంది అనడిగింది.

చెయ్యి పైకెత్తబోయింది గానీ లేవలేదు. కళ్లతో ఏదో అడిగింది. ఆయనా ఆయన రాలేదు. శానా దూరంబోయేళ్లే బయల్దేరాళ్లే వొస్తుండాడు అని చెప్పి పిల్లలిద్దర్నీ నాయనమ్మ దగ్గరగా తీసుకొచ్చి కూర్చోబెట్టింది. ఇద్దర్నీ చూసి కళ్లనిండా ఆనందం తెచ్చుకుంది. వొచ్చీరాని మాటలతో ఏదో గొణిగింది.

అమ్మా తులసి నీళ్లు పొయ్యండమ్మా అంటూ ఎవరో తెచ్చిచ్చారు. కోడలు చెంబు తీసుకోని రెండు చుక్కలు వేసింది. కొద్దిగా గుటక పడింది పిల్లల చేత గూడా ఏయించారు. నెమ్మదిగా పెదాలు కదిలిస్తా కళ్లు మూసుకుంది. నాడి పట్టుకోని చూశారు. ఎక్కడో కొద్దిగా కదులుతుంది.

రెండు రోజుల్నుంచమ్మా ఊరంతా చుట్టబెట్టింది. అందర్నీ పలకరిచ్చింది. ఏందో మిత్తవ తరుంకొస్తున్నట్టుగానే అందరి చుట్టరికాలూ తిరగేసింది. పోయే దీపానికి యెలుగెక్కువ అంటారే మణిసి గూడా వొదవొదలాడతా ఉండింది. ఇంత సంతోషం ఈ మజ్జె కాలంలో ఎప్పుడూ సూళ్లేదమ్మా, పిల్లలు జాగర్తమ్మాయ్, గొడ్లు జాగర్తే మీ ఆయన తాగకపోతే శానా మంచోడే తాగితేనే మీదపడి కొడతాడు. సంసారమన్నాక సమస్యలుంటయ్యిలేమ్మా సర్దుకుపోయి బతకాల అంటా నాకు ఎంత దూరమో చెబుతుందెందుకురా అనుకున్నా ఇందుకంటే ముసిల్దానా అంటూ కొంగు నోట్లో దోపుకుని ఎక్కెక్కి ఏడుస్తోందామె. చుట్టూ చేరిన వాళ్లందరూ కూడా ఆమె చేసిన పనులూ, ఆమెతో మాట్లాడిన మాటలు చెప్పుకుంటూ ఏడుస్తున్నారు.

కోడలు వీళ్లందర్నీ చూసి, వీళ్లిలా ఎందుకేడుస్తున్నారో అర్థంగాక అయోమయంగా చూస్తూ గోడ పక్కనే చతికిలబడింది. పిల్లలిద్దరూ చెరోవైపూ నుంచున్నారు.

అందర్నీ చూసి ఏడుద్దామన్నా ఆమె కళ్లల్లో చెమ్మ తగలడం లేదు. పవిట కొంగు మొహానికడ్డం బెట్టుకుని తల మోకాళ్లపై ఆనించింది. పిల్లలు నుంచున్నచోటే అమ్మ నానుకుని కూర్చున్నారు.

కారు శబ్దం రావడంతో కొడుకొచ్చాడు. కొడుకొచ్చాడు అనడంతో అందరూ అటువైపు చూశారు. కొడుకు కారు దిగి ఎవర్నో పిలిచి సామాను లోపల పెట్టమని పురమాయిస్తున్నాడు. ఆ సామాన్లు తరవాత ఇట్రాయ్యా అనడంతో దగ్గరగా వొచ్చి ఏందంట అంటా తొంగి చూశాడు.

ఇంకా ఏందయ్యా నీ కోసమే పేణం గుటగుటలాడతా ఉంది. రెండు చుక్కలు తులసి నీళ్లు నోట్లో యేసేవంటే దీపం కొండెక్కుద్ది అన్నారు.

చేతి కందిచ్చిన చెంబు తీసుకుని తమలపాకుతో తులసి నీళ్లు బలవంతంగా నోరు తెరిచి నోట్లో బోసేడు.

మింగటానికి ప్రయత్నించినట్టే ఉందిగానీ మింగలేదు.

సుబ్బమ్మ తల వాలిపోయింది. రోదనలింకా మిన్ను ముట్టాయి. ఊరు ఊరంతా తండోప తండాలుగా సుబ్బమ్మని చూడటానికి రాసాగారు. ఇంతమంది జనం అమ్మకోసం ఎందుకొస్తున్నారో కొడుక్కి అర్థం కావడం లేదు.




**మంచికంటి**

ఒంగోలు, 99495 35695


## అంతా సముద్రమే!

| మ | క | రా | ల | య | ము |
|---|---|---|---|---|---|
| క | అం | బు | రా | శి | ర |
| రా | భో | తో | య | రా | క |
| క | ని | ధి | ని | ల | ణా |
| ర | ధి | ని | ల | జ | వ |
| ము | య | ల | ణా | వ | ల |

## ఇదేమిటో...?

చె కం తి
కె కో ట ని
లే ర
లం తా
అం ద చిం

చిందరవందరగా ఈ అక్షరాలన్నీ పేరిస్తే ఒక సామెత వస్తుంది. ఆధారాన్ని పక్కనే ఇచ్చాం. కొన్ని అక్షరాల మీద అంకెలున్నాయి. అంటే ఆ అక్షరాన్ని అన్ని సార్లు వాడుకోవచ్చు. అప్పటికీ తట్టకపోతే 98వ పుటలోకి చూడండి.

**ఆధారం**

ఇంట్లో పిల్లల ఆకతాయి చేష్టలపై పెద్దల వ్యాఖ్య.

## చెప్పుకోండి చూద్దాం!

చిత్రకారుడొకడు చిత్రించు బొమ్మలు
పూర్తి కొరకు తాను బొట్లుపెట్టు
గుర్తుకొరకు తాను గుట్టుగా పెట్టిన
మచ్చ మాయదండి చచ్చువరకు

# దివ్య చైతన్య జ్యోతి

భారత స్వర్ణ ద్వారాలను సుందరంగా -
చిట్టిచెల్లీ! కవితల తోరణాలు కట్టు!
స్వర్ణకాంతులు "తెలుగు వెలుగుల" తోటలో -
చిన్నారి చెల్లీ! నవ చైతన్య దీపాలు తీర్చు!!

జగజ్జనని భవాని కంటి ఎరుపునేనని,
మహిషాసురమర్దని - 'ధర్మత్రిశూల' దీప్తినేనని,
నరకుని కూల్చిన - 'వీరసాత్రాజితి'కి వారసురాలినని -
వరాల చెల్లీ! వెలిగించు "విక్రమోజ్జ్వల జ్యోతి"!!

"సత్యం - ధర్మం - అహింస - కరుణ" - లే
విశ్వశాంతి మందిరానికి మూలస్తంభాలని,
"చీకటిపై - వెలుగు విజయమే" - 'దీపావళి' సందేశమని -
గారాల చెల్లీ! వెలిగించు "ధార్మిక జ్యోతి"!!

మేడలు-మిద్దెలు నిండా దీపాలు వెలిగించి
టపాసులు కాల్చటమే - 'దీపావళి' కాదని
అన్నదాతల బతుకుల్లో - "వెలుగు నింపుటే దీపావళి" అని -
బంగారు చెల్లీ! వెలిగించు "కరుణాజ్యోతి"!!

గుడ్డిగా-'గడ్డి నరకాసురుల'ను తగలపెట్టడంతో
లోకంలో - 'నరకపీడ' తొలగదని చాటి -
"అవినీతి నరకాసురుల మట్టుపెట్టడమే - దీపావళి" అని
సింగారాల చెల్లీ! వెలిగించు - "సత్యాగ్రహ జ్యోతి"!!

అవ్వాయి సువ్వాయి కాంతుల్లో కేరింతలు కొడుతూ
"మతాబుల వెలుగుల్లో - మురియుటే దీపావళి కాదు" -
"అన్నమోరామచంద్రా!" - అనే దీనుల నాదుకొనుటే దీపావళి అని-
కారుణ్యాల చెల్లీ! వెలిగించు - "సౌహార్ద్రజ్యోతి"!!

ప్రతిగుండెలో - విశ్వమానవ ప్రేమసుధలు నింపి,
'శ్రీరామ్ - అల్లా - క్రీస్తు' - భేదాలు లేక - హృదయాల్లో -
"సమతా మానవతా"- కాంతులు నింపుటే - "దీపావళి" అని -
వరహాల చెల్లీ! వెలిగించు " విశ్వకల్యాణజ్యోతి"!!

"రైతన్నల - సంబరాలే - దేశానికి సౌభాగ్యావళి!
చెల్లెమ్మల - చిర్నవ్వులే - దేశానికి శోభావళి!
'యువత' - స్వర్ణభవిత దీప్తే - దేశానికి సుప్రభాతావళి - అని
బంగారు చెల్లీ! వెలిగించు - "దివ్యచైతన్యజ్యోతి"!!

- కళ్యాణశ్రీ జె.వి.రామశాస్త్రి
పాలకొల్లు, పశ్చిమ గోదావరి జిల్లా
08814 223569

## యక్ష ప్రశ్నలు... 11

111. కొండేలు చెప్పేవారి లక్షణం?
112. పరస్పర విరుద్ధమైన ధర్మార్థ కామాలు ఒకచోట ఎలా చేరతాయి?
113. శాశ్వత నరకం ఎలా కలుగుతుంది?
114. కులమా, నడవడికా, వేదాధ్యయనమా, శాస్త్ర శ్రవణమా- దేనిచేత బ్రాహ్మణ్యం సిద్ధిస్తుంది?
115. ఎవడు సంతోషంగా ఉంటాడు
116. ఏది ఆశ్చర్యం కలిగిస్తుంది?
117. ఏది మార్గం?
118. లోక వాడుక/ వార్త ఏది?
119. పురుషుడెవరు?
120. అందరికంటే ధనవంతుడు ఎవరు?

## సమాధానాలు

111. ఇతరులను నిందించటం 112. ధర్మంతో భార్యను చేరితే 113. ధనమున్నా లోభంతో పొరుగువారికి ఇవ్వకుండా- తాను అనుభవించకుండా వుంటే; వేద, ధర్మశాస్త్రాలను నమ్మకపోతే; యాచించే బ్రాహ్మణుని తానే పిల్చి తర్వాత లేదని చెపితే 114. నడవడిక చేత 115. అప్పు లేకుండా, ప్రవాసం వెళ్ళకుండా ఇంట్లోనున్నవాడు 116. ప్రాణులు రోజూ చనిపోతుండటం చూస్తూ కూడా తను మాత్రం స్థిరంగా ఉంటాననుకోవటం 117. పెద్దలు నడిచిన తోవ 118. కాలపురుషుడు అందరినీ హోమం చేస్తున్నాడనేది 119. ఏ పుణ్యాత్ముని పేరు భూమ్యాకాశ పర్యంతం విస్తరిస్తుందో అతడు 120. ఇష్టానిష్టాలూ, సుఖ దుఃఖాలూ, భూత భవిష్యత్తులను సమంగా ఎంచేవాడు

**మాటకట్టు - II సమాధానాలు**

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 న | ర | 2 కం | ■ | 3 త | 4 ల | ■ | 5 గా | ■ | ■ |
| ల | ■ | 6 ద | గా | ■ | 7 ల | గా | య | తు | ■ |
| 8 క | 9 ళం | కం | ■ | 10 ఆ | న | ■ | కు | ■ | 11 ఆ |
| ■ | హ | ■ | 12 రు | చా | ■ | 13 కు | డు | 14 ము | లు |
| ■ | 15 సిం | హం | ■ | రం | ■ | ను | ■ | 16 ది | మ |
| 17 వి | ■ | ■ | 18 డు | ■ | 19 అ | కు | టు | ■ | గ |
| 20 నా | 21 దం | ■ | 22 కు | 23 కి | టు | ■ | ■ | 24 వా | లు |
| 25 శ | తం | ■ | 26 పా | ట | ■ | 27 స | ర | యు | ■ |
| నం | ■ | 28 మే | ■ | 29 తా | మ | ర | ■ | 30 వ్యం | గ్యం |
| ■ | 31 కో | డ | లు | ■ | ■ | 32 సం | త | ■ | ■ |


BOSE®
Wireless.
Ultra-compact.
Better sound.
You take your keys, wallet and phone.
Now take BETTER SOUND too!
Introducing the NEW
Bose SoundLink™ Mini
Bluetooth® Speaker
Experience full, natural sound from an ultra-compact speaker that fits in the palm of your hand.
The speaker connects wirelessly to your smartphone, tablet or other Bluetooth® device, so you can listen to your music anytime, anywhere.
Its lithium-ion battery allows up to 8 hours of unplugged play time.
Just grab it and go!
Customize it with the optional covers to fit your unique style
Visit www.Boseindia.com/SoundLinkMini
Call 1-800-11-BOSE(2673) | SMS "SLM" at 989 970 2673
Please quote the reference no. TVI4-03
The Bluetooth word mark and logos are registered trademarks owned by Bluetooth SIG, Inc

మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| పుస్తకం సంఖ్య | KRSA101M242 |
| --- | --- |
| పుస్తకం పేరు | తెలుగు వెలుగు |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 101 |
| పెద్ద సైజు పేజీలు | |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | sruthishu |
| పేజీలు విడదీసినది | sruthishu |
| స్కాన్ చేసినది | F.Daveed |
| పరీక్ష చేసినది | hema |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |